......... ఈ సంపుటిలో.........





# 'ప్రేమా పెండ్లి'

"మనుమరాలు పుట్టిందన్న ఆనందంతో పాటు జన్మనక్షత్రం మంచిది కాదన్న అదటుకూడా జనించింది మా అమ్మకి. నరసింహంగారిని కనుక్కుంటె అమ్మమ్మ గండం అని చెప్పాడేమో అని తోస్తోంది. పోనీ, పెద్దది కదా...ఆవిడ చెప్పినట్లు పీటలమీద కూర్చుని ఆ కాస్త శాంతీ అయిందనిపించకూడదూ ?" అంది బాలెంతరాలైన సౌభాగ్యమ్మ మొగుడుతో.

"నీకూడా పిచ్చేనా ఏమిటి ? బ్రహ్మిగాళ్ళు మేకల్లా అరుస్తూంటే ఆ పొగలో ఘంటలు తరబడిని, ఎందుకోసమో తెలియకుండా ఎందుకూ పీటలమీద కూర్చోడం ? మీ అమ్మకేమీ భయంలేదులే !"

"పీక్కుతింటూన్న అనుమానాన్ని నివారణ చేసుకోడానికే పీటల మీద కూర్చోడం."

"అల్లాగైతే, రోజూ లక్ష అనుమానాలుంటూనే వుంటాయి. అవన్నీ నివారిస్తూ కూచోడమేనా మనపనీ ? తొలిచూలు పిల్లగనక ఆనందంగా కావలిస్తే మన ఊరువెళ్ళాక నలుగుర్నీ ఎరుగున్నవాళ్ళని పిలిచి, ఓ టీపార్టీ ఇద్దాం."

"మనం ఊరువెళ్ళేక సరే మీరు చెప్పినట్లు చెయ్యవచ్చు. కాని ఓ మాటు పీటలమీద కూర్చుని క్రొత్తబట్టలతో లేస్తే మా అమ్మ చూసి ఆనందిస్తుంది. పనిలోపని నామకరణంకూడా చేసెయ్యొచ్చు. మావాళ్ళు ఎరుగున్న నలుగుర్నీ భోజనాలకి పలుచుమని ఆనందిస్తారు."

"నామకరణానికిక్కడ శాంతి చేసుకోక్కర్లేదు. అవధాన్లకి కట్నం ముట్టచెప్పి, బియ్యంమీద అక్షరాలు వ్రాస్తేనేకాని నామకరణం అవదా ఏమిటి? ఆ టీపార్టీనాడే రంగయ్యనాయుడుగారిచేత ఒక ప్రార్థన చేయించి, పేరు పెట్టించొచ్చు."

పురుషోత్తం ముఖంకేసి ఓ చూపు చూసింది సౌభాగ్యమ్మ. వాదించడంవల్ల ప్రయోజనం లేదని ఊరుకుంది.

మరునాడూ ప్రురుటి నుది. పురుషోత్తం "భాగ్యం, ఇవాళ ఇంట్లో కాఫీ కాచడానికి తీరుబడి లేనట్లుగా ఉంది. హోటలుకు పోయొద్దునా?" అన్నాడు.

"ఇల్లారండి ఒక్కమాటు" అని వినపడింది సౌభాగ్యమ్మ కంఠస్వరం. పురుషోత్తం లోపలికి వెళ్ళేడు. సౌభాగ్యమ్మ అగుపించలేదు అతనికి మొదట. ఎర్రశాలువా తెరగా అటూహాడూ ఇటూహాడూ పట్టుకుని భావమరదులిద్దరూ నిలబడ్డారు. నూనెతోనిండిన మూకుడొకటుంది దక్కడ.

పురుషోత్తం మాట్లాడలేదు. "పీటమీద కూర్చుని ఒక్కమాటు నూనెలో చూడండీ" అంది సౌభాగ్యం. "నాన్ సెన్స్" అన్నాడు పురుషోత్తం అవమానించబడినవాడిలా. భావమరదుల ముఖాల్లో రక్తం లేదు. సీతమ్మగారు అల్లుడికి అగుపించకుండా ప్రక్కకు తప్పుకుంది. "అదిగో, ఇదుగో, అమ్మాయిని చూడండీ నిద్రలో ఎల్లా నవ్వుతోందో. త్వరగా! త్వరగా చూడండీ!" అంది సౌభాగ్యం. పురుషోత్తం అప్రయత్నంగా పీటమీదికి మోకాళ్ళపైని వంగేడు. అతనికి ప్రతిబింబం అగుపడింది. "ఉత్తది నవ్వూలేదు ఏమీలేదు!" అన్న మాటలు వెలువడ్డాయి అతని నోటమ్మట. తెర లాగేశారు మరదులు. "అస్తమానూ నవ్వుతోనే ఉంటుంది. ఈమాటు చూపిస్తా!" అని సౌభాగ్యమ్మ పిల్లని తీసుకుని పీటమీదనుంచి లేచింది.

౨

పురుషోత్తం దగ్గరనుంచి ఉత్తరాలమీద ఉత్తరాలొస్తున్నాయి. సౌభాగ్యమ్మనీ పిల్లనీ పంపమని. పురుటి శుద్ధినాడే తల్లీ పిల్లలను తీసుకు వెడదామని వచ్చాడు. సీతమ్మగారప్పుడు "పుణ్యస్నానం ఎత్తింది. నాలుగు పథ్యాలు వంటపట్టాక తీసుకువెడుదుగాని" అంది. "వీల్లేదని కొంచెం పట్టుపట్టాడు. కాని సౌభాగ్యమ్మ "నే నిప్పుడొస్తే మీ హస్తపాకం చూపించవలసొస్తుందేమో!" అనే చిన్న సమస్యను వదిలెయ్యడంవల్ల అత్తగారిమాట తీసివెయ్యకుండా వెళ్ళాడు పురుషోత్తం అప్పుడు. మూడోనెల రావడం

తోనే మంచిరోజు చూసి, సీతమ్మగారు సౌభాగ్యమ్మని ప్రయాణం చేసింది. బండి ఎక్కుతూంటే, ఆ యిల్లాలు కూతురుదగ్గరకొచ్చి, నిమ్మళంగా "అమ్మడూ, ఆ తొమ్మిదో రోజున నీకు వచ్చిన దడ చూసి హడలిపోయాను. ఆ వెంకటరమణమూర్తి దయవల్ల బ్రతికావు. ఉపేక్ష చెయ్యక తిరుపతి వెళ్ళి మొక్కు చెల్లించుకోండి" అంది. "అల్లాగే నమ్మా" అంది సౌభాగ్యమ్మ. "గుళ్ళో దేముడని కొలిచే రాతికీ, గుమ్మం క్రింద మెట్టుగా ఉపయోగించే రాతికీ భేదమేమీ లేదనే భర్తగారు తిరుపతి ప్రయాణాని కొప్పుకుంటారా ?" అని మనస్సులో ఆమె అనుకుంటుండగానే, అన్న పద్మనాభం "పోనియ్ బండి" అన్నాడు. చక్రాలు కదిలిపోయాయి. సీతమ్మగారికి కన్నీరడ్డమైంది. "చంటిపిల్లతో సుఖంగా అది వెడుతూంటే కంటతడి కూడ"దని చెంగుతో కళ్ళొత్తుకుంటూ సీతమ్మగారు లోపలికెళ్ళిపోయింది.

## 3

ఇన్విటేషను కవర్లమీద ఎడ్రసులు రాయడం ముగించి, అతిథుల లిస్టుతోపాటు వాటిని నౌకరు కుర్రవాడికిచ్చి, పురుషోత్తం వంటింటి దగ్గర కొచ్చాడు.

"నీ ఉద్దేశమేమిటో తేల్చావు కాదు" అన్నాడాతడు భార్యతో.

"దీనికింత ఆలోచనెందుకండీ మీ అమ్మగారి పేరు పెట్టక ?" అంది తోలిచి పట్టుకొచ్చిన పెద్ద సత్తుగిన్నెలో పెరుగుపోస్తూ, ఆమె.

"మీ అమ్మపేరే పెడదాం" అని నాచే అనిపించడానికి కాబోలు ఇల్లా అనడం ?"

"కాదండీ మా అమ్మపేరు ఎల్లాగా పెట్టమనను మా అమ్మపేరు కంటే ముందుగా చచ్చి స్వర్గస్థురాలై ఉన్న అత్తగారి పేరు పెట్టాలి. అది లోకాచారం, ముందు ముందు అవకాశం ఉంటే మా అమ్మ పేరెల్లాగా పెడతాం."

"సింగినాదం. లోకాచారమేమిటి ? ప్రతిదానికీ 'ఆచారం ఆచారం' అంటావు."

"ఆచారంమాట అల్లా ఉంచండి. పెద్దవాళ్ళ పేరు పెట్టడం ఉంటే వాళ్ళమీదఉన్న ప్రేమ, గౌరవం తెలియచెయ్యడం అన్నమాట."

"మా అమ్మపేరు పెట్టకపోతే ఆవిడమీద గౌరవం లేదన్నమాటేనా ఏమిటి? పేరు పెట్టినంత మాత్రం ఊహూ—ప్రేమ, గౌరవం కారిపో తాయి కాబోలు!"

"సరే, అల్లాగయితే ఏదో ఆలోచించి పెట్టెయ్యండి"

"ఇంతకంటే ఏమీ తోచలేదన్నమాట."

"నే పేరుచెప్పినా మీకు నచ్చదు...పోనీ పార్వతీదేవి పేరో, లక్ష్మీదేవి పేరో పెడితే?"

పురుషోత్తం ఆలోచించాడు. "పార్వతి" అనేది మూడక్షరాల పదం. రెండక్షరాలకంటె ఎక్కువ ఫేషన్ కాదు. "లక్ష్మి" అంటే బాగుంది. కాని పేరు క్రమంగా "లచ్చమ్మ" అని వాడుకలోకి వస్తుంది. "ఇందిరా లోకమాత మా రమా మంగళదేవతా" ఇందులో రెండక్షరాలమాట "రమ" కాని ఇంతకీ "లక్ష్మి" అనే అర్థం రావాల నెక్కడుంది? ఇంకా లక్ష పేర్లయిన్నాయి. "ఉమా కాత్యాయనీ గౌరీ కళ్యాణి సర్వమంగళా!" "వాణి" కూడా మంచిపేరే...ఇల్లా అనుకుంటూ చటుక్కుని అనుకుంటూ న్నదాని విమర్శించుకున్నారు. "ఇదేమిటి తెలివితక్కువ? దేవతలపేర్లే పెట్టాలనుకోవడమేమిటి? ఇదొక మూఢాచారానికి వశం అవడమన్నమాట" అందుచేత ఆ తలంపు మారిపోయింది ఆయనలో. "సావిత్రి, చంద్రమతి, లోపాముద్ర, సుకన్య..." ఈ జాబితా ఏకరు పెట్టుకున్నాడు. ఈపేర్లన్నీ పెద్దవిగానే తోచాయి. అంతేకాకుండా, ఈపేర్లు పెట్టడంలో అర్థమేమిటి? వాళ్ళంతా ఆదర్శ స్త్రీలనా? వీళ్ళంతా పుట్టిన పురాణాలలో వాళ్ళేగా. ఆ చరిత్రలు యధార్థం అవుతేగా అల్లాంటి స్త్రీలున్నారనుకోడానికి? "సుశీల, సరోజిని"...పోనీ, "ఝాన్సీ" ఎల్లాగుంటుంది? ఫష్టుగా ఉంటుంది. కాని ఈ పేరు చాలామంది పెట్టేశారు...ఎన్నివిధాల ఆలోచించినా ఆలోచించినా పురుషోత్తమానికి కూతురుకి ఏ పేరు పెట్టాలో తేలిందికాదు. "నీ మొహం నిన్నేమి సలహా అడిగినా యింతే..." అంటూ పైకి వెళ్ళాడు ఆ యజమాని.

వేదవేదాంగాలు శాస్త్రాలు చదివి, ఘోరమైన తపస్సుకూడా చేసి, విఫల మనోరథుడైన సిద్ధార్థుడు తుదకు అశ్వత్థవృక్షం క్రిందకు వచ్చి బుద్ధ

డైనట్లు, పురుషోత్తం, వంటింటిగుమ్మర మొనదుతో ఎంతో కుస్తీపట్టి లాభం లేక మిద్దెమీదికెళ్లి ఒక్క నిమిషం ఆలోచించి సిద్ధార్థుడయ్యాడు. కొలంబస్ అమెరికాను కనిపెట్టినప్పుడు అతడు పొందిన సంతోషానికి రెట్టింపు ఉల్లా సంతో గబగబా క్రిందకొచ్చి "సౌభాగ్యం!" అన్నాడు పురుషోత్తం.

"ఏమండీ?"

"మన అమ్మడు మూర్తీభవించిన మన అన్యోన్యానురాగం. దీనికి "ప్రేమ" అని పేరు పెడదాం. "ప్రేమా" అని పిలుచుకోవచ్చుతే. ఊఁ?"

సౌభాగ్యమ్మ తల త్తకుండానే, "బాగానే ఉందండి" అంది.

సౌభాగ్యమ్మ "అనెడ్యుకేటెడ్" అయినా తాను చెప్పిన వచనాల్లో ఉండే పరమార్థాన్ని సూక్ష్మంగా గ్రహించగలిగినందుకు సంతోషిస్తూ పురుషోత్తం సంతృప్తి గనపరిచాడు.

## ౪

పురుషోత్తం భోజనం చేస్తున్నాడు. "ఏమండీ?" అంది సౌభాగ్యం.

"ఏం?"

"ఉత్తరం వచ్చింది మావాళ్ళ దగ్గరనుంచి చూశారా?"

"లేదు. ఏమిటి విశేషాలు?"

"మా రామానికి కార్యమట."

"ఊహూ!"

పురుషోత్తం మాట్లాడకుండా భోజనం చేస్తున్నాడు. కర్తవ్యం ఎరుగున్నది గనుక సౌభాగ్యం "మనల్ని అందర్నీ బయలుదేరి రమ్మన్నారు" అంది.

"అందుచేత ఇప్పుడు బయలుదేరుతా నంటావేమిటి?"

"వెళ్ళక్కర్లేదు మరి? మావాళ్ళ యింట్లో ఇక యిప్పట్లో జరిగే శుభకార్యం ఏమీలేదు."

"రైళ్ళమీదా, పడవలమీదా ఈ వేసవికాలంలో వ్యయప్రయాసలతో ఎందుకంత దూరం వెళ్ళడం?"

"వ్యయప్రయాసలని ఊరుకుంటే బాగుంటుందా? వెళ్ళకపోతే ఎల్లాగ? చెల్లెలి కార్యం అవుతోన్నప్పుడే వెళ్ళకపోతే ఇంకెప్పుడు పుట్టింటి కెళ్ళడం?"

"మీ చెల్లెలి గర్భాదానానికి నువ్వెందుకూ? మనలో ఉండే గొప్ప "న్యూసెన్సు" ఇదే. ఒక పిల్లకి శోభనం అవుతూంటే పదిమందీ చేరి పనులూ విడిచేసి నానాగల్లంతూ చెయ్యడం దెబ్బలాడుకోవడం... ఇంతకీ ఇప్పుడిప్పుడే స్కూలుకు వెళ్ళిరావడం అలవాటవుతోంది ప్రేమాకి. ఇప్పుడు దాన్ని తీసుకుపోతే "ఇదిగో అదిగో" అని ఎల్లాగైనా తిరిగి రావడానికి పదిహేను రోజులు పడుతుంది. ఈ పదిహేనురోజులూ అడ్డగాడిదల్లాగ తిరిగే ఆ పిల్లలతో కలుస్తే ఇంక దానికి స్కూలుమాట చెప్పక్కర్లేదు."

"దూరాన్ని పడున్నాము. ఎప్పుడో ఇల్లాంటి సందర్భాల్లో తప్ప ఇల్లు కదలడమే పడదు. ప్రేమా పుట్టిన తర్వాత ఏ శుభకార్యం నే చూడలేదు. అల్లాంటి సరదాలేమీ తీరలేదు."

"శుభకార్యాలు చూడ్డం సరదా అవుతే, నాయుడుగారి తమ్ముడు కూతురి పెళ్ళిట. ఇన్విటేషనొచ్చిందప్పుడే. దగ్గరకూడాను, వెళ్ళిరా."

"చెల్లెలికి శోభనం అవుతే వెళ్ళడం మానేసి, నాయుడుగారింటో నేనా కాదు, ఆయన తమ్ముడింట్లో పెళ్ళికా వెళ్ళడం?" అనుకుంది మనస్సులో సౌభాగ్యం.

"ఆయనకి దేవస్థానంలో పెద్ద ఉద్యోగం. పలుకుబడున్నవాడు. పెద్ద హాయాలోవాడు. కావలిస్తే నీ చాదస్తానికి సరిపడేట్లుగా టిఫిను వగైరాలన్నీ నీకు బ్రాహ్మలింట్లోనే ఏర్పాటు జరుగుతుంది."

"దేవస్థానం" అనేటప్పటికి సౌభాగ్యమ్మకి వళ్ళు ఝల్లుమన్నట్లు తోచింది. "తిరుపతి వెంకటరమణా, నీ దర్శనం చేయిస్తానని మా అమ్మ, ఈ పిల్లపుట్టినప్పుడు—అంటే అప్పుడే ఏడేళ్ళయింది — మొక్కుకుంది. నీ దర్శనభాగ్యం నే నెంత ప్రయత్నం చేసినా లభించలేదు. నే దప్రయత్నంగా నిన్ను చూసేమార్గం లభిస్తోంది."

"అప్పుడే కునికిపాట్లొస్తున్నా యేమిటీవేళ?" అన్నాడు పురుషోత్తం పరధ్యానంలో ఉన్న సౌభాగ్యాన్ని చూసి.

"దేవస్థానంలో పెద్ద ఉద్యోగం అన్నారు, ఏమిటండీ అది?"

"తిరుపతి దేవాలయానికి వచ్చే ఆదాయం, అయ్యే వ్యయం తెలిపే లెఖల్ని సరిచూడడం."

విగ్రహారాధనను దూషించే కుటుంబంలో వాడికి, వెంకటేశ్వర భగవానుని జమాఖర్చులు చూసే ఉద్యోగం అవడం కొంచెం అసభ్యంగా తోచిందామెకు.

౨

"ప్రొద్దుటనుంచీ అనుకోడం, అని తీసుకొస్తే ఇల్లా వేపుతున్నావు నన్ను. పెళ్ళి చూశాం. వచ్చిన పనయింది. సాయంత్రానికి ఇంటికెళ్ళకపోతే ఎల్లాగ? రేపు సోమవారం బడికదా ప్రేమాకి? పైగా నా ఆఫీసు" అన్నాడు పురుషోత్తం.

"క్రింద తిరుపతి కొచ్చినవాళ్లు కొండమీద కెళ్ళకుండా పోతారా ఎవరైనా? ఇది వేపడమా?"

"ఏడుమైళ్ళెక్కాలి. అందులో మోకాలి పర్వతంట! అదెక్కితే మజా తెలుస్తుంది."

"నడవలేకపోతే డోలీలు కట్టించుకోవచ్చు?"

"బ్రతికుండగానే నరవాహనమా?"

"ఎప్పుడూ ఇలాంటిమాటలేనండీ మీరు? చెన్నపట్టణంలో, రిక్షా లెక్కి వెళ్ళేవాళ్ళే కాదూ చాలామంది? వాటికంటే తీసిపోయిందా ఏమిటి డోలీ?"

"అమ్మగో, వాదించండం అంటే భయం. ఆతర్కమే వద్దంట."

"వ్యవహారం చెడిపోతోం"దనుకుంది సౌభాగ్యమ్మ. "తర్కం కాదండీ, కొండమీద చూడవలసిన ప్రకృతి వైచిత్ర్యాలు చాలా ఉన్నాయిట! పాపనాశం అనేచోట ఒక జలపాతం ఉందిట! ఆ ప్రదేశం అంతా మనోహరంగా ఉంటుందిటండీ...నాకేం తెలుసు! ఇదంతా నాయుడుగారు ఎవరితోనో చెబుతోంటే విన్నా నిందాక."

"అల్లాగైతే వాళ్ళెవరైనా వెళుతూంటే వెళ్ళు. నేనుమాత్రం ప్రయాస పడదలచుకోలేదు. సాయంత్రాని కొచ్చెయి...జాగ్రత్త. నేనే

రైలులో వెడతాను. పోనీ ప్రేమానుకూడా తీసుకెడితేనేం నాతో రేపూ ? ఎందుకూ స్కూలు చెడగొట్టడం ?»

ఈ మాట వినేటప్పటికి సౌభాగ్యమ్మకి ఏమీ తోచిందికాదు. తాను రాకపోవడం సరిగదా, పిల్లనుకూడా రానియ్యనంటున్నాడు భర్త. «నేనూ వెడతాను అమ్మతో» అంది ప్రేమా. సౌభాగ్యమ్మకి ప్రాణాలు లేచొచ్చాయి. «సరే» అన్నాడు పురుషోత్తం బయలుదేరుతూ. «స్టేషనుకి కారు పంపడం మరచిపోకండి» అంది సౌభాగ్యం.

పాపనాశనం జలధారదగ్గరున్న ప్రకృతివైచిత్రాలు చూడడానికి బయలుదేరినవాళ్ళతో బాటు, సౌభాగ్యం, ప్రేమా వెళ్ళారు కొండమీదికి. ఆలయప్రాంతాలకు జేరుకున్నాక, సౌభాగ్యమ్మ «ఏమిటో అనుకున్నా ! బడలికగావుంది ఈ సత్రములో విశ్రాంతి తీసుకుంటూ ఉంటా. మీరు నాలుగుచోట్లూ తిరిగిరండి» అని వెనక దిగడింది పిల్లతో. అనంతరం ప్రేమాను తీసుకుని దేవాలయంలోకెళ్ళి, మెడలో పసుపుకొమ్ము కట్టుకుని మంగళసూత్రము దేవుని కర్పించి ఓ నమస్కారం పెట్టింది.

అనుకున్న వేళకి మరునాటి మధ్యాహ్నానికి తల్లీ పిల్లా ఇంటికి చేరుకున్నారు, కొనుక్కున్న చందన బొమ్మలూ, ఇత్తడి సామగ్రీ పట్టుకుని.

౨

«ప్రేమా, పడుకోవమ్మా పదిగంటలవొచ్చింది జబ్బుకూడా అల్లా అల్లా మేలుకుని చదువుతే» అంటోంది సౌభాగ్యమ్మ.

«పగలు చదువుతే చాలమ్మా, రాత్రిళ్లు మేలుకు చదువక్కర్లేదు. కావలిసొస్తే ఇంకా తెల్లవారగట్లలేచి చదువు.»

«మీకేం ? ఊరికే 'పడుకో' 'పడుకో' మని చంపుతారు. వాళ్ళ శారద ఎలాగ ప్రయత్నం చేస్తోందో తెలుసా ఫస్టుమార్కు కొట్టెయ్యడానికి ? ఒక్కమారైనా అప్షనల్స్‌లో ఫస్టుగా రావాలనుకుంటూంది... అవును కాని క్వాడ్రేటిక్ ఈక్వేషన్ ఇచ్చి దాని రూట్స్ ఈక్వల్ అన్న కండిషన్ ఇచ్చి, సీ వాల్యూ కనిపెట్టమన్నాడు. అప్పుడు సిస్క్వేర్ ఈస్ ఈక్వల్టూ ఫోర్ యేసీ అన్న పద్ధతిలోనేనా చెయ్యడం ?»

వాళ్ళలో ఎవరూ లేరు. మనకి మల్లేనే ఈ ఊళ్ళో స్థిరపడి ఉండిన మన వాళ్ల కుటుంబం ఏదైనా ఒకటుండి, వాళ్ళల్లో ఈడైన కుర్రవాడుంటే పెళ్లి పెద్దదయాకే చెయ్యొచ్చు. కాని అల్లాంటివాళ్ళెవళ్ళూ లేరు. అందు చేత తొందరపడాలి."

"ప్రేమూ బి. ఏ. ప్యాసవనియ్ చెప్తాను! దాని సౌందర్యం చదువూ చూసి, కళ్ళకద్దుకుని పెళ్లిచేసుకునేవాళ్లు లక్షమందున్నారు. మన శాఖలో కాకపోతే అన్యశాఖాయిరి '

ఆముక్కవిని అదిరిపడింది సౌభాగ్యమ్మ. "అంతశ్శాఖావివాహమే?"

పురుషోత్తం జంధ్యం పారవెయ్యకపోయినా, బ్రాహ్మసమాజం మీటింగుల కెళ్ళడం, యుక్తాయుక్తాలు లేకుండా 'పూర్వాచారం' అన్నమాత్రాన్ని మండిపడ్డం, బ్రాహ్మణేతరులతో విందులు గుడవడం—ఈ చేష్టలన్నీ సౌభాగ్యమ్మకి పరిచయమే. కాని ప్రేమూ వివాహవిషయంలో వరాన్వేషణ అన్యశాఖలో జరుగబోతోందని ఆమె అనుకోలేదు.

అల్లాంటి వివాహం జరుగుతే! ఇంకేముంది? వెలి. 'వెలి' అంటే అంత పట్టింపులేనిమాట నిజమే—కాని వాళ్ల జావకి అక్కయ్యగాని, రామంగాని వస్తారా ఆ పెళ్ళికి? అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లే రాకపోతే ఇంక బంధువులమాట చెప్పక్కర్లేదు కదా. పోనీ ఎవరూ పెళ్ళి పేరంటానికి రాకపోవచ్చు... కాని ఈ భావిదంపతుల మాటేమిటి? ఈ శాఖాసంకరంలో కలిగిన సంతానం మాటేమిటి? అప్పటికి శాఖలన్నీ కలసిపోతాయేమో? ఇంతకీ నిశ్చయంకాని భావికాలంమీద ఆధారపడి వర్తమానాన్ని ఉపేక్షచెయ్యడ మెందుకూ? ఇంతక్షూ అంత అవసరంలేందే ఎప్పటిదాకానో కనుపెట్టుకుని అప్పుడు అన్యశాఖలోంచి ఒకణ్ణి వెతికి తీసుకురావడానికి? బాల్యవివాహాలు నిషేధమే. కాని ప్రేమూకి పద్ధానుగో ఏడు వెళ్ళిపోతోంది. అజ్ఞానికాకుండా చదువుకుంటూంది. చదువుకుంటూ, తగినవసతుండియీడుకి తగిన కుర్రవాళ్ళు స్వశాఖలో ఎంతమందో ఉన్నారు. కనుక, ప్రేమూకి పెళ్ళిచెయ్యడం శ్రేయస్కరం ఇప్పుడు. ఇట్టి పరిస్థితుల్లో అన్యశాఖ కెందుకూ వెళ్ళడం. కేవలం 'మార్గదర్శకులవుదాం' అనే ఉద్దేశం ఉంటే తప్ప? స్వశాఖలో వరాభావం లేనప్పుడు మార్గదర్శకత్వం కోసం సాటుపడ్డం కొరవితో తలగోక్కోడం. దానివల్ల అనర్థాలు మెండుగా

ఉంటాయి. 'నేను సంస్కారిని' అనే అహంకారంతో కూడుకున్న ఉద్యమం ప్రేమాయొక్క భావిభాగ్యానికి హాని లేవచ్చు...

ఒకదానివెనుక ఒకటిగా ఆలోచనలు సౌభాగ్యమ్మ మనసులో పరుగెత్తేయి. ఇదంతా భర్త వింటున్నాడనే తోచిందామెకు. "కనుక నా మాట విని వాళ్లే చంద్రశేఖరానికిచ్చి చేసేద్దాం. పెళ్ళి" అన్నదామె.

"అబ్బ నాకు నిద్దరొస్తోంది. చంపకు" అన్నాడు పురుషోత్తం.

## 3

ప్రేమా ఇంటర్మీడియట్‌లోకి వచ్చింది. యౌవన పుష్పం ఆమెలో వికసించింది.

స్వశాఖలో వివాహం కాకుండా ఉన్న యువకులందరికీ పెళ్లిళ్ళవుతున్నాయి. ఒక్కొక్క శుభలేఖవచ్చి సౌభాగ్యమ్మ హృదయంలోని ఆశాలతలలో ఒక్కొక్కదాన్ని నిర్మూలిస్తూంది. 'కొంచెం కాలం ఆగ'మని చంద్రశేఖరం తల్లికి రహస్యంగా ఓ ఉత్తరం వ్రాసింది. ఆఖరుకి ఆ పెళ్లి శుభలేఖకూడా వచ్చింది. అవును. అసలు అభిప్రాయాలేమిటో తెలియకుండా పురుషోత్తంగారి ఆధారపడి ఎంతకాలం ఆగుతారు వాళ్ళుమాత్రం ?

సౌభాగ్యమ్మ ఏమిచేయగలదు ? మగని కిష్టంలేని విషయాల్లో, తన మనస్సంతుష్టికోసం ఆచారవ్యవహారాల్లో కొంచెం స్వతంత్రించినా, ఆమె అతని మనస్సుకి కేవలం కష్టంతోచకుండా తన బుద్ధినైపుణ్యం చూపిస్తో గడుపుతోంది కాలం. కాని కూతురుపెళ్లి విషయంలో ఎటువంటి స్వతంత్రం తీసుకోగలదు ? ధైర్యంచేసి స్వతంత్రించి చెయ్యడానికి, ఇదేమైనా అజ్యావీక్షణా, తిరుపతియాత్రా లాగ స్వల్పవిషయమా ? ఇందులో తన బుద్ధినైపుణ్యం ఏమి కనుపర్చగలదు ? వివాహ విషయంలో ఏమాత్రమైన స్వతంత్రం జూపినా తనకు శాశ్వతమైన ఎడబాటన్నమాట భర్తతో.

తన భర్తకి 'సంఘ సంస్కారి' అని అనిపించుకోవాలనే ఈ కోరిక ఏమిటో ? సంఘంలో మంచివరుడు లేక పిల్లని ఏ వృద్ధునికో, ఏ దౌర్భాగ్యుడికో ఇచ్చి కట్టిపెట్టవలసొచ్చినప్పుడు, త్యాగం చూపించి, సంస్కారి కావలసినదే. అవసరం లేనప్పుడెందుకూ సంస్కారం ? ఆయన, తిరుపతిలో అయినపెళ్లి పువ్వుల దండలతోటీ, ప్రార్థనలతోటి జరిగిందని, అది చాలా

కష్టంగా ఉండనీ, ఎన్నిమాట్లో అభినందించారు. పంతులుమాత్రం ప్రోత్స హించారా? ఈ పెళ్ళిలోమాత్రం తెంపు ఏమి తగ్గింది?...

ఇలాంటి ఆలోచనలతో నిండిన మనస్సుతో ఒకనాడు సౌభాగ్యమ్మ గుమ్మందగ్గర, లోపల చదువుకుంటున్న ప్రేమను చూస్తూ నిలబడింది.

ప్రేమా "అమ్మా, ఏమిటే అలాగ చూస్తున్నావు?" అంది. ఏమి చెప్పటానికి తోచక, "ఊరికేనే, ఏమీ లేదు" అంది తల్లి.

"నాకు ఈ తెలుగో పెద్దబాధయిపోయిందమ్మా. కాన్వెంటులో చావకొట్టేరు తెలుగు చెప్పమంటేత అశ్రద్ధచేశా ఈ సబ్జక్టు. కాలేజిలో కంపల్సరీ అయిపోయింది. అంటే, ఇందులో మార్కులు సరిగ్గా రాకపోతే ఉంచేస్తారన్నమాట."

"ఏదీ, నేనేమైనా చెప్పగలనేమో చూద్దాం. అసలు నీకేం కావాలో" అంది సౌభాగ్యమ్మ ప్రేమా దగ్గరకు వెళ్ళి.

ప్రేమా తెలుగు సెలక్షన్సు ఒకటి ముందేసింది. "ఈ పద్యాన్నీ, ఈ పద్యాన్నీ కంపేర్ చేస్తూ కామెంటు వ్రాయాలిట. అంటే పోలిక చూపిస్తూ వ్యాఖ్యానం వ్రాయమన్నమాట" అంది ప్రేమా.

ఆ రెండు పద్యాలూ చదివింది సౌభాగ్యమ్మ. "అమ్మాయీ, ముందుగా నే చెప్పినది విననీ. నువ్వు ఎలాగ వ్రాస్తే సరిపోతుందో మార్కులొస్తాయో ఆలోచించుకొని ఆ ఫక్కీలో వ్రాసుకో... మొదటి పద్యం చూడు. ఇది ప్రహ్లాదుడన్నది. 'భగవంతుడు సర్వాంతర్యామి' అని తండ్రికి చెపుతున్నాడు. 'ఇందుగలడందు లేడని సందేహము వలదు' అంటున్నాడు. ప్రహ్లాదుడు మహాభక్తుడు. తల్లి గర్భంలో ఉన్నప్పుడే విష్ణుభక్తి కుదిరిన వాడతనికి. అందుచేత భగవంతుడున్నాడా లేడా అనే సందేహం ఎప్పుడూ లేదు. 'భగవంతుడు సకల చరాచరాంతర్యామి' అన్న మనోనిశ్చయం అతనికి ఉండడంచేత 'చక్రి సర్వోపగతుండు' అని నిక్కచ్చిగా చెప్పేశాడు. 'కలడన పద్యం చూడు' ఇది గజేంద్రుడు చెప్పినది. ఈతడూ భక్తుడే. కాని ప్రహ్లాదునివంటి భక్తుడు కాడితడు. మొసలిచేత పీడింపబడుతూ కొన్ని సంవత్సరాలు దానితో యుద్ధంచేసి అప్పుడు భగవంతుడే రక్షించాలనుకుని ప్రార్థన మొదలెట్టాడు. భగవంతుని స్వరూపం ఎలాంటిదో గజేంద్రునికి ప్రహ్లాదునికి తెలిసినట్లు తెలియదు. అతని జ్ఞానం అంతా వినికిడిమీద ఆధార

పురుషోత్తం ఏమీ చెప్పలేదు. బి. ఏ, రెండేళ్లలో పూర్తిచేస్తే ప్రేమకు పెళ్లి చెయ్యవచ్చు అనుకున్నాడు. "రెండేళ్ళకంటే ఆలస్యం చెయ్యడం ఎందుకూ ?" అని ఉద్దేశపడ్డాడు. అందుకే చాలా కాలం పడుతుందనన్నాడు. కాని తన ఉద్దేశం ప్రేమకి తెలియనివ్వాడు కాదు. కొంచెం సేపుండి "సరే" అన్నాడు. తండ్రి ఏదో ఆలోచిస్తున్నాడని తెలుసుకుంది ప్రేమ. "పోనీ, నీయిష్టం. బి. ఏ చదవమంటే బి. ఏ. చదువుతా!" అంది. "ఎందుకూ ? వద్దు. మెడిసిన్ చదువు" అన్నాడు, "ప్రేమా ఇచ్చకి ఎందుకూ అడ్డురావటం ? దాని ఇష్టమొచ్చినదే చదువుతుంది. పెళ్లికేం ? ఇంకో కొంతకాలం ఆలస్యమవుతుంది—అంతేగా ?" అనుకున్నాడు పురుషోత్తం.



'హిందూ' మడతవిప్పి పేజీలు తిరగేస్తున్నాడు. పురుషోత్తం, అందులోఉన్న ఓ ఫోటోమీద దృష్టి సారిస్తూ, "భాగ్యం"అని పిలిచాడు సౌభాగ్యమ్మ వచ్చింది. "ప్రేమాబొమ్మ పడింది చూశావా ?"

టెన్నిస్ రేకెట్టు చేతపుచ్చుకుని ప్రేమా కుర్చీలో కూర్చుని ఉంది ఆ బొమ్మలో. ప్రక్కనే ఓ యువకుడు నిలబడి ఉన్నాడు. వారిద్దరి మధ్యనూ వెండికప్పు ఉంది.

"ప్రేమా, ఇతడూ ఓ పక్షంలో ఉండి నెగ్గేరుట ఈ పందెం !"

"ఎవరండీ ఇతను ?"

"ఇందులో 'కోదండపాణి' అని ఉంది. ఇతన్ని గురించి ఎప్పుడో ప్రేమా చెప్పినట్లు జ్ఞాపకం ?...ప్రేమా సరిగ్గా నీ పోలికేనుమా ! చిన్నప్పుడు నువ్వు ఇలాగే ఉండేదానవు. డ్రెస్సులో తేడాతప్ప, ఇంకేభేదం అగుపడదు."

సౌభాగ్యమ్మ లోపలికెళ్లి, తను ఆ ఈడప్పుడు తీయించుకున్న ఫోటో తీసుకొచ్చింది. తన ఫోటోకి ప్రేమా ఫోటోకి వ్యత్యాసం అట్టేలేదు...ఆ ఫోటోలో సౌభాగ్యమ్మ రెండేళ్ల వయస్సుగల ప్రేమాను ఒడిలో కూర్చోపెట్టుకొని ఉంది. సౌభాగ్యమ్మ ఫోటోలు రెండూ ఒకదాని ప్రక్క ఒకటి పెట్టి, "ఏమండీ ప్రేమా పెళ్లిచేసుకుంటే ఈపాటికి బిడ్డలతల్లి కావలసిందే" అంది.

పురుషోత్తం ఏమీ మాట్లాడలేదు. సౌభాగ్యమ్మ ఏదో చెప్పబోయింది. అగతల బోధ చప్పనోయింది. లోపల ప్రవేశించే ప్రేమాని చూచి ఆమె మాట్లాడక వూరుకుంది.

"అమ్మాయీ, కోదండపాణి ఎవరే?"

"శివజ్ఞానం పిళ్ళైకొడుకు. ఇదివరకు చెప్పలేదూ నీకు సింగిల్సుకి కంప్లీట్ చేసినప్పుడు?"

"శివజ్ఞానంపిళ్ళై అంటే ఇద్దరున్నారు. పోలీస్ ఆఫీస్ రా కూడా..."

"అబ్బే' అతనుకాదండి, ప్రొవిన్స్ ప్రాసిక్యూటరు శివజ్ఞానంపిళ్ళై."

"అతనేమిటి లా స్టూడెంటా?"

"కాదు. మాన్లానే. చాలా తెలివైనవాడులే. అన్ని సబ్జెక్ట్సులోనూ కూడా స్పెషలిస్టే. ఇంక టెన్నిస్‌లో చెప్ప నక్కరలేదు. మంచి 'గ్రేస్' చూపిస్తాడు ఆటలో."

"నీతో సింగిల్సు ఆడి 'డిఫీటు' అవుత ఇతనేకదూ?"

"అవును...దాని కేమిటే! ఆవేళ ఎందుచేతో పాడుచేశాడుకాని, నెగ్గవలసినవాడే అప్పుడుకూడా... అన్నట్లు మరచిపోయా. రేపు బహుశః మనింటి కొస్తాడాయన. 'ఫ్రెండ్సు' అందరికీ చిన్నటీపార్టీ ఒకటి 'అరేంజి' చేస్తున్నాడు. పెర్సనల్‌గా వచ్చి ఇన్వైట్ చేస్తానన్నాడు నిన్ను. బహుశః రెండు గంటలకి రావొచ్చు."

౧౦

కోదండపాణి మర్నాడు అనుకున్న వేళకి పురుషోత్తంగారింటి కొచ్చాడు. ప్రేమా తండ్రికీ, సహోధ్యాయుడికీ ప్రథమ పరిచయం కలుగ చేసింది. టెన్నిస్‌లో జయముపొందినందుకు కోదండపాణిని అభినందించాడు పురుషోత్తం.

"మిస్ ప్రేమా దేనండీ ఆటఅంతా. నేను ఊరికే అక్కడ నిలబడ్డాను. మీరు మొన్న రాలేదనుకుంటా. వచ్చి ఉంటే మీకే తెలుసు." అని ఇంగ్లీషునే మాట్లాడ్డం మొదలుపెట్టేడు కోదండపాణి.

"ఏమిటిటోనండి! నాకు ఎప్పటికప్పుడే కుదరటంలేదు. సెక్రటరియట్‌లోంచి ఊడిపడేటప్పటికి ఆరుకూడా అయిపోతుంది ఒక్కొక్కప్పుడు."

"అవునండి, అలాగే ఉంటుంది. ఒక ఆఫీసుకు హెడ్ అయితే అంతే కాదూ."

"మా ప్రేమా చెప్తుంటే వినడమే కాని మిమ్మల్ని ఎప్పుడూ చూడనేలేదండీ."

"తమర్ని నేను సమాజ్ హాలులో ఎప్పుడూ చూస్తూనే ఉన్నా. మీరు 'ఫలనా' అని కూడా తెలుసు. మిస్ ప్రేమాయే చూపించింది నాకు మొదట ... నేడు చాలా సుదినం, మీతో మాట్లాడ్డానికి వీలయింది."

ఇంకా ఏమైన టోర్నమెంట్సుకి కడతారా?"

"కడదామనే ఉంది. మిస్ ప్రేమా కంపేనియన్ గా ఉంటే మాకెప్పుడూ దిగ్విజయమే!"

ముసిముసినవ్వు నవ్వేడు పురుషోత్తం.

"మిస్ ప్రేమాలాంటి కూతుర్ని కన్న తలిదండ్రులజన్మ సార్థకం. కాలేజీలోనూ, టెన్నిస్ కోర్టులోనూకూడా సమానమైన ప్రతిభ చూపిస్తోంది."

"అబ్బ! ఊరుకోవోయ్. ఉన్నవీ లేనివీ అల్లా కల్పించి చెప్పకపోతే ఏమీ?" అంది ప్రేమా.

సౌభాగ్యమ్మ పట్టుకువస్తున్న 'టీ'ని, ప్రేమా అందుకుని టీపాయి మీద పెట్టింది. 'టీ' తాగి కోదండపాణి కానియ్యబోయే పెళ్ళికి పురుషోత్తమాన్ని ఆహ్వానించి, వెడుతూ, ప్రేమాకేసి చూస్తూ "నువ్వు కూడా రావాలన్న మాటే సుమా" అన్నాడు, నవ్వుతో.

"అల్లాగా, నాకు తెలియదే" అంది ప్రేమా.

పురుషోత్తంకూడా నవ్వాడు.

• ౧౧

ప్రేమా, కోదండపాణీకూడా పరీక్షలు ప్యాసవుతున్నారు. టెన్నిస్ కప్పులు నెగ్గుతూనే ఉన్నారు. వాళ్ళిద్దరికీ యమ్. ఏ. బి. ఎస్‌సి. డిగ్రీలు వచ్చాయి.

'ఇంక పెళ్ళి చెయ్యాలి' అనుకున్నాడు పురుషోత్తం 'ఇంక ఆలస్యం చేస్తే భాగ్యం వెంగకూడా పెట్టుకుంటుంది.' అమ్మాయితో ఆ ప్రసంగం

ఎల్లాగ తీసుకురావాలో రెండు మూడు రోజులు ఆలోచించి పురుషోత్తం ఒకనాటి ఉదయాన్ని "ప్రేమా" అన్నాడు.

"ఏమిటి నాన్నా ?"

"ఏమీ లేదు... నీ పెళ్ళి సంగతి గురించి మాట్లాడుదామనుకుంటున్నా..." రెండు రోజుల్నించి అతని మనస్సులో రాపాడుతోన్న చిగురికి పురుషోత్తం, ఆ ప్రశంస తీసుకురావడంలో సమర్థత చూపలేకపోయాడు.

"అవును నేనే తొందరపడవద్దని ఆపుచేశా, పరీక్షలవో తెమిలిపోతే మంచిదని. లేకపోతే ఇదివరకే అతడొచ్చి నీతో ఈ సంగతిని గురించి మాట్లాడి ఉండును" అంది ప్రేమ రేకెట్టులో తెగిన స్ట్రింగుతీసి కొత్తది వేయబోతూ.

"అతడెవరు ?"

ప్రేమా తండ్రికేసి చూసింది. ఆ ముఖంలో ఆశ్చర్యం అగుపిస్తోంది. నాన్న తెలియనివాడిలా నటిస్తున్నాడు తనచేత చెప్పించాలని అతని ఉద్దేశం. సహజమైన సిగ్గుతో దృష్టిని రేకెట్టుమీదకు దింపి "కోదండపాణి" అంది ప్రేమా.

"కోదండపాణి!" అనే ముక్క వెలువడింది. ప్రేమా అదిరిపడి తండ్రికేసి చూసింది. పురుషోత్తం ముఖం వంచుకుని స్తంభితుడై కూర్చునే ఉన్నాడు. ప్రేమాకి ఏమీ అర్థమవటంలేదు.

పురుషోత్తం లేచి పైకివెళ్ళాడు. మేడమీద గదిని కడిగిస్తోంది సౌభాగ్యమ్మ. 'భాగ్యం, ప్రేమా కొంపతీసింది. కోదండపాణిని పెళ్ళి చేసుకుంటుందిట !" అన్నాడు పురుషోత్తం.

గడచిన ఎనిమిది సంవత్సరాలలోనూ సౌభాగ్యమ్మ ఏదో సందర్భంలో కూతురి వివాహాన్ని గురించి తలవని రోజులేదు. గడచిన ప్రతిరోజూ ఆమెను సంఘర్షించి దూరంచేస్తూంది. దీర్ఘకాలంనుంచి ఆ మనస్సులో మెలగుతోఉన్న ఆ తలంపు ఆ మనస్సుని వాద ప్రతివాదాల్లోకి దింపివేసింది. విమర్శమీద విమర్శలు నడిచేయి ఆ మనస్సులో. అల్లాంటి సమయాల్లో ఏమీ తోచక తుదకు విధాత్రవిధానం ఎల్లాఉందో ! అని సమాధానపరచుకుని ఊరుకునేది. నేడు భర్త నోటమ్మట వెలువడిన వాక్యం ఆమె కాందోళన తీసుకురాలేదు. ఒక్కక్షణం కళ్ళు మూసుకుని "విధాత్రవిధానం

ఎప్లాగుంటో!" అనుకుంది. కళ్ళు తెరచి పురుషోత్తం కేసి చూసింది ఆమె "ఎందుకండీ, అంత గాభరాపడటం? చూడొచ్చులెండి. ఆఫీసువేళవుతోంది స్నానానికి లెండి" అంది అతి సౌమ్యంగా. దంపతుల దృష్టులు మెట్లమీదికి తిరిగేయి. ప్రేమా అక్కడ నిలబడివుంది.

పురుషోత్తం రెండు మెతుకులు కతికి, ఆఫీసుకు వెళ్ళాడు. తల్లి, కూతురు భోజనానికి కూర్చున్నారు ప్రేమ "అమ్మా!" అంది. "భోజనం చెయ్యి, తరువాత మాట్లాడుకోవచ్చు" అని సౌభాగ్యమ్మ ప్రేమాని మాట్లాడ నివ్వలేదు.

భోజనానంతరం, "ఇదుగో, అదుగో" అని సౌభాగ్యమ్మ రెండుఘంటలు కాలయాపన చేసింది. ప్రేమా గదిలోనే కూర్చుని 'అమ్మా' అని పిలిచింది. ఆ అందమయిన ముఖంలో నేడో వస్తే తగ్గింది.

"అమ్మా !"

"ఏమమ్మా !"

నే తెలియజేసిన విషయం నాన్న హృదయానికి దారుణాఘాతం అయింది కాదూ ?"

"అబ్బే, ఏమీలేదు. నువ్వేమీ ఆలోచించకు. దానివిషయం నాన్న వచ్చేక మాట్లాడుకోవచ్చు."

ప్రేమా దగ్గరగా వచ్చింది. తల్లి మెడమీదనుంచి చెయ్యిరానిచ్చి రెండవ చేతితో ఆమె ముఖాన్ని దగ్గరకు లాక్కుని "అమ్మా, నాన్న ఆఫీసుకు వెళ్ళిపోతూ నాకేసి చూసినప్పుడు ఆ ముఖాన్ని నే నెప్పుడూ ఇది వరకు చూడని విషాదం అగుపడింది...అమ్మా! నాన్నకి నామీదవుండే ప్రేమ అగాధమయినది, నా ఇష్టకి ఎప్పుడూ నాన్న అడ్డుగాలేదు. చదువు చెప్పించాడు. నా బుద్ధి ఎటుపడుతోందంటే అటు నడువనిచ్చాడు. క్లబ్బులో మెంబరుగా చేరనిచ్చాడు. టెన్నిస్ పందేలవు కట్టనిచ్చాడు. నా కోసం ఎంతో ధనం ఖర్చుపెట్టాడు. నన్ను నాటకాలకి, సినిమాలకి, టీ పార్టీలకి, మీటింగులకి తీసుకెళ్ళాడు...నన్ను గాఢంగా ప్రేమించకపోతే నాన్న ఇన్నివిధాల నన్నెందుకు చూస్తాడు? నేనేమిచెప్పినాకూడా 'అమ్మను నువ్వు సరిగ్గానే ఆలోచించావు' అనేవాడు...ఈ ప్రేమకు నేను విచ్చిత్తి వచ్చింది కాబోలు !"

ప్రేమా కళ్లనుంచి, రెండు వేడిచుక్కలు రాలి, తల్లి చేతిమీద పడ్డాయి. కళాశాల పరీక్షల్లో అలజడిలేని హృదయంతో సమాధానములు వ్రాయగలిగిన ఆ ప్రేమా, మెడికల్ కాలేజీలో తత్తరపాటు లేకుండా మృతకళేబరాలను కోయుటకు అలవాటుపడ్డ ఆ ప్రేమా, టెన్నిస్‌కోర్టులో పురుషులతో హోరాహోరీగా పోరి పందెము నెగ్గిన ప్రేమా, ఇరువది రెండ్ల వయసుగల ప్రేమా నేడు తల్లి ఒడిలో కూర్చుని ఒక బాలికలాగ ఏడవడం మొదలుపెట్టింది.

ఆమె కంటినీరు ఒత్తుతూ సౌభాగ్యమ్మ "అమ్మాయీ, వెర్రి ఎత్తిం దేమిటే నీకు? మీ నాన్నకి నీమీద ఉండే ప్రేమలో ఎప్పుడూ విచ్ఛిత్తి రాదు. వివాహం అన్ని విషయాలకంటే కొంచెం ఆలోచించవలసినది కనుక, ఆయనకూడా ఆలోచిస్తున్నారు...'మనం బ్రాహ్మలం. ఆంధ్రులం. వాళ్లు అరవదేశస్థులలో శూద్రులు. అందుచేత మనకీ వాళ్ళకీ వివాహం కుదురు తుందా?' అని నాన్నగారు ఆలోచిస్తున్నట్లున్నారు అంతే."

"అమ్మా, నాన్న నిజంగా అలాగ ఆలోచిస్తారంటావా? మేము వెళ్లిన మీటింగులన్నింటిలోనూ ఇల్లాంటివి పాటించకూడదని చెప్పేవారు. నాన్న చదివే పుస్తకాల్లో వర్ణాశ్రమధర్మాలు ప్రస్తుతం వ్యక్తియొక్క స్వాతంత్ర్యాన్ని అడ్డుపెట్టే, పెట్టని గోడలనికదూ వుంది? మేము వెళ్ళిన డిన్నర్లలో వర్ణాలు పాటించకుండా కలిసియే భోజనం చేశాము. మనింట్లో కూడా వర్ణం పాటించకుండానే కాదూ డిన్నరిస్తే? కనుక నాన్నకి ఇల్లాంటి అభ్యంతరం వస్తుందంటావా నా వివాహ విషయంలో?"

అతివ్యాగ్రంతో, మనస్సులో ఉన్న దున్నట్లు వెలిబుచ్చుతోంది. ప్రేమా, ఆమెకు హిందూమతంలోఉన్న సుగాచారాలు తప్ప ఆ మతాన్ని గురించి ఏమీ తెలియదు. చదువు, ఆటలతో ఇన్నాళ్ళు కాలం గడిపింది గనుక, సంసారానుభవం కూడా తక్కువ. 'అరవదేశపు బ్రాహ్మణేతరుణ్ణి వివాహమాడితే, ఏమైనా బాధలుంటాయా?' అనే తలపు ఆమెను ప్రవేశించ లేదు.

సౌభాగ్యమ్మ, కూతురు యుక్తాయుక్తాలు తెలియకుండా మాట్లాడు తోందని అనుకోలేదు. ఆమె అతి సౌమ్యంతో 'అమ్మాయీ, వివాహవిష యం తక్కిన విషయాలన్నిటికంటే బాగుగా ఆలోచించవలసినది కనుక పోనీ నాన్నతో ఇదివరలోనే సలహాచెయ్యలేక పోయావా?"

"అమ్మా! 'వివాహం' అనే తలపు నా మనస్సులో మొదట రానే లేదు. అతడు, ఇష్టమొచ్చిన పేపరు పుచ్చుకొని, తక్కిన స్టూడెంట్సు మెచ్చుకొనే ముఖాలతో చూస్తోంటే, చిరునవ్వు ముఖంతో వస్తూన్నప్పుడు అతనిలో ఒక సొంపు అగపడేది నాకు. అతను టెన్నిస్ ఆటలో ఒక విధమైన 'గ్రేస్' ప్రత్యక్షమయ్యేది నా కళ్ళకి. అతన్ని 'నే ప్రేమిస్తున్నా' అని నేనెన్నడూ అనుకోలేదు మొదట. కాని క్రమంగా 'వివాహం చేసుకోవాలి సుమా/కదా' అనే తలపు మనస్సులో ప్రవేశించినప్పుడు, నాకు సహచరుడుగా ఉండవలసినవాడు అతడే అనుకున్నా" అంది ప్రేమా.

తన లోపల ఉన్నటువంటి ఆవేదన పొంగి హృదయాన్ని చీల్చుకుని ప్రతికరూపంలో బయట కొస్తూందేమో అనిపించింది సౌభాగ్యమ్మకి. ఆ బాధను అప్పటికి నిగ్రహించుకుని "ఉండమ్మా! లే! కుంపట్లో నిప్పు వేస్తా కాఫీకి" అంటూ నెమ్మదిగా లేచి వెళ్ళిపోయింది సౌభాగ్యమ్మ.

నాడు కాఫీ రుచించలేదు ప్రేమాకి. నాలుగు ఘంటలయింది 'క్లబ్బు'కని బయలుదేరి వెళ్ళింది ఆమె.

క్లబ్బులో ఏమీ తోచలేదు. తండ్రి ఆఫీసులోనే ఉంటాడు కదా ఇంకా అనుకొని ఆమె చెపాక్ దగ్గర బస్ దిగి సెక్రటేరియట్ ఆఫీసు వేపు వెళ్ళింది.

సముద్రపు టొడ్డున కూర్చుని పురుషోత్తం, కూతురూ చాలాసేపు మాటాడుకున్నారు. పురుషోత్తం బ్రహ్మసమాజం అంటే అభిమానమున్నవాడే. కాని వేషభాషల్లో, నడవడికలో, ఆహారంలోనూ కూడా పూర్తిగా తమతో సంబంధంలేని ఒకణ్ణి ప్రేమా వివాహం చేసుకోవడం వెగటుగా అనిపిస్తోంది. అతను అటువంటి వివాహానికి తన సమ్మతిని చూపలేదు. తన అసమ్మతికి కారణంకూడా చెప్పడు. చెప్పలేడు.

అన్ని సందర్భాలలోనూ తనతో ఏకీభవించిన తండ్రి తన వివాహ విషయంలో అభిప్రాయభేదం కనపరిచాడు. తన క్షేమం కోసం పాటుపడే తండ్రితో, తాను తలపెట్టిన వివాహం ఉచితమే అనికాని, కోదండపాణిని తప్ప అన్యుని తన మనస్సును స్వీకరించవద్దని కాని ప్రేమా చెప్పదలచుకోలేదు. తండ్రిమనస్సు కామె ఈవరలో ఎప్పుడూ కష్టం కలుగజెయ్యలేదు. అతను తన్ను అతి గారాబంగా పెంచాడు. ఇప్పుడా హృదయానికి బాధ కలిగించడం మహాకృతఘ్నత.

కాని తన హృదయంలో అచ్చొత్తింపబడ్డ కోదండపాణి చిత్తరువును చెరిపివేయటం ఎట్లు? అతని ఆశలన్నీ భగ్నమయాయని అతనికి తెలియ జేయడం ఎట్లు? ఈ ప్రశ్నలకి సమాధానాలు ఆమెకు సులభంగా గోచరిస్తాయని తోచలేదు.

౧౨

రెండు మూడు నెలలు గడిచాయి. కోదండపాణి పురుషోత్తంఇంటికి ఒక పర్యాయం వచ్చాడు. మళ్ళీ అతడగుపించలేదు.

ఒకనాడు పురుషోత్తం "భాగ్యం, ప్రేమా పెళ్ళిమాట ఏమిటి?" అన్నాడు.

"ప్రస్తుత పరిస్థితుల్లో కోదండపాణికిచ్చి వివాహం చేయడం యుక్తం" అంది సౌభాగ్యమ్మ.

'అది వెటకారమా?' పురుషోత్తం, భార్యకేసి చూశాడు. ఆవాక్యం ఆమెనుండి మనస్ఫూర్తిగా వెలువడిందే! ఆమెలో వచ్చిన ఆ మార్పున కాతడాశ్చర్యపోయాడు.

ఆ పరిస్థితులలో సౌభాగ్యమ్మ పురుషోత్తమానికి తెలియచెప్పింది. పురుషోత్తమానికి ఏమీ తోచలేదు.

ఒకరోజు ఆలోచించాడు, ఏమీ తోచలేదు. రెండవ దినం అంతా ఆలోచించాడు. అతనికి కర్తవ్యం స్ఫురించలేదు. ఆఖరుకి "భాగ్యం, ఏమంటావ్?" అన్నాడు. "అంతకంటే మార్గం నా కగపడటంలేదు." అంది సౌభాగ్యమ్మ.

పురుషోత్తం ప్రేమా ఉన్న గదిలోకి వెళ్ళాడు. "అమ్మా, కోదండపాణి రావడంలేదేమి, మనింటికి? రావద్దని చెప్పినట్టున్నావుకదూ?" అన్నాడు, ప్రసంగం ఎలాగ ప్రారంభించాలో తెలియక, ఆఖరుకి.

"అలెదప్పుడే నెలాపది హేను రోజులు క్రిందటే ఇంగ్లండెళ్లిపోయాడు పేపర్లో పడినట్లుగాడుంది. నీకు తెలియదూ?"

"బాగా? ఎందుకూ వెడతే?"

"ఇంకా చదువుదామనే"

"ఇదివరకెప్పుడూ చెప్పలేదే మనతో !"

"హఠాత్తుగా పుట్టిందనుకుంటూ ఈ తలపు"

పురుషోత్తమానికి ఏమిచెప్పాలో తోచిందకాదు. కొంతసేపూరుకొంటి, గద్గదస్వరంతో "అమ్మా. ఏదో పెట్టిఉద్దేశాలతో నీ స్వతంత్రాని కిస్తు వచ్చాను. కోదండపాణికి 'కేబుల్' ఇచ్చి వచ్చేయ్యమను. మీరిద్దరూ వివాహం చేసుకుని, ఇష్టమవుతే ఇద్దరూకలసి ఇంగ్లండు వెళ్ళవచ్చు." అన్నాడు.

"నాన్నా, ఏదో సమయంలో 'పరిణయం' అనే తలపు వుద్భవమయింది కాని, ఆలోచించి చూస్తే, దానివల్ల అనర్థాలు ఎక్కువని తోచాయి. ఎంతో చురుకుగా, ఉత్సాహంతో ఉన్న మిస్ సదాశివన్ పెళ్లి చేసుకున్న పిమ్మట, "ఏమమ్మా, ఇల్లాగున్నావేఁటి ?" అని అడుగుతే, సంసారంలో ఉండే పరిస్థితులు మీకు తెలియవు" అంది అతి దీనంగా... నేనొక్కర్తెనేకదా మీకు ? నే తక్క మీకు బిడ్డలు గలుగలేదు నన్నతి గారాబంతో పెంచారు. వృద్ధాప్యంలో మీకు సేవ చెయ్యవలసిన పూచీ నాది. అందుచేత పెళ్లి చేసుకోకుండా ఉంటే..."

పురుషోత్తం అడ్డొచ్చాడామె మాటకు. "చదువు పూర్తిఅయాక వివాహం చేసుకుంటానని ఉపేక్ష చేశాను, కాని ఇలాంటి మాటలు వింటానను కోలేదు. కోదండపాణిని పెళ్లిచేసుకుంటూ నన్నదానవు ఇంతలో మనస్సులో మార్చుకోడం ఎందుకూ ? నీ స్వతంత్రాని కడ్డురాను. నాకు మీ వివాహం సమ్మతమే. నేనిది మనస్ఫూర్తిగా చెప్తున్నమాటే..."

"నాన్నా, చదువు పూర్తి అయిందంటావు. చదువుకి పూర్తి అవటం అంటూ ఉందా ఎప్పుడేనా ? 'స్వతంత్రాని కడ్డురాను' అంటున్నావు. కాని నేను అవివాహితను గానే ఉంటె నాకు స్వతంత్రం ఎక్కువకాదా ? ...ఎల్లాగ జీవితం గడుపుతానో నేనని ఒకబాధ నీ కుండవచ్చు. మెడిసన్ చదువుకున్నదాన్ని కనుక, బీదలకు ఉచితంగా వైద్యం చేస్తా...నిన్నూ అమ్మనీ నేను వదలి ఉండను...ఉండలేను కూడాను"

ప్రేమా అప్రయత్నంగా ఎదురుగుండా ఉన్న గోడకేసి చూసింది. వ్రేలాడుతూన్న టెన్నిస్ రేకెట్ ఆమెకు గోచరమైంది. అనాడు ఆమెచే తీసివేయబడ్డ తెగిన 'స్ట్రింగు'కు మారుగా కొత్త స్ట్రింగు పడకపోవుటచే ఆ భాగం వెలితిగానే అగుపిస్తోంది.

పురుషోత్తం నిట్టూర్పు విడిచాడు. వెనక్కి తిరిగాడు, సౌభాగ్యమ్మ వంటింట్లోంచి వస్తోంది. ఆమె ముఖాన్ని చూడ్డానికి ఆతనికి సిగ్గయింది. "ప్రేమా మూర్తీభవించిన మా అన్యోన్యానురాగం అనుకున్నా. కాని చివరకు అది నా అవివేకాన్ని ప్రతిబింబింపజేసే అద్దం అయింది. బ్రహ్మచారిణి అయివున్న కూతుర్ని చూస్తోన్న కొద్దీ సౌభాగ్యానికి రోతపుట్టక మానదు. ఏమంటే... అయ్యో! ప్రేమా యొక్క మనస్సు ఎంత త్వరలో మారిపోయింది! అవును ఏమిటంటే! పొంగుతూన్న పాలకి ఒక్క ఉప్పురాయి చాలుగా, విరిగిపోవడానికి" అనుకున్నాడు.

తనకు కష్టజీవితం నాటితో ప్రారంభమవుతోన్నట్టుగా తోచిం దాతనికి.



# పెళ్లి షరతులు

"అన్నగారూ, అంత్యనిష్ఠూరంకన్న ఆది నిష్ఠూరం మంచిదెప్పుడూ. పెండ్లిలో మీరు మాకేమేమి జరుపవలసి ఉంటుందో ముందే నిర్ణయం చేసుకుని, ఆ ప్రకారం జరిపేస్తారా, అనక ఏ పేచీ ఉండదు. ఏమంటారు?"

అలా బంగారమ్మ అనడంతోనే బ్రహ్మానందం, "పరహా కిమ్మత్తు చేసే మాట చెప్పారండి మీరు. పేచీ అంటే నాకూ గిట్టదు కట్నం కానుకలూ, లాంఛనాలూ ఇవన్నీ కూడా మీరేమేమి కోరతాగో కోరండి. ఏదో ఓ నిర్ణయాని కొచ్చేసి, ఆ ప్రకారం తూ. చ. తప్పకుండా చేసేస్తాను" అని జవాబిచ్చాడు.

"అట్లయితే వినండి. కట్నం రెండువేయి నూటపదహార్లు."

"అంటే రెండువేల రెండువందల ముప్పైరెండు రూపాయలన్న మాట."

"సరిగా చెప్పారు. మరొకరాతే, రెండువేల నూటపదహార్లన్నట్లు అర్థంతీసి రెండోల నూటపదహారువద్ద పేచీకి దిగుతారు."

"అందుకేగా నేను అలాంటి అనుమానానికి అవకాశం లేకుండా చేసుకున్నాను...సరే. ఇంక లాంఛనాలు సెలవివ్వండి."

"లాంఛనాలకేమున్నాయ్? పట్టు తాపితాలూ, వెండిచెంబు, వెండి కంచం...వెండి టిఫిన్ క్యారేజీ ఇలాంటివే."

"తథాస్తు. అలాగే."

"చెంబూ అంటే చిన్నా, పెద్దా ఉంటాయనుకోండి."

"ఎందుకూ, 'ఇన్నితులాల చెంబ'నీ 'ఇన్ని తులాల కంచమ'నీ. అలాగే "ఇన్ని తులాలు పెట్టి క్యారేజీ' అని నిర్ణయం చేసెయ్యండి."

"ఏమైనా మీరుకూడా నాకుమల్లేనే. వ్యవహారంపట్ల చాలా కరక్టు మనుషులు! నూరుతులాల చెంబూ, నూరుతులాల కంచం, రెండువందల

తులాల క్యారేజీ... రెండువందల రూపాయలకు తక్కువ కాకుండా పట్టు తాపీలు."

"నాకు సమ్మతే. ఇంక ఆడపడుచు లాంఛనాలు తెలపండి."

"నన్నా. మొదట పెళ్ళికొడుకి సరదాలు ముఖ్యం గనుక వాటిని మనవిచేసి ఆ తర్వాత ఆడపడుచు లాంఛనాలు."

"సరే. సెలవివ్వండి."

"మహా ఏమున్నాయిలెండి. ఐదువేళ్ళకీ ఉంగరాలనీ, అలక పాన్పు మీద ఓ సైకిలనీ, మనుగుడుపులలో రిస్టువాచీ అనీ, ఆషాఢపట్టీలో ఓ రేడియో సెట్టనీ — ఇలాంటివే ఏవో స్వల్పాలు కొన్ని. ఈ కాలంలో పెళ్ళికొడుకులందరూ కోరేవి—ఉన్నాయికదూ? అవి ఎలాంటివి కావాలో పెళ్ళికొడుకే ముందు ముందు తెలియపరుస్తాడు."

"సరే. అతనితో మాట్లాడతాను."

"ఇంక ఆడపడుచు లాంఛనాలమాట... చూడండి. నాకు ఆడపిల్లలు లేరు. అందుచేత ఆ లాంఛనాలేవో నాకే చెందడం న్యాయం. ఏ సరదా తీరినా ఈ పెళ్ళిలోనే కదాండి మరి?"

"కాదండి మరి!"

"ఆడపడుచు లాంఛనాల క్రింద ఒక నూటపదహార్లూ, వియ్యపరాలు లాంఛనాల క్రింద మరొక నూటపదహార్లూ నాకు ముట్టాలి."

"దానికేం? మీకు ముట్టే వాటిలో లోపం చేస్తానా?"

"ఉండండి, నన్ను పూర్తిచెయ్యనియ్యండి—ఇక ఐదు రోజులూ, ఐదు పట్టుచీరలు ఇవ్వడమనీ, ఐదు గాసులు బొట్టుపెట్టడమనీ, తర్వాత వెండి బొట్టు పెట్టెలో వెండి తమలపాకులూ, భమిడిచెక్కలూ పెట్టి ఇవ్వడమనీ, ఇలాంటివన్నీ మామూలుగా ఇప్పుడు అందరూ చేసేదే."

బంగారమ్మ ఇలా ఏకరువు పెడుతోంటే, బ్రహ్మానందం తనతో కూడా వచ్చిన సుబ్బరామయ్యకేసి తిరిగి, "ఏమోయ్, బావా. అక్కగారు సెలవిచ్చే వాటిలో ఏమైనా మరిచిపోతానో ఏమిటో? నువ్వు కాస్త జ్ఞాపకం పెట్టుకుని, ఇంటికివెళ్ళాక మా ఆడవాళ్ళతో చెప్పాలి సుమా" అన్నాడు.

బంగారమ్మ, "ఆ ఎందుకూ? పోనీ అంత జ్ఞాపకం ఉండదూ అని తోస్తే ఓ చిన్న జాబితాలాంటిది రాయించి ఇస్తాను లెండి. వదినగారికి కూడా చూపించడానికి వీలుగా ఉంటుంది" అంది.

"అట్లయితే మరీ మంచిది" అన్నాడు బ్రహ్మానందం.

ఆ సాయంకాలమే తాంబూలాలు ఇచ్చేసి, బ్రహ్మానందం, బంగారమ్మ వ్రాయించి యిచ్చిన జాబితాతోటి, సుబ్బరామయ్యతోటి గంగలకుర్రు తిరిగి వెళ్లిపోయాడు.

ఆయన వెళ్ళాక, బంగారమ్మతో భర్త లక్ష్మీనరసన్నగారు, "అంతా బాగానే ఉందిగాని, అలా జాబితా రాసిఇవ్వడం ఇదివరకెక్కడా ఎరగం" అన్నాడు ధైర్యంచేసి.

'ఇంతేనా మీ తెలివి!' అన్నట్లుగా ఓ నవ్వునవ్వి, "ఊరికే ఆలోచించకుండా ఇచ్చాననా, జాబితా? అలా వ్రాతమూలకంగా ఉంటే ఆనక వాళ్ళేమైనా చెయ్యకపోయిన పక్షంలో నిలేసి అడగొచ్చు. అంతే గాదు, వాళ్ళు అలా హఠాత్తుగా దిగి, 'మీకేం కావాలో కోరండి' అనేసరికి అన్నీ ఒక్కమాటుగా తోచుకొస్తాయా నాకు మట్టుకు? తర్వాత మెల్లిగా ఆలోచించి, తోచినవన్నీ అందులో చేర్చి మరి ఇచ్చాను."

"ఆషాఢపట్టి దగ్గర్నుంచి అడిగేశావుగా! ఇంకా ఏం మిగిలేయి, చేర్చడానికి?"

"ఏం మిగలడమేమిటండోయ్? ఎన్నైనా మిగిలేయి. రాకపోకల ప్రయాణపు ఖర్చులు ఇవ్వడమనీ, మనలో ఆబాల గోపాలానికీ మంచి బట్టలు పెట్టడమనీ, విశాలమైన భవనం విడిదిగా ఇవ్వాలనీ, రెండుమాట్లూ టిఫిన్లనీ, ఏదో ఆషామాషి టిఫినుగాకుండా, రెండు కారాలూ, రెండు తీపులూ, ఏదో ఒక పానీయం గాకుండా, కాఫీ, టీ, కోకో, ఓవల్టిన్, హార్లిక్స్, పాలు—ఇలా ఎవరికేం కావలిస్తే అది సప్లయి చెయ్యాలనీ— ఇలాంటివన్నీ మాటల్లో వచ్చాయా మరి?"

"అదైతే ఇవన్నీకూడా నిర్ణయం చేశావన్నమాట!"

"ఏమనుకున్నారు మరి."

పెద్దాపురంనుంచి పెళ్ళివారు తర్లి వచ్చారు. బ్రహ్మానందం జాబితా దగ్గిర పెట్టుకొని ఒక్కటి మరిచిపోకుండా అన్నీ జరుపుతూ వచ్చాడు. కాని బంగారమ్మ మాత్రం ఆడపిల్లవారికి తాము జరపవలసిందేదీకూడా జరిపింది కాదు.

ఆవిడ ఎక్కడికక్కడే మొండిచెయ్యి చూపెడుతోంటే, ఆడపిల్ల వారికి ఆశ్చర్యం వేసింది. ఆడపెళ్లివారికే కాదు, మగపెళ్ళివారితో వచ్చిన

ఆయన్నలక్ష్ములకే అనిపించింది 'ఇచ్చినదంతా మూటగట్టుకు పోవ్వకోవడం చేస్తేనేవాళ్ళు, పెట్టడం చేతకాదు కామోసు బంగారమ్మకి?' అనుకున్నారు.

బంగారమ్మ పెళ్ళికూతురుకు నగలేమీ చేయించి పట్టుకురాలేదు. లక్ష్మీనరసు గారు. "నేను కట్నం పుచ్చుకుంటూ నగలు పెట్టకపోతే నలుగురూ ఏమనుకుంటారో?" అన్నాడు. "కాదు డబ్బే అమ్మో రోజుల్లో బంగారం కొనడమేమిటండి?" ఆవిడ. "పోనీ వారిచ్చిన కట్నంలోంచే కొంత తీసి వారి పిల్లకి నగలుగా ఇచ్చేద్దాం" అని చెప్పిచూశాడు.

"అలా ఇస్తే తక్షణం వాళ్ళు బంగారం కొనేస్తారు. అలా ఎందుకు? తర్వాత చేయించవచ్చు లెండి. మునిగిపోయిందేమిటి? ఇంతకూ నగలు పెట్టాలని నియమం లేదుగా!" తన సొంతంలోంచి తీసి ఇస్తున్నట్టు మాట్లాడిందావిడ.

ఇంక లక్ష్మీనరసు మాట్లాడలేదు. ఆ భర్త సలహా చెప్పవలసినవాడే కాని పెత్తనం ఉన్నవాడు కాదు.

పెళ్ళికూతురు తల్లి జగదాంబకు మాత్రం చాలా కష్టంగా ఉంది. ఇంత కట్నం ఇచ్చి, బోలెడు ఖర్చు చేసి పెళ్ళిచేసుకుంటూంటే తనకి ఏ ముచ్చటా తీర్చని వియ్యపురాలు కొరకరానిదేమిటని ఆవిడ ఇదయింది. ఆఖరికి బంగారమ్మ పెళ్ళికూతురుకు నగలు పెట్టకుండా దాటేస్తోందని తెలిసినప్పుడావిడ ఉండబట్టలేక, తన పినతల్లిని ముందుకు నెట్టింది. ఆ ముసలామె బంగారమ్మతో:

"ఏమండీ పెళ్ళికూతురుకు నగలేమీ పెట్టారు కాదేం?" అన్నది.

"ముందు ముందు చేయిస్తాం."

"ముందుముందేమిటి? ఎప్పటి ముచ్చట్లు అప్పుడే సరి"

"అది మా ఇష్టం 'నగలు పెట్టాలి' అన్న నియమం లేనప్పుడు నిలదీయటం సబబు కాదు."

ముసలమ్మకి ఏమనాలో తోచింది కాదు. జగదాంబ అందుకుని, "నిశ్చయించుకోలేదని మాట్లాడేస్తారేమిటండీ వదినా? నిశ్చయిస్తే అందరికీ పెద్దన్న దగ్గిరనుంచి నిశ్చయించుకోవడం చేస్తుంటా?" అని సాగదీసింది

బంగారమ్మ "చేత కాకపోతే ఊరుకోవలసిందేను! ఏమండీ. అన్నగారూ మాట్లాడరేం?"

బ్రహ్మానందం, "మీరు చెప్పింది చాలా సబబుగా ఉంది. నేనింకేవీ మీతో నిర్ణయించుకోలేను. అంచేత మావాళ్ళు చేసిన యీ ప్రసంగ సంతా అప్రస్తుతమని నేను వప్పుకుంటున్నాను" అని చెప్పి, బ్రాహ్మలతో "బాబూ, ముందు కార్యక్రమం జరిపించెయ్యండి" అన్నాడు.

జగదాంబ పెరటి గుమ్మంలోకొచ్చి నిలబడి, బొటబొట కారే కన్నీటితో బొటనవ్రేలు తడసింది. బ్రహ్మానందం "ఏమిటే ఇది?" అని మందలించాడు.

"పెళ్ళిపందిట్లోనూ దాన్ని చిన్నబుద్ధి, పైగా ఏమిటే ఇది అంటారా నేమిటి?" అన్నాడు పానుగంటి సుబ్బరామయ్య. అత్తగారు, "శాస్త్రి గారూ, మొగాంమీద ఉమ్మేసి అడక్క, "మాదే తప్పని మా నోస్నే నొక్కావ్!" అంది. బ్రహ్మానందం నవ్వుతో, "మనకిలా పాయింటు లేనప్పుడు ప్రీవీకౌన్సిల్ దాకా వెళ్ళి ఏం ప్రయోజనం?" అనేసి, "కూరగ్గో శోపులు వేయమనండి. భోజనాలకి ఊళ్ళోకి పిలుపులు పంపుతాను" అన్నాడు.

పెళ్ళి అయి విడిదిలోకి వెళ్ళాక మగపెళ్ళివారు రెండు రకాలుగా చెప్పుకున్నారు. బంగారమ్మ పక్షంవాళ్ళు, "మంచి బాగా నోరు నొక్కింది ఏదో మహా తెలివిగా అనుకుంటున్నాం అనుకున్నారు వాళ్ళు" అని ఆమెను మెచ్చుకున్నారు. కాని తక్కినవాళ్ళు, "ఏదో బుకాయించగా సరా? మన ఎదురుగుండా అనుకోకపోయినా ఊళ్ళోవాళ్ళంతా 'పుచ్చుకోవడం పూర్వం నుంచీ ఉండి పెట్టడం పెద్దలనాడే లేదుగామోసు వీరికని మన వెనకాల మెటికలు విరుస్తున్నారు. ఇంతకూ ఆయన ధర్మాత్ముడు. విద్యాపరాలి పక్షమే చెప్పాడు." అన్నారు.

ఇలా అనుకుంటూంటే విడిదిలో గడియారం ఇట్టే కొట్టేసింది ఒంటిగంట. 'ఇదేమి చెప్మా ఒంటిగంట ఐనా భోజనాలకి కబురు వచ్చింది కాదు?' అనుకున్నారు వాళ్ళు. 'భోజనాలు ప్రొద్దెక్కకూడదని కూడా ఓ వరతు పెడితే బాగుండి పోననుకున్నాడు బంగారమ్మ తమ్ముడు. 'ఇలా ఆలస్యం చేసినందుకు ఈ రోజు భోజనాలువద్దు వద్దన సమయంలో ఆడ పెళ్ళివాళ్ళని అడ్డమైన గడ్డీ కరిపించి, ఏడిపించాలన్నాడో నక్షత్రకుడు. 'ఎందుకూ నాకు వదిలెయ్యండి. ఇట్టే అభాసుచేసి వదిలిపెడతాను'అన్నాడు మరో ఆకతాయి.

వాళ్ళలా ప్లాను వేస్తోంటే గడియారం రెండు కొట్టేసింది. ప్రొద్దుస్తమానా తిన్న ఉప్మా వగైరాలు ఎప్పుడో అరిగిపోయి వాళ్ళకి ఆకలి ఎక్కువైంది. బ్రహ్మానందంగాని, జగదాంబగాని, సుబ్బరామయ్యగాని ఆ వైపు నుంచి వస్తున్నారేమోనని వీధిలో అరుగుమీద నిలబడి చూడడం మొదలెట్టారు. బంగారమ్మ తల్లికి కోపం వచ్చేట్టుంది. పిల్లలేడవడం మొదలెట్టారు. 'ఎవరైనా వెళ్ళి సంగతేమిటో కనుక్కొస్తే బాగుంటుందం'ది తల్లి. మరో ఆలోచన లేకుండా 'కానివ్వండి' అంది బంగారమ్మ. నక్షత్రకుడు బయల్దేరి వెళ్ళాడు. వెళ్ళిన ఐదు నిముషాల్లోనే పెద్దపులి ఎదురైన వాడికిమల్లే వెనక్కి పరుగెత్తుకొచ్చాడు.

"ఏమిరా?"

"ఏముందీ, పెళ్ళివారింట భోజనాలై చేతులు కడుక్కుంటున్నారు"

"నిజంగా?"

"అబద్ధమెందుకు చెప్తాను? అరుగో చూడండి. భోజనం చేసిన వాళ్ళల్లో కొందరు ఇళ్ళకి వస్తున్నారు."

అతగాడు చెప్పినమాట నిజమే అన్నట్లు పెళ్ళివారింటినుంచి వీధిలోకి కొందరు బ్రాహ్మణులు బొజ్జలు సవరించుకుంటూ, "ఎలాగైనా, బ్రహ్మానందంగారు కక్కుర్తిలేని మనిషయ్యా. బూరెలుకూడా నేతితో చేయించాడు!" అని మెచ్చుకుంటూ, వీధిగుమ్మం ముందునుంచే పోతున్నారు. బంగారమ్మ అగ్గిమీద గుగ్గిలమై "చూశారా ఎంతపని చేశాడో? మమ్మల్ని భోజనానికి పిలవకుండా ఇలా ఊళ్ళో అందరికీ పెడతాడా? మమ్మల్ని అవమానం చేస్తాడా?" అంటూ కేకలేస్తూ కాళికామ్మవారికి మల్లే చిందులు తొక్కడం మొదలెట్టింది. దారినిపోయే బ్రాహ్మణులలా నిలబడిపోయారు. చోద్యం చూద్దామని చుట్టుప్రక్కల జనమంతా పోగయ్యారు.

మరికాస్సేపటికి పెండ్లివారింటి దగ్గర్నుంచి, ఒక కావిడిలో రెండు తీపులూ, మరొక కావిడిలో రెండు కారాలూ, వేరొక కావిడిలో కాఫీ, టీ, వగైరాలూ పట్టించుకుని సుబ్బరామయ్య వీధిలోకి వచ్చాడు. ఆ వెనకాలే బ్రహ్మానందం గోల్డుఫ్లేక్ సిగరెట్టులూ, ఆడుకునేందుకు పేకలూ పట్టించుకుని వచ్చాడు.

"భోజనం పెట్టకుండా, ఇవన్నీ ఎందుకు?" అని అడిగేశాడు బంగారమ్మ తమ్ముడు.

"ఏం ఇంకా భోజనం కాలేదా?" అన్నాడు బ్రహ్మానందం.

బంగారమ్మ తోకతొక్కిన తాచులాలేచి, కోపంతో పొంగిన వాక్యాలతో "చూశారా ఆయన మాటలు? మమ్మల్ని, భోజనాలకి పిలవకుండా, 'భోజనం కాలేదా?' అని అడుగుతున్నాడు?" అంది.

అంతవరకూ నిలబడి చూస్తోన్న రిటైర్డు ఇన్స్పెక్టరుగారు, "ఏమిటి బ్రహ్మానందంగారూ, పెళ్ళివారికి భోజనం పెట్టకపోవడమేమిటి? మేమింకా వారు వేరే ఇంకో పందిట్లో ఉన్నారనుకున్నాం" అన్నారు. బ్రహ్మానందం మెల్లిగా జేబులోంచి ఓ కాగితం తీసి, "బాబూ, ఇన్స్పెక్టరుగారూ, ఈ జాబితా ఓ తిరగెయ్యండి." అంటూ ఆయనకు అందిచ్చాడు. "వారికి మేం చెయ్యవలసినవన్నీ నిర్ణయించుకుని మా వియ్యపురాలు ఆ జాబితాలో రాయించి ఇచ్చారు. ఆ ప్రకారం జరుపుకుంటూ వచ్చాను. పెళ్ళి అయ్యాక జరపవలసింది మధ్యాహ్నం మూడుగంటలకి టిఫిను ఇదిగో పంపించాను. సిగరెట్లూ, పేకలూ కూడా ఇవిగో నిర్ణయప్రకారం తెచ్చాను. భోజనం వారు నిర్ణయం చెయ్యలేదు. మీరే చూడండి. నిర్ణయం చేసినవన్నీ సుమారు నూట ఇరవైమూడు ఐటెములు వరకూ జాబితాలో ఉన్నాయి. ఇవన్నీ చేస్తున్నాను, చేస్తాను. కాని నిర్ణయంలేని వాటిలో నన్ను ఇలా నిందించెయ్యడం సబబా?...ఏమండీ, బావగారూ, తమరే సెలవియ్యండి." అని ఊరుకున్నాడు.

పరధ్యాన్నంగా వెడుతూంటే ద్వారబంధం తలకు పెడీలుమని తగిలి నసాలం అంటినట్టయింది బంగారమ్మకి. లక్ష్మీనరసు, "బావగారూ, నిర్ణయించుకోలేదని మేము నగలు ఎగగొట్టినందుకు మాకు ఇలా బాగా బుద్ధి చెప్పారు! పిల్లలు ఆకలితో నకనకలాడుతున్నారు. మీకు పుణ్యముంటుంది, ఇక భోజన ప్రయత్నం చేయించండి" అన్నాడు,

"అంతా సిద్ధంగావుంది. మడికట్టుకు దయచెయ్యండి" అని చెప్పి బ్రహ్మానందం సుబ్బరామయ్యను తీసుకుని వెళ్ళిపోయాడు.



# వరాన్వేషణ

ఎవళ్ల అదృష్టం ఎలాంటిదో చెప్పలేం. ఇంటర్మీడియట్ పరీక్షకు మూడుసార్లు వెళ్లి ప్యాసుగాలేక ప్రాణం విసిగి, కలెక్టరాఫీసులో గుమాస్తాగాచేరిన రంగనాథరావ్, గారడివాడి మామిడిచెట్టు మొలకల్లే చూస్తూండగానే, యుద్ధం ధర్మమా అంటూ, చేరిన పదిసంవత్సరాల్లోనే డిప్టీకలెక్టరై ఊరుకున్నాడు. అతని చెల్లెలి మొగుడు జానకిరామయ్య, ఇంటరులో ర్యాంకూ బి. ఏ. లో క్లాసూ తెచ్చుకు ప్యాసై, ఎల్. టి. అయి హైస్కూల్లో మేష్టరుగా చేరాడు. డెబ్బైయైదులో ప్రారంభించి, ఐదేళ్ళలో నూరు రూపాయలు జీతమయ్యాక, గొర్రెతోకలా ఎదుగూ బొదుగూలేని ఆదాయమైపోయిందా మేష్టరుగారిది. రంగనాథరావు 'రావుసాహెబ'య్యాడు. భార్య మీనాక్షమ్మకి నగలు చేయించాడు. కూతురు వసుంధరకి వీణ మేష్టర్ని పెట్టాడు. బ్యాంకులో డబ్బుంది. ఏటేటా భూములు కొంటున్నాడు. జానకిరామయ్యకి విద్యార్థులు ప్రసాదించిన మారుపేర్లుతప్ప బిరుదులేమీ లేవు. ఆయన భార్య మాణిక్యాంబ తనకి నగలు చేయించమని అడుగుతోన్నా అది అయేపని కాదని ఆమెకు ముందే తెలుసు. భూములు కొనటం దేవుడెరుగు, పిత్రార్జితం పుట్టెడూ వ్యయమైపోకుండా తమ రాఘవుడికి మిగల్చగలుగుతే ధన్యుణ్ణనుకున్నాడాయన.

రంగనాథరావూ, జానకిరామయ్యా ఒకటే యీడువాళ్ళు. ఇద్దరూ ఒక సంవత్సరమే స్కూలుఫైనలు ప్యాసవుతే ఆ శెలవుల్లోనే రంగనాథరావు చెల్లెలు మాణిక్యాంబకి పెళ్ళయి, బావమరుదులిద్దరికీ జోస్తీ ఏర్పడింది. కాలేజీలో ఇంటరు చదివేటప్పుడు ఇద్దరూ హాస్టల్లో ఓ గదిలోనే ఉండేవారు. రంగనాథరావు చదువులో వెనకపడ్డం, రెండో ఆయన గుమాస్తాగానూ, ఆయన మేష్టరుగానూ చేరేకకూడా ఆ రెండు కుటుంబాలవారూ అన్యోన్యంగానే ఉండేవారు. రంగనాథరావుకు వసుంధర పుట్టడంతోనే

మాణిక్యాంబ 'మా రాఘవుడికి పెళ్ళాం పుట్టిందని' సంబరపడింది. మీనాక్షమ్మ కూడా 'మా అల్లుడు, మా అల్లుడంటూ' రాఘవుడికి ముద్దులు చేస్తోంది.

కాని రంగనాథరావుకి ప్రమోషను వచ్చినకొద్దీ, హోదాతో పాటు [illegible] అంతరం ఎక్కువైంది. ఆ గుమాస్తా కాపీల్లాగా పదేకరాలు సర్దిన [illegible] రాలవటంతో, 'అల్లుడు' 'మేనల్లుడై' పోయాడు. డిప్టీకలెక్టర్ 'రాఘవ బాబు' కావటంతోనే రాఘవుడు ఉత్తి 'రాఘవుడై' ఊరుకున్నాడు.

'కలిసొచ్చినా ఉట్టిచంకే చూపించాన్నట్లు'. మాణిక్యాంబ మాత్రం ఇంకా వసుంధరని తన కోడలుగానే భావిస్తోందేది. పెద్దాపవారి మురళీకృష్ణకి వసుంధరనిచ్చి చేయటానికి నిశ్చయించి, తన అన్న తాంబూలాలు ఇచ్చి వచ్చాకనేదాకా ఆవిడ వసుంధరమీద ఆశ పెట్టుకునే ఉంది. ఆ సంగతి తెలిసేక, బాధపడి, మొగుడితో 'చూశారా, ఎంతపని చేశాడో! పిల్ల పుట్టినప్పట్నుంచీ మనవాడికిచ్చి చేస్తానంటూ వచ్చి, ఆఖరికి పైగా వెళ్ళాడు' అని వాపోయింది. ఆయన ఒక్కమాటావిని భార్యవైపు తీక్షణంగా చూసి, 'ఐతే, మీవాడు తన కూతుర్ని ఇవ్వకపోతే మన రాఘవరావుకి పెళ్ళి అవదనా నీ దేవులాడటం? మనకి తగ్గవాడెవరో ఒకడు వీడికోసం వెతుక్కుంటూ వస్తాడు. ఆనర్సు ప్యాసైన కుర్రాడు నిక్షేపంగా కట్నం కానుకలతో వస్తుంది. పిల్లెవరో! మీ అన్నతో వియ్యమైతే, చెల్లెలేకదా అన్న లోకువ కొద్దీ, లాంఛనాలు జరపకుండా అతగాడు ఎక్కడికక్కడే మొండిచెయ్యి చూపచ్చు. పై సంబంధమైతే ఏ మొగమాటం ఉండదని' — ఈ ధోరణిలో మాట్లాడుతూ, తమకు మేనరికం తప్పిపోవటంవల్ల లాభమేకాని నష్టం లేదంటూ నిరూపించబోయాడు కాని మాణిక్యాంబకి మనస్సు సమాధానపడలేదు. ఎంతగొప్ప సంబంధమైనా, పై సంబంధం, పై సంబంధమే. పై పిల్ల మేనకోడలితో సమవుతుందా?

వసుంధరకి పెళ్ళి నిశ్చయం కావటంతోనే, మీనాక్షమ్మ పెళ్ళిపనులు చేయించడం మొదలెట్టింది. ఏర్పాట్లన్నీ జరిగినట్లే పెళ్ళికొడుక్కి ఉంగరం కూడా పురమాయించేశారు. ఇలా ఉండగా తలవని తలంపుగా ఇంజనీరింగు కాలేజీనుంచి రంగనాథరావుగారికో ఉత్తరం వచ్చింది. మురళీకృష్ణ రాశాడు. తనకి ప్రస్తుతం వివాహం చేసుకోవాలని లేదనీ, చదువు పూర్తిఐ,

ఉద్యోగస్థుడయ్యేదాకా పెళ్ళి చేసుకోకపోవటం తన సంకల్పమనీ, ఆ సంగతి తన తలిదండ్రులకు కూడా ముందుగా తెలపకపోవటంవల్ల, సుందరం అంత మైనదీ, చదువుకున్నదీ కాకపోయినా, తా నామెను ఎరిగి ఉండటంచేతనూ తనకా అమ్మాయిని పెళ్ళిచేసుకోటాని కభ్యంతరం ఉండదనే అభిప్రాయంతో తనతో చెప్పకుండా తనవాళ్ళు మాట ఇచ్చారనీ, నిశ్చయమైందని తెలపటం తోనే తాను గానేస్తున్నాననీ, కనుక మీరు మరో ప్రయత్నం చేసుకోవల సిందనీ, రాశాడు. "ఈ సంకల్పంతో మావల్ల మీకు కలిగిన ఇబ్బందికి క్షమించవలెను" అనికూడా రాశాడు.

ఆ ఉత్తరం చదవటంతోనే రంగనాథరావుగారి ఒళ్ళు మండిపోయింది. ఆ కవరు పుచ్చుకుని, ఆవృతా దనుకున్న విశ్వంభరం దగ్గరకెళ్ళి, 'ఏమిటిది?' అన్నాడు. 'ఇంకా కట్నం గుంజటానికి చేసిన ఎత్తా?' అని అడిగాడు. 'కాదు' అని జంఝం పట్టుకుని చెప్పాడాయన.

'అతనికి చెప్పకుండా మీ రెందుకు స్వతంత్రించా రలాగైతే?'

"పూర్వకాలపు మనిషిని గనక స్వతంత్రించాను. ఆ ఉత్తరంలో రాశాడుగా మావాడు."

"చదువుకి పెళ్ళి అడ్డొస్తుందా? ఉద్యోగస్థుడైతేగాని పెళ్ళిచేసుకో నననటం, ఉద్యోగంమీద ఆధారపడేవాడికి గాని, బోలెడాస్తితోవచ్చే నా కూతురి మొగుడికి అవసరంలేదే?"

"ఇవన్నీ చెప్పిచూశా. మీకు రాయటానికి పూర్వం నాకు రాశాడు. గుండె బాదుకుంటూ మద్రాసు వెళ్ళి, 'పెద్దమనుషులతో వ్యవహారం బాగుండదని' అనేక విధాల చెప్పాను. హాస్టల్లో కుర్రవాళ్ళ ఎగతాళికి నేను గురి అవటం తప్ప ప్రయోజనం లేకపోయింది. 'నీకు మొగమాటంగా ఉంటే నేనే రాస్తాను' అని మీకు ఈ కవరు పంపాడు. ఇప్పటి కుర్రవాళ్ళంతా ఎప్పుడో కాని పెళ్ళి చేసుకోమంటూ మొదలెట్టారు."

రంగనాథరావు 'ఛచ్చా' 'రాస్కెల్' అంటూ ఎవర్నో తిట్టుకుంటూ తిరిగి వచ్చేశాడు. 'చేసిన పెళ్ళి పనులు వృథాఐపోకుండా' ఆ ముహూర్తానికే మరో వరుడికిచ్చి చేసెయ్యాలని నిశ్చయించుకుని వరాన్వేషణకి మొదలెట్టాడు. ఆచంట వారబ్బాయి, వీరభద్రుడు వచ్చాడాయనకి. కోరినంత కట్నం ఇచ్చి చేసేస్తానంటూ వెళ్ళాడు. వారూ సంబరపడ్డారు

గాని, చివరికి వారి గోత్రం. వీరిగోత్రం ఒకటేఅని తెలిసి, చప్పబడిపోవల సొచ్చింది. మల్యాలవారి పిల్లవాడు. చదువుకున్న వాడూ, డబ్బున్న వాడూ అని ఎవరో చెబితే 'మహాభాగ్య'ని వెళ్ళాడు. కాని వారికి జాతకాలపిచ్చి ఉండి, జాతకాలు చూసుకోడంలో కుజదోషం కనబడి, ఆ ప్రయత్నం నీళ్ళు కారిపోయింది. ఇంక చెప్పతగ్గ సంబంధాలలో వడ్డాదివారి వినాయక రావు కనపడ్డాడు. పేరు వినాయకరావైనా, ఒడ్డు పొడుగూ ఉన్నవాడే ఆ కుర్రవాడు. ఉత్త లేత మొహం. పిల్లకంటే ఏ పదినెలలో తప్ప ఎక్కువ వయసు లేదు. మీనాక్షమ్మ 'కులహీనమైనా పనికొస్తుందిగాని వరహీనం పనికిరాద'నేసింది.

ఈ ప్రయత్నాలతో రంగనాధరావుగారికి సహం పులుసు విరిగి పోయింది. ఎవరో 'మీ మేనల్లుడే ఉన్నాడుగా, పైగా తిప్పలుపడడ మెందుకు ?' అని సలహా చెప్పేరుగాని రంగనాధరావు "వియ్యానికైనా కయ్యానికైనా సమానస్థాయి ఉండాలయ్యా" అన్నాడు. "పిల్లకి కాస్త నగా, నట్రా పెట్టి ముద్దూ ముచ్చటా తీర్చాలంటే అంత తగిన సంబంధం కాదయ్యా మా వాళ్ళది" అని చప్పరించేసింది మీనాక్షి. 'పెరటిచెట్టు మందుకు రాదంటే ఇదేకామోస'ను కుంటూ, ఆ వచ్చినాయన ఆశ్చర్య పోయాడు.

పెళ్ళికంటూ తయారుచేసిన అప్పడాలూ వడియాలూ ఖర్చయి పోయాయి. కరణాలూ, మునసబులూ చేసిన సప్లయిలుకూడా తినేశారు. దొడ్లోపడేసిన పందిరి రాటలూ, వెదురుగెడలూ వేసినవి వేసినట్లేవున్నాయి. వసుంధర ఇదివరకే సమరాడినా, మీనాక్షి పెళ్లి అయాకనే ఆ సంగతి వెల్లడిచేద్దామని, ఎవరితోటీ చెప్పింది కాదు. తెలుసుండికూడా అమ్మలక్కలు ఎక్కడికి అడగటం, ఈవిడ 'ఇంకా ఏదీ ?' అని అబద్ధమాడడం జరిగింది. ఎలాగైనా తొరగా పెళ్లి ఐపోతే బాగుండును ! కాని ఏడీ వరుడు ?

ఆఖరికో వరుడు లభించాడు. నిక్షేపంలాంటి సంబంధం. జిల్లా రిజ స్ట్రారుగారబ్బాయి, ఎకరం మూడునేలుచేసే ఏకఖండం కాలవదరిని నలభై ఎకరాల మాగాణి ఉన్నవాడు. ఎటొచ్చీ పిల్లవాడు కాస్త నలుపూ, కొంచెం పొట్టినీ. ఐతేనేం ? ఈడు సరిపోతుంది గనక, చేసెయ్యవచ్చు. రంగ నాథరావుగారు చెయ్యాలని నిశ్చయించుకున్నారు. వారెవో పెళ్లి

కూతుర్ని చూసుకుంటామని వరుడితో వచ్చారు. వసుంధర బ్రహ్మానందానికి నచ్చింది.

"తాంబూలాలు ఇచ్చిపుచ్చుకోవటమేనా?" అని రంగనాథరావు మీనాక్షిని అడిగాడు.

"మేం ఉత్తరం రాస్తామ"ని చెప్పమంది.

"అదేమిటి మళ్లీ?" అన్నాడు నిర్ఘాంతపోయి.

"వసుంధరకి నచ్చలేదుట."

"ఆ!"

రంగనాథరావుకి చాలా కోపంవచ్చింది. చేతికర్ర ఎక్కడుందో కనపడింది కాదుగాని, వసుంధర్ని, ఆడకూతురనైనా ఆలోచించకుండా నాలుగుమోదులు మోది ఉండును. అడ్డమైన తిట్లూ తిట్టాడు. మీనాక్షమ్మ "ఎందుకండీ అంత క్షోభపడిపోతారు? ఒక్కగాని ఒక్క పిల్లాయిరి. దానికి నచ్చినవాణ్ణిచూసి చేద్దాం." అంది. మంటలో నెయ్యిపోసినట్లయి "చేదాం! చెయ్యి! కబుర్లు చెప్పటంకాదింట్లో కూచుని, చెప్పులు అరిగిపోయేటట్లు తిరిగితే తెలుస్తుంది!" అంటూ ఇంటి కప్పెగిరిపోయేటట్లు కేకలేశాడు. అంతావిని ఆమె "తిరిగితేమాత్రం కుదురుతాయా సంబంధాలు! ఆ కళ్యాణ తార వస్తేగాని ఏమీ జరగదు. అది వచ్చిననాడు ఒక్కక్షణం ఆపుదామన్నా ఆగదు. అందుకేగా, కక్కొచ్చినా కళ్యాణమొచ్చినా ఆగదన్నారు మనవాళ్లు?" అంటూ ఆరంభించింది.

రంగనాథరావుకానాడు తిండి సహించలేదు. నిస్పృహతో దిగాలు మొహం వేసుకుని ఆఫీసుకు పోయాడు. ప్రయివేటు రూముకొచ్చి హెడ్డు గుమాస్తా హయగ్రీవరావు "ఏంసార్, అదోలా ఉన్నారే ఈ రోజున? వంటో బాగుండలేదా?" అని అడిగాడు. డిప్టీకలెక్టరుగారు అడిగితే చాలన్నట్లుగా ఆయనతో తనబాధ వెళ్లబోసుకున్నాడు. హయగ్రీవరావు, "దీనికింత ఆలోచనేమిటి పంతులుగారూ? 'వరుడు కావలెను' అంటూ పత్రికల్లో వేయించండి. మీరు ఇల్లు కదలక్కర్లేకుండా ఎక్కడెక్కడ ఉన్న పెళ్లికొడుకుల సంగతీ మీకు తెలుస్తుంది." అన్నాడు.

"పెళ్లికోసమని పిల్లపేరు పేపర్లో ఎక్కించటానికి ఆడవాళ్లు ఒప్పుకుంటారటోయ్?"

“తమ పేరుగాని అమ్మాయి పేరుగాని పేపర్లో వేయిస్తామనా? ఊరికే ‘అందమైనపిల్ల, చదువుకున్నది. ఒక పెద్ద ఉద్యోగస్తుని కూతురు. ఆస్తి ఉన్నవాళ్ళు,ఇలాంటి వివరాలు ఇచ్చి, పత్రికకు ఫలానా పోష్టుబాక్సు నెంబరుకి రాయండి అంటాం. వచ్చిన ఉత్తరాలన్నీ చూసుకుని అందులో ఎవరు నచ్చితే వాళ్ళతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపవచ్చు. అంతవరకూ మనం ఎవరో వాళ్ళకూడా తెలియదు.”

రంగనాధరావుగారికి ఈ ఆలోచన నచ్చింది. ఆనాడే పత్రికకి ఎడ్వర్ టైజ్ మెంటు పంపాడు. దానితో సగం బరువు తగ్గినట్లయింది. ఇంటి కొచ్చాక భార్యతో ఎడ్వర్ టైజ్ మెంటు గూర్చి చెప్పాడు. వసుంధర తనకోసం తండ్రి పడుతోన్న పాట్లకి సానుభూతి కనపరుస్తూ రహస్యంగా తల్లితో, “పోనీ బావకి చేసెయ్యకూడదమ్మా?” అంది. పిల్ల నిస్పృహతో అలా అంటోందనుకుని, “ఎందుకే. ఘట్టయిన సంబంధం చేయిస్తా చూడు.” అంది ఆమె.

పదిరోజులయాక “హిందూ” పత్రికవాళ్లు అడ్వరుటైజుమెంటుకి వచ్చిన దరఖాస్తులంటూ ఆరుకవర్లు పంపారు. హయగ్రీవరావు ఒక్కొక్క కవరే విప్పి చదివాడు, ఒక్కొక్క ఉత్తరమే చదవడం, రంగనాథరావుగారూ, మీనాక్షమ్మా పెదిమ విరవడం అయింది. వాళ్లకొక్కడూ నచ్చలేదు. “ఈ కవరుకూడా చూదాం” అంటూ హయగ్రీవరావు ఆఖరు కవరు విప్పబోతూంటే, రంగనాధరావు “ఏమిటి చూసేది? అదీ ఈ రకంవారిలోనే ఉంటుంది.” అంటూ యథాలాభంగా వినడం మొదలెట్టాడు.

హయ: “అయ్యా, తమరు ‘వరుడుకావలెను’ అని ఈనెల 6_వ తేదీని ‘హిందు’లో చేసిన ప్రకటన చూసినాను. నేనొక వరుణ్ణి. నా వయస్సు 23 సంవత్సరాలు. పొడుగు 5 అడుగుల 6 అంగుళాలు.

రంగ:.. ఏమిటి? 5 అడుగుల 6అంగుళాలా? మంచి జమానన్నమాట!

మీనా:-అమ్మాయికూడా పొడుగేకనక జమాయైతేనే బావుంటుంది. వయస్సులో కూడా7 సంవత్సరాల తేడాఉంది. మంచిదే...చదవండి.

హయగ్రీవరావు మళ్ళీ చదివేడు — “నేను గత సంవత్సరం ఆనర్సు సెకండ్ క్లాసులో ప్యాసైనాను.”

రంగ: ఇంక నేం? మనం చూచిన వాళ్ళలో ఇంత చదువు చదివిన వాడే కనపడ్లేదు. బాగుందయ్యా, ఇతగాణ్ణి చూద్దాం.

హాయ : ఇంకా ఉంది ఉత్తరం, వినండి. "మా ఆస్తి అంత చెప్పదగినదికాదు. ఓ పుట్టెడు భూమీ, ఓ ఇల్లూ మాత్రమే ఉన్నాయి

రంగ : ఆనెస్ట్ ఫెలో, నైయినుగా దాపరికం లేకుండా చెప్పేశాడు.

హాయ : ఆస్తి ఏనా అంత నాస్తి కాకపోయిందండి. వీరు పిల్లకి మస్తుగా ముట్టచెప్ప దలుచుకున్నారు. గనక వేన్నీళ్ళకి చన్నీళ్ళుతోడు అన్నట్లు, ఈ రెండూ చేరితే వాళ్ళకి లోపం ఉండదు

రంగ : ఔను, ఈ సంబంధం చూడవలసిందే. ఏమంటావ్ మీనాక్షీ?

హాయ : రెండో పక్క కూడా ఉంది ఉత్తరం. కొంచెమే వినండి. "తమకు నన్ను గురించిన భోగట్టా ఇంకా ఏమైనా కావలిస్తే, ప్రస్తుతం అమలాపురంలో డిప్యూటీ కలెక్టరుగా ఉంటూన్న శ్రీరావుసాహెబు కె. రంగనాథరావు పంతులుగారికి వ్రాసి తెలుసుకోవచ్చును."

రంగనాథరావు తన పేరువిని ఉలిక్కిపడ్డాడు. "ఎవరీ కుర్రవాడు? నేనెరుగున్నవాడేనా? ఎవరయ్యా, సంతకంచూడు. ఏ ఊరువాడు?"

హాయ : సంతకమాండి. చెఱకువాడ రాఘవరావు. కేరాఫ్, చెఱకువాడ జానకిరామయ్యగారు, బి. ఏ. ఎల్ టి. బోర్డుహైస్కూల్, నిడదవోలు.

ఆ దరఖాస్తుదారు తమ మేనల్లుడే అని తేలేటప్పటికి ఆ దంపతులు నిర్ఘాంతపోయారు.

"మనం ఎన్నో సంబంధాలుచూసి ఆఖరికి ఎడ్వర్టైజ్ చేస్తే, మళ్ళీ మనవాడే తారసపడ్డాడు" అన్నారు రంగనాథరావుగారు. మీనాక్షి మాట లేక నిలబడిపోయింది. హయగ్రీవరావు స్వతంత్రించి, "ఐతేనేం పంతులు గారూ, మీ మేనల్లునికి 'మనవాడూ' అన్న లోపంతప్ప తక్కిన విషయాలు ఏం చూసుకున్నా మీకు నచ్చాయి 'శంఖంలో పోస్తే తీర్థం' ఐనట్లు అడ్వర్టైజ్ మెంటు ద్వారా వచ్చి తన విలువ పెంచుకున్నాడు. కట్నం కానుకలు పైవాళ్ళకి మీరు ఏమేమి ఇస్తామన్నారో మీ బావగారి చెవిలో పడే ఉంటాయి. అవేవో వాళ్ళకే ఇస్తామంటే సంబంధం సెటిలైపోతుంది. తమ సెలవైతే, నేను నిడదవోలు వెళ్ళి వస్తాను" అన్నాడు.

రంగనాథరావు ఇంటికప్పు వైపుచూస్తూ, "వసుంధర ఏమంటుందో" అన్నాడు. మీనాక్షమ్మ. "దాన్నికి వాళ్ళ బావంటే మొదట్నుంచి ఇష్టమే" అంది. ఎక్కడనుంచి వింటూందోగాని వసుంధర, "మరే! నిన్న చెప్ప మన్నారు కామోసు!" అంది. అందరూ నవ్వారు. మర్నాడే మంచిదనేసి హయగ్రీవరావుగారు నిడదవోలు వెళ్ళి, సంబంధం నిశ్చయం చేసుకొచ్చాడు.

---

# అసూయ

హైమవతి పూర్ణచంద్రరావుగారి భార్య. పూర్ణచంద్రరావుగారంటే మేం చెన్నపట్నంలో అద్దెకున్న యింటికి యజమాని అన్నమాట. వాళ్ళు ముందు బంగాళాలోనూ, మేము వెనకాల ఔట్ హౌస్‌లోనూ ఉండేవాళ్ళం.

హైమవతి మాటకదూ చెప్తున్నాను? అప్పుడావిడికి పాతికేళ్ళుంటాయి. కాని ఇంకా పిల్లలు పుట్టలేదు. ఐతేం, పిల్లలు లేరుకదా అని హైమవతికి కాలక్షేపానికి లోపంలేదు. వాళ్ళకి టైగర్ అని ఓ కుక్క ఉండేది. ఆవిడకా జాగిలం పదిపిల్లల పెట్టు. హైమవతి ఆ కుక్క విషయంలో తీసుకున్న శ్రద్ధ ఇంతా అంతా కాదు. రోజూ సబ్బుతో తోమి బాత్ ఇస్తూండేది. మాంసం కొని వేయిస్తూండేది. కన్నబిడ్డను చూసినట్లు చూసేది. ఓ మనిషి ఓ జంతువుమీద ఇంత వాత్సల్యం చూపటం నాకు అబ్బురంగానే ఉండేది.

టైగర్ సంరక్షణకు పోగా మిగిలిన కాలం ఆవిడ ముస్తాబు చేసుకోటానికి సరిపోయేది. ముస్తాబంటే ఆషామాషీ సంసారపక్షం ముస్తాబుకాదు 'ఐటచ్'లూ, 'నెయిల్ పోలిష్'లూ, 'లిప్‌స్టిక్'లూ, 'స్నో'లూ, వాసన నూనెలూ-ఇవన్నీ ఆవిడ నిత్యం వాడేది. ఆ పెదిమల పెయింటూ, గోళ్ళ రంగూ వగైరా వేషమంతా చూస్తే మా రాజ్యానికి ఎందుకూ చేతగాని కిట్టేది కాదు. "రోజూ బీచ్‌కి వెళ్ళి రావటానికి, రంగస్థలాన్ని ప్రవేశించబోయే కథా నాయికకు మల్లే ఇంత వేషమెందుకండీ. యీవిడకి?" అంది, ఓనాడు నాతో. మరోనాడు, "అందమనేది సహజంగా ఉండాలిగాని, అవీ ఇవీ పూసుకుంటే వస్తుందా?" అని విమర్శించింది.

హైమవతి మా రాజ్యం అనుకున్నంత అనాకారికాదు; తా ననుకున్నంత సుందరీకాదు! ఆమెకు తాను చాలా అందమైనదానినని అభిప్రాయ

ముందేనని ఆ రోజుల్లో ఆవిడ వయ్యారం చూసినవాళ్లకీ, ఆ కబుర్లు విన్న వాళ్ళకీ తెలుస్తూనే ఉండేది.

పూర్ణచంద్రరావుగారు రోజూ ఆఫీసునుంచి తిరిగివచ్చే వేళకి ఆమె ముస్తాబై సిద్ధంగా ఉండేది. ఆయన రావటంతోనే, పైగర్ని కార్లో కూచో పెట్టుకుని ఇద్దరూ బీచ్‌కి వెళ్ళిపోయేవారు. యిలా ఉండగా బకాయిపడ్డ శిస్తులు వసూలు చేసుకోడానికి పూర్ణచంద్రరావుగారు ఊరువెళ్లి పదిహేను రోజులు దాకా తిరగి రాలేదు. ఆలోపుగా ఇక్కడో చిత్రం జరిగింది.

ఇప్పుడు భర్తకోసం కనిపెట్టుకో నక్కర్లేదు గనక హైమవతి ఇంకా ముందుగానే ముస్తాబై, నాలుగ్గంటలకే కారు బయిటకితీసి, పైగర్ని కూచో పెట్టుకుని స్వయంగా డ్రైవు చేసుకుంటూ బీచ్‌కి వెళ్లిపోయేది. ఆ వెళ్లడం వెళ్లి రాత్రి ఏ ఎనిమిదో, తొమ్మిదో ఐతేగాని తిరిగి ఇంటికి చేరుకునేది కాదు. మా రాజ్యం, "ఏమండీ, యీవిడ యిలా ఒక్కర్తీ ఘంటల తరబడీని ఎక్కడెక్కడో షికార్లు కొట్టిరావటం ఏమిటండీ?" అంది. మా ఆవిడ 'దిష్టి' తగిలిందా అన్నట్లు హైమవతి బీచి షికార్లు హఠాత్తుగా ఆగిపోయాయి. ఐదోనాడు కాబోలు ప్రొద్దుక్రుంకకుండానే ఆవిడ ఇంటి కొచ్చేసింది. కారు షెడ్డులో పెట్టేసి చరచరా బంగాళాలోపలికి వెళ్లిపోయింది. మా రాజ్యం "ఏంచెప్మా, ఇంత పెందరాళే వచ్చేసేంది?" అని ఆశ్చర్యపోతోంటే, లోపలనుంచి హైమవతి భయంతో వణికే గొంతుకతో, "రాజ్యంగారూ, ఓమాటిలా వస్తారా?" అని పిలిచింది. మా ఆవిడ వెళ్ళి అట్టే కూచునిపోయి ఎంతకూ రాకపోవటం, పిల్లలు అన్నాలకు గోల ప్రారంభించటం జరిగి, 'ఇంక రావలసింద'ని నేనే పెద్దపిల్లద్వారా రాజ్యానికి కబురు పెట్టాను. రాజ్యం ఇంట్లో అడుగుపెడుతూ, "ఇలాంటి దేదో జరుగుతుందని నేను మొదటే అనుకున్నాను" అంది.

మా ఆవిడ మొదట ఏమనుకుందో, ఆ అనుకున్నలాంటిది ఆనాడేమి జరిగిందో మాత్రం నాకు కొంతసేపటివరకూ తెలియలేదు. చివరికి తేలిన దేమిటంటే హైమవతి ఆ సాయంత్రం బీచ్‌కివెళ్లినప్పుడు, ఇంకొకడెవడో ఓ పెద్దకార్లో వచ్చి, ఈవిడ కారువెంట పడ్డాడుట! వాడు తనను అలా అనుసరించి రావటం ఈమెకు అనుమానం కలిగించి ఈవిడ తనకారు కాస్త జోరుగా నడిపించిందట. అప్పుడు వాడుకూడా స్పీడు ఎక్కువచేసి, కూడా

వెనక్కాలే వచ్చాట్ట! ఆవిడ దాంతో హడిలిపోయి, ఓ చిన్న సందులోకి తనకారు మళ్ళించి తప్పించుకుని వచ్చేసిందట.

"వాడుకూడా తనకారు సందులోకి మళ్ళించలేదన్నమాట ?"

ఈ మాట నే ననేసరికి మా రాజ్యం, పిల్లలకు కంచాలు వేస్తూన్నది మానేసి, వాడు తన కారును సందులోకి ఎందుచేత మళ్ళించలేదో కనుక్కోడానికంటూ హైమవతి దగ్గరకు పరుగెత్తుకెళ్ళింది. మరి కాస్సేపటికి తిరిగివచ్చి, "వాడుకూడా తన కారును సందులోకి మళ్ళిద్దామనే అనుకున్నాడు కాని, అది ఆ సందు పట్టనంత పెద్దకారట. ఆవిడాకారు పేరేమిటో కాని చెప్పింది. మరిచిపోయాను. చాలా ఖరీదైనదట ఆకారు. పదహారువేలదాకా ఉంటుందంట. అలాంటివి మద్రాసు మొత్తంమీద మూడో నాలుగో మాత్రమే ఉన్నాయిట" అంది.

మా ఆవిడ చెప్పిందాన్నిబట్టి అది రోల్సురాయిస్ కారని నేనూ హించుకోగలిగాను. అలాంటివి కార్లు ఓ డాక్టరుకీ లాయరుకీ ఉన్నాయి. ఓ చెట్టియారుకి కూడా ఉంది. అలాంటి కార్లో జమీందారొకడు వెళుతూండడం చాలాసార్లు చూశాను.

హైమవతి తనకు భయంగా ఉందనీ ఒంటరిగా పడుకోలేననీ అనటం వల్ల మా రాజ్యం ఆఖరివాణ్ణి తీసుకువెళ్ళి ఆ రాత్రి ఆవిడకు సాయం పడుకుంది. నేను అరుబయట క్యాంపుకాట్టుమీద పడుకుండి, ఆ సాయంకాలం బీచ్‌లో హైమవతిని అలా వెంటాడి వచ్చిన వాడెవడై ఉంటాడా అని ఆలోచించటం మొదలెట్టాను. వాడు ఆ నలుగురిలో ఎవడైయుంటాడు? నామటుకి ఆ నలుగురూ ఘరానా మనుష్యులే అనిపించింది. ఇంతకీ హైమవతి అనవసరంగా భయపడిపోయి, వాడిదార్ని వాడు వస్తూంటే తనకోసమే అని అపోహపడిపోయి, బాధపడుతుందేమో ? వాడో వేళ దుర్మార్గబుద్ధితోనే వచ్చినా అంత పబ్లిగ్గా వెంటాడి ఏంచేద్దామని ? ... ఇలా ఆలోచిస్తూంటే నాకు నిద్రపట్టేసింది.

మర్నాడు ఆదివారం. నేను తీరికగా దంతధావన చేస్తూంటే మా రాజ్యం——

"ఏంచేస్తే బాగుంటుందండీ ?"

"ఏ విషయం ?"

"హైమవతమ్మ మాట."

"చెయ్యటానికేముంది ? పూర్ణచంద్రరావుగా రొచ్చేదాకా ఈవిడ బీచ్ మానేస్తే సరి."

ఈ ఆలోచనతో హైమవతికూడా ఏకీభవించింది. ఇంక ఆ సంగతి వదిలేశాం. మధ్యాహ్నం భోజనం అయ్యాక నేను వాలుకుర్చీలో నడుంవాల్చే సరికి కునుకుపట్టింది. పరహాకిమ్మత్తయిన కునుకది. ఏతేం. మా రాజ్యం హైమవతీ వచ్చి లేపేశారు.

"ఏమండోయ్, వాడేట! వచ్చాడు. ఎలా కనుక్కున్నాడో కాని యేకంగా యింటికే వచ్చాడు దుర్మార్గుడు."

"ఎవడు ?" అంటూ నేను ఉలిక్కిపడి లేచి బయటకొచ్చి చూచే టప్పటికి, మా బంగాళాముందు కారొకటి కనపడింది. అది రోల్సురాయిసే. అందులో నే ననుకున్న లాయరూ, డాక్టరూ, చెట్టియారూగాక నాలుగో వాడైన జమీందారుగారు కూచుని ఉన్నారు. నేను లోపలికొచ్చేసి, కర్తవ్య మేమిటని ఆలోచిస్తున్నాను. హైమవతి కళవళ పడిపోతోంది. ఆవిడకు ముచ్చెమటలూ పోసేశాయి. మా రాజ్యం నా చేతికర్ర పట్టుకొచ్చి నా పక్కన పెట్టింది. తాను చీపురుకట్ట పట్టుకుంది.

"ఆయన నిజంగా ఏదో దుర్మార్గబుద్ధితో వచ్చాడంటావా ?"

"ఇంకా సందేహ మేమిటి ?"

నేను ఏంచెయ్యాలో పాలుపోక కిటికీలోంచి బయటకు చూస్తూంటే జమీందారు కారుదిగి, అటూ ఇటూ చూస్తూ, సందేహిస్తూ మెల్లిగా బంగా ళాదగ్గిర కొచ్చాడు. గుమ్మంవద్ద ఆయనకు ఎవరూ ఎదురుకాలేదు. ఆయన తిన్నగా హాల్లోకి వెళ్ళటం చూశాను. నేను అలా ఆలోచిస్తూ నిలబడిపోడం హైమవతికి నచ్చలేదు. ఆవిడకు ఉన్నట్టుండి తట్టాల్న ఓ ఆలోచన తట్టింది.

"అన్నగారూ, నేను వెళ్ళి వాడితో మాట్లాడతాను. మీరు వెనకాల కాచుకొని ఉండండి. వాడి నోటమ్మట తప్పుమాట ఏదైనా వచ్చిందా ముందుకు రండి."

హైమవతి ఇలా మాతో చెప్పి, ధైర్యంగా హాల్లోకి వెళ్ళింది. మా రాజ్యం, "రండి. అలా చూస్తారేం ?" అంటూ నడిచింది. మంత్రముగ్ధుడికి మల్లే నే నామెను అనుసరించి వెళ్ళాను. చీపురుపుచ్చుకుని రాజ్యమూ, కర్ర పుచ్చుకుని నేనూ తలుపు వెనకాల రెండు పక్కలా కాచుకుని ఉన్నాం.

హైమవతి హాల్లో ప్రవేసించటం తడవుగా జమీందారు లేచి వినయంతో, "నమస్కారమండి."

"నమస్కారం! ఎవరు మీరు ?"

హైమవతి మురుసుగానే అడిగింది. అతను కొంచెం కంగారుపడి చేతులు నలుపుతూ.

"నిన్న సాయంకాలం బీచ్‌లో తమని జాగులో చూచినప్పుడే మనవి చేద్దామనుకున్నాను. కాని తమరు కారు ఆపేరేకాదు. తమ కారు నెంబరు నోట్ చేసుకుని పోలీస్ కమీషనర్ ఆఫీసులో వాకబుచేసి తమ ఎడ్రసు కనుక్కున్నాను."

"ఎందుకని ?"

"తమరు మరోలాగ అనుకోకపోతే మనవిచేస్తాను. నిన్న కార్లో చూచినప్పట్నుంచీ మనసు తిప్పుకోలేకపోతున్నాను."

హైమవతి ముఖం ఎర్రపడింది. మా రాజ్యం ఒక అడుగు ముందుకు వేసింది. నాకు "వదండి" అన్నట్లు సౌంజ్ఞ చేసింది. మరోక్షణంలో నేనూ మా రాజ్య ఆ హాల్లో ప్రత్యక్షమై యుండేవాళ్ళమే. కాని జమీందారు తాను చెప్పబోయింది. పూర్తిచేశాడు.

"ఎన్నాళ్ళనుంచో మీ వద్దనున్న జాగిలంలాంటి దానికోసం ప్రయత్నం చేశాను. దొరకలేదు తమరు ఎంతవెల చెప్పితే అంతా ఇస్తాను. మీ జాగిలాన్ని నాకు దయచేయించండి."

హైమవతి ఆ మాటవిని కుర్చీలో కూలబడి పోయింది. తాను కన్న బిడ్డకుమల్లే సాగుతోన్న టైగర్ని జమీందారు ఇవ్వమన్నందుకు ఆమె బాధ పడుతోందనుకున్నాను మొదట. ఒక్క నిమిషమయ్యాక ఆవిడ ఉద్రేకంగా లేచి, టైగరున్న చోటుకి చకచకా వెళ్ళింది. ఆ కుక్క మెడకి ఆవిడ గొలుసు వేసి లాక్కొచ్చి. "ఇదుగో తీసుకు వెళ్ళండి !" అంది.

జమీందారు వికసించిన మొగంతో, "ధర సెలవిచ్చారు కాదు" అన్నాడు.

అందుకామె. "నాకు ఏమీ ఇవ్వక్కర్లేదు. తీసుకుపొండి. మళ్ళీ దీని మొహం నాకు కనపడకుండామాత్రం చెయ్యండి" అంటూ జేవురించిన

ముఖంతో తన గదిలోకి వెళ్ళిపోయాం. నెక్లెస్ జాలిగా హైమవతి వెళ్లిన వైపు చూస్తూ, వెనక్కు లాగుతుంటే, జమీందారు దాన్ని లాక్కుపోయి కారు ఎక్కించాడు.

హైమవతి నెక్లెస్ని ఎందుకలా ఇచ్చేసిందో కొంతసేపటికి కాని నాకు అర్థం కాలేదు. అనాటినుంచీ, ఆమె తాను 'భువనైక సుందరి'నని అనుకునేది. జమీందారు తన వెంటపడితే, తన అందాన్ని చూసే అనుకుంది. అందరు పతివ్రతలకు మల్లేనే అందుకామె బాధపడింది. సంగతి తెలిశాక, 'బ్రతుకు జీవుడా' అని సంతోషించి, నెక్లెస్ని ఇవ్వటానికి వీల్లేదని మంచిగా చెప్పి పంపించేయ్యవలసింది. కాని ఆమె అలా చెయ్యలేదు. ఆ జమీందారుణ్ణి ఆకర్షిస్తే తన సౌందర్యం గాక ఆ నెక్లెస్ అని తెలియడంతోనే నెక్లెస్ అంటే ఆమెకు గొప్ప అసూయ కలిగింది. దానిపైనగల ప్రేమంతా ఒక్కమాటుగా పోయి, ఆమె నెక్లెస్ని చేతులారా ఇచ్చేసింది. ఇంక మళ్ళీ దాని మొహం కూడా కనపడరాదుట!

ఎంత అసూయ!



# దూరపాలోచన

"ఏమండి, కాఫీహోటలుకని వెళ్లి మూడుఝాముల పొద్దెక్కి వచ్చారు ?"

గంగాధరం గుమ్మం ఎక్కుతోంటే అతని భార్య పార్వతి అడిగిన ప్రశ్న యిది.

"నయం కాదూ, వాడిప్పటికైనా వదిలి పెట్టాడు !"

"ఎవరు ?"

"ఎవరింక ? ఆ రమణయ్యే. బజారంతా తిప్పాడు."

"రమణయ్యగారి కిప్పుడు బజారుపనేమిటి చెప్మా ? భార్యేమో పుట్టింట వుందాయిరి. బియ్యం తేవాలా ? పువ్వులు తేవాలా ? పూటకూళ్లింట భోంచేసి సినిమాలమ్మట తిరగడమేగా ?"

"నిజమే. కాని అతగాడి భార్యకి నేడో రేపో పురుడొస్తోందిట."

"ఐతే, ఖాయపు సరుకులేవో ఇక్కడ కొని పంపుతున్నారా ?"

"కాదో ఓవిడా, పూర్తిగా చెప్పనివ్వవుకదా ఖర్మం !"

"చెప్పండి !"

"ఆవిడ మగపిల్లవాణ్ణే కంటుందని నేనూ రమణయ్యా నిర్ధారణ జేశాం."

"ఎలాగ ? బ్రహ్మ యీ విషయం యేమైనా మీతో ముందుగా సంప్రదించాడా ?"

"ఈమాత్రం దానికి బ్రహ్మదాకా వెళ్ళాలా ? విను. రమణయ్యకి మనస్సులో, కొడుకే పుట్టాలని ఉంది."

"మగమాణిక్యం పుట్టి ఉద్ధరిస్తాడని కామోసు !"

"'మగపిల్లాడా, లేక ఆడపిల్లేనా ?' అని నన్ను జోస్యం అడిగాడు"

“మీరూ, ‘మగపిల్లాడే పుడతాడ’ని చెప్పారుకదూ ?”

“మరోలా చెప్పి వాణ్ణి చిన్నబుచ్చుతానా మరి ? తప్పకుండా కొడుకే పుడతాడన్నాను. ఈ అనుకూల జోస్యానికి బహుమతికింద ఈరోజు కాఫీ హోటలు ఖర్చు వాడు భరించాడు.”

“బాగుంది.”

“ఐతేం? ఆ తిన్న రెండు ఇడ్లెన్లు అరిగిపోయేటట్లు బజారంతా తిప్పి వదిలిపెట్టాడు.”

“ఎందుకు ?”

“ఆ పుట్టబోయే పురుషపుంగవుడికి కావలసిన సామాగ్రంతా ఈ రోజునే కొనెయ్యాలని రమణయ్యకు తోచింది.”

“తొలిచూలు గనక పిల్లవాడికి ఐదోనెల వస్తేగాని పంపరు. ఏం కొన్నా అప్పుడుగాని ఇప్పట్నుంచీ ఎందుకో ?”

“ఎందుకేమిటి ? రమణయ్య కాస్త ముందు జాగ్రత్తున్న మనిషి. చటుక్కుని ఆవేళకు కావాలంటే దొరకవేమో అని పాలడబ్బాలూ వగైరా కొనేశాడు.”

“పాలడబ్బాలా ? పుడుడొచ్చి తల్లికి పాలులేవని నిర్ధారణైతే పాల టిన్నులు గాని—”

“నే చెప్పేనామాట. కొనిఉంచితే వచ్చిన నష్టమేమి టన్నాడు. ఆముదం సీసాలు, రబ్బరు పక్కగుడ్డలు ఇవన్నీ కొనేశాం.”

“అవి చెడిపోయేవి కాదులెండి. ఇంకా యేంకొన్నారు ?”

“పిల్లవాడు ఎదిగేక తొక్కడానికని మూడుచక్రాల తొక్కుడుబండి”

“శబాష్, బాగుంది.”

“స్కూలుకు వెళ్లేరోజుల్లో పుస్తకాలు పెట్టుకుని బుజానతగిలించుకుని వెళ్లటానికి పటకాఉన్న తోలుసంచి.”

“ఔను. అదీ అవసరమే.”

“పరీక్షలో రాసుకోడానికో ఫౌంటెన్ పెన్.”

“అదీ ముఖ్యమే మరి.”

“ఆడుకోడానికి క్రికెట్టు బేట్టు, పెట్టుకోడానికో దొరటోపీ.”

"బాగానే ఉంది, ఇంక ఒక్కటే చూడవలసినది."

"ఏమిటది ?"

"అబ్బాయికి పెళ్ళికూతురు !"

"దానికూడా ఈపాటికి రమణయ్య ఏదో ప్లాను వేసే ఉంటాడు. ఔనుగాని, మూడుఝాములైందని తెలిసికూడా నన్నిలా నిలబెట్టి మాటలు చెప్తున్నావుగాని భోజనంమాట ఎత్తావేగాదు. ఆ రమణయ్య ఇప్పుడే కొంచెంసేపట్లో మళ్ళీ వస్తానన్నాడు. ఇంకా ఏదో ఆలోచించాలిట. ఈ లోపుగా రెండు మెతుకులు పడేస్తే బాగుంటుంది."

గంగాధరం భోజనంచేసి పెరట్లో చెయ్యి కడుక్కుంటూంటే వీధిలో రమణయ్య గొంతు వినిపించింది. ఎవడితోనోగాని అతను కాస్త దూకుడుగానే అంటున్నాడు :

"అయ్యా, 'నే చెప్పను; నాకు చెప్పటం ఇష్టంలేదు' అన్నప్పుడు మీ దారిని మీరుపోక ఈ అధికప్రసంగం ఎందుకు ?"

అందు కవతలాయన : "అధికప్రసంగ మేముందండీ ? 'ఈమాత్రం చెబితే అరిగిపోతారా ?" అన్నాడు. "మీకంత కోపమైతే పోనియ్యండి" అంటూ వెళ్ళిపోయాడు. గంగాధరం రమణయ్యని లోపలికి రమ్మని,

"ఎవరోయ్ ఆ మనిషి ?"

"ఎవడో కోన్‌కిస్‌కాయ్."

"అసలు ఏమిటది పేచీ ?"

"నేను మీ గుమ్మం ఎక్కుతోంటే పనిగట్టుకొచ్చి, 'సార్, సార్, టైమెంత అయిందండీ ?' అన్నాడు."

"నీకు రిస్టువాచీ ఉండటం చిక్కొచ్చింది. ప్రతీ వాజమ్మా టైమడుగుతుంటాడు ?"

"'అయ్యా మీకు టైము చెప్పటం నాకిష్టంలేదు. కనుక దయచేసి తమదారిని వెళ్ళండి' అన్నాను."

"బాగుంది. చాలా మర్యాదగానే చెప్పేవు."

"ఐతేం ? అతను వెళ్ళడే ! 'అలాగంటారేమిటండీ ? కాస్త టైము చెబితే అరిగిపోతారా ?' అంటూ టూమచ్‌గా మాట్లాడ్డం మొదలెట్టాడు."

"టూమచ్‌గా మాట్లాడేస్తం తప్పే. నిలబడే ఉన్నావ్, కూచో... ఐతే, సంగతి తెలుసుకోడాని కడుగుతున్నాను! ఎవరూ అడక్కుండానే నీ అంతట నువ్వే వైమొంతనంతో చెప్పేసేటంత పరోపకారబుద్ధి కలవాడవు కదా, అలాంటిది ఈనాడు అతగాడిమీద ఇంత చిరాకూ కోపం కనపర్చావెందుచేతా ?" అనుకుంటున్నాను."

"కోపం ఏమీ లేదు. కొంచెం దూరం ఆలోచించే అతగాడికి పైము చెప్పటం మానేశాను."

"ఆ దూరపాలోచన ఏమిటో కాస్త వివరంగా చెప్పాలి."

"ఏంలేదూ. విను. అతగాడి మొహం మనం ఇదివరలో ఎన్నడూ చూసలేదు."

"లేదు."

"ఈ అపరిచితుడికీనాడు మనం పైము చెప్పామూ అంటే ఇతనికీ మనకీ ఓ విధంగా పరిచయం కలుగుతుందంటావా లేదా?"

"కలుగుతుంది."

"ఇంక వీధిలో ఎప్పుడెదురుపడ్డా గుడ్ మార్నింగులూ, మందహాసాలూ ఒలకబెడతాడు."

"పెట్టొచ్చు. కాని దానివల్ల మనకు రాబోయే నష్టమేమిటి అని."

"విను చెబుతా ఈ పరిచయం క్రమంగా ఎక్కువై, మనయింటికితడు తరుచు వస్తూ పోతూ ఉండటం జరుగుతుంది."

"జరగొచ్చు. కాని ఇంటికే వచ్చినా కూచుని బాతాఖానీ వేసే ఓపికా, తీరికా గూడా నీకున్నాయిగా!"

"ఉత్త బాతాఖానీతో వదులుతుందా గంగాధరం? కాఫీలు, ఉప్మాలు—ఈ మామూలు కార్యక్రమం అంతా నడుస్తుంది."

"పోన్లే, అవంతా మీ ఆదరణనుబట్టి ఉంటుందనుకో. ఊఁ...చెప్పు"

"చెప్పొచ్చేదేమిటంటే, ఇతనికీ మనకీ మైత్రి గాఢమౌతుంది."

"ఐతేం, స్నేహం కోరదగినదే కదటోయ్ రమణయ్యా?"

"గొప్పవాళ్లతో స్నేహం చేస్తే కోరదగినదే కాని ఇటువంటి నిర్భాగ్యుడి స్నేహమా మరి?"

"ఇతడో నిర్భాగ్యుడంటావ్ ?"

"కాకపోతే టైము అవసరముండీ కూడా రిష్టువాచీ ఎందుకు కొనుక్కోడు ?"

"ఔను రమణయ్యా, నువ్వు చెప్పింది సబబుగానే ఉంది."

"సాధారణంగా నిర్భాగ్యులకే ఆడపిల్ల లెక్కువగా ఉంటారు. ఈ తండ్రులపని అస్తమానూ పెళ్ళికొడుకుల్ని వెతకటంతోనే సరిపోతుంది."

"పోవచ్చుగాని, అందువల్ల నీకొచ్చిన నష్టమేమిటి ?"

"విను. ఈ నిర్భాగ్యుడికిగూడా ఆడపిల్లలు బయల్దేరుతారు. ఆ పిల్లలకి సంబంధాలు వెతకవలసొస్తుంది. మనతో స్నేహం కలిగి మనింటికి రాకపోకలు సాగిస్తోన్న యీ మనిషికన్ను, గోవగా ఎదిగి కాలేజీకి వెడుతూ వుండే మా కుర్రవాడిమీద పడుతుంది."

"ఆరి నీ కడుపు బంగారంగానూ ! ఎంత దూరం ఆలోచించావ్ ? మొదట నీకు కొడుకుపుట్టాలి. ఆ తర్వాత ఆరేళ్ళకో ఏడేళ్ళకో, నిన్ను ఇప్పుడు టైమడిగిన యీ నిర్భాగ్యుడికి ఆడపిల్ల పుట్టాలి. ఆ పిల్లకి పద్దానుగేళ్ళొచ్చాక గదా పెళ్లి ప్రయత్నం ? అంటే ఇరవైయేళ్ల పైమాటన్న మాట."

"ఇరవయ్యేళ్ళంటే ఎంతసేపోయ్. ఇట్టే తిరిగొస్తాయి."

"ఐతేమాత్రం ఇతను తన కూతుర్ని మీ పిల్లవానికి చేసుకోమన్నంత మాత్రాన్ని మీరూరికే వప్పుకోవాలని ఎక్కడుంది ? కట్నం కానుకలూ ఇస్తేనే ఆలోచిస్తారు."

"రిష్టువాచీఐనా కొనుక్కోలేని నిర్భాగ్యుడు మనకియ్యగల కట్నమేముంటుంది గంగాధరం ?"

"ఐతే 'మాకు సరిపడద'ని మా నెయ్యొచ్చు."

"అలా మానెయ్యటం అంత తేలిగ్గా ఉండదు. స్నేహంమీద దెబ్బ కొట్టాలొస్తాయి. ఆడవాళ్ళదగ్గిర రాగాలు ప్రారంభిస్తారు. పిల్లవాడికి పిల్లనిచూపి వలలో వేసుకుంటారు. అప్పుడు మనం కాదంటే అడ్డుతగినట్లుంటుంది చూడూ. ఎందుకూ ఇంతగొడవ ? ఎప్పుడూ అంత్యనిష్ఠూరంకన్న

ఆదివిష్ణూరా మెరుగను. అందుకే ఇతనికీ మనకీ అసలు పరిచయం కలక్కుండా నేనే మునుపే ఉంచేశాను."

గంగాధరంతో మాట్లాడుతూన్న రమణయ్య దృష్టి వీధిలోకి పోతున్న పోస్టు బంట్రోతుమీద పడింది.

"ఏమోయ్, నాకేమైనా ఉత్తరాలున్నాయా?"

"రమణయ్యగారా? ఇక్కడున్నారా!" అంటూ ఇతగాడో కార్డుతీసి ఇచ్చి వెళ్ళిపోయాడు. ఆ కార్డుపై సగంపైగా బొగ్గుంపోటం చూసి, గంగాధరం "మీ మామగారు రాసినట్లున్నారోయ్. పురుడొచ్చినట్లుంది. ఏదీ, ఇలా తే. నా జోస్యం ఎంతవరకు సరైనదయిందో చూద్దాం" అని లాక్కున్నాడు. ఆ శుభవార్త ఏమిటో విందామని పార్వతికూడా లోపలి గుమ్మం వద్దకు వచ్చి నిలబడింది. గంగాధరం పైకిలా చదివాడు.

"చిరంజీవి మా అల్లుడు వలిశెట్టి రమణయ్యకు సోమాపంతుల మల్లికార్జునుడు బ్రాహ్మణులయిందున ఆశీర్వదించి వ్రాయునది—ఉభయకుశలోపరి— ఈ నెల మీ శుక్రవారం రాత్రి 1-35 నిముషములకు పూర్వాషాఢనక్షత్ర ప్రథమ పాదమున చిరంజీవి సౌభాగ్యవతి సూరీడు సుఖప్రసవమై ఆడపిల్లను కన్నది. మాతాశిశువులు క్షేమముగా ఉన్నారు. పథ్యము పెట్టిన పిమ్మట మళ్లీ జాబు వ్రాసెదను. బారసాలనాటికి ఇక్కడకు వచ్చే ప్రయత్నంలో ఉండవలెను."

రమణయ్య ముఖం వెల్లబోయింది. వచ్చే నవ్వాపుకుంటూ పార్వతి లోపలికెళ్ళిపోయింది. గంగాధరం "బారసాలకు రమ్మని రాశాడుగా, మీ మామ" అన్నాడు.

"అక్కర్లేదంటే పోయినా సరే" అంటూ రమణయ్య కోపంగా లేచి వెళ్ళిపోయాడు.



# శాస్త్రి - రావు

రావుకు జాబు వచ్చింది. అందులో శాస్త్రి చనిపోయాడని ఉంది.

ఆ జాబు చూసుకుంటూ రావు అలాగే నిలబడిపోయాడు. ఉన్నట్టుండి అతడు "శాస్త్రి కాదు చచ్చిపోయింది! నేనేపోయాను! రావే చచ్చిపోయాడు!" అంటూ కుర్చీలో కూలబడ్డాడు.

'శాస్త్రి' అంటే కామశాస్త్రి, 'రావు' అంటే కామేశ్వరరావు. ఇద్దరూ కామయ్యగారి మనుమలూ. పేరింటిగాళ్ళూ. శాస్త్రి కొడుకు కొడుకు; రావు కూతురు కొడుకు. రావు కాకినాడలో పెరిగాడు. చిన్నప్పుడే క్రాపింగు పెట్టించారతనికి. ఇంగ్లీషు బళ్ళో చేరిపించారు. హైస్కూల్లో ఉండగానే సంస్కర్తల కబుర్లు వినపడేవతనికి. బాల్య వివాహాలు కూడదనీ, రజస్వలానంతరమే చెయ్యాలనీ, చిన్నపిల్లలకు ముసలివాళ్ళను కట్టిపెట్టటం, వితంతువులకు మళ్ళీ పెళ్ళిళ్ళు చెయ్యకపోవటం అన్యాయాలనీ, అతడు పెళ్ళి అంటే ఏమిటో సరిగా తెలియని యీడులోనే బ్రహ్మసమాజంవారి మీటింగుల్లో వింటూ వచ్చాడు.

శాస్త్రికి మొదట్నుంచీ పిలకే ఉండేది. స్వగ్రామం రాజారాం ఎలిమెంటరీ స్కూల్లో ఉన్న చదువేదో చదివాడు. తర్వాత తాతతోటీ తండ్రితోటీ పొలం వెడుతూండేవాడు. రావు సెలవుల్లో తాతగారింటికి వస్తూండేవాడు. శాస్త్రి పిలకను చూచి వేళాకోళం చేసేవాడు. శాస్త్రి ఏం మాట్లాడినా, "పల్లెటూరి రైతువి, నీకేం తెలుసు పోవోయ్!" అంటూండేవాడు. శాస్త్రికి మాత్రం కోపం వచ్చేది కాదు. రావుబావ నాగరికుడనీ, సంస్కారి అనీ, తనకు యుక్తమని తోచినట్లా నిర్భయంగా చేయగలవాడనీ, తనలాగ పిరికివాడు కాడనీ అతణ్ణి మెచ్చుకుంటూండేవాడు. తాను ఎంత పిరికి కాకపోతే, పిలకనైనా, [illegible] తీయించేస్తే, తండ్రీ తాతా కోప్పడతారన్న భయమే ఆయిర !

శాస్త్రి చెల్లెల్ని రావుకిచ్చి, మేనరికం చేద్దామని అతని మేనమామ ఆశించాడు. కాని రావు ఒప్పుకోలేదు. 'ఆరోగ్యశాస్త్రరీత్యా మేనరికం దూష్యం' అన్నాడు. అంతేగాకుండా తన చదువు పూర్తయి, ఉద్యోగంలో ప్రవేశించాక గాని పెళ్లిమాట తలపెట్టనన్నాడు. మేనల్లుడంత నిర్మొగమాటంగా ఉన్నందుకు శాస్త్రి తండ్రికి కోపం వచ్చింది. కాని శాస్త్రికి కోపం రాలేదు. 'నావాడు తనకు యుక్తమని తోచినట్లు నిర్భయంగా చెప్తాడు!' శాస్త్రి తండ్రి మరో సంబంధం చూసి పిల్లకి పెళ్లిచేశాడు. శాస్త్రికి మేనరికం స్వప్నంగా ఉండగానే చెల్లెలి పెళ్లితోనే అతని పెళ్లికూడా అయిపోయింది.

రావు బి. ఏ. ప్యాసై నౌకరీలో ప్రవేశించాకే పెళ్లిచేసుకున్నాడు. అతడు చదువుతున్న చదువుకి కలెక్టరీ ఉద్యోగమైనా కాకపోతుందా అనుకునేవాడు శాస్త్రి. రావుకి కలెక్టరీ కాలేదు గాని కలెక్టరాఫీసులో గుమాస్తా అయింది.

రావు సంతానములో మొదటిది ఆడపిల్లే. ఆమె పుట్టడంతోనే అందరూ 'లచ్చమ్మగారు పుట్టింద'న్నారు. కాని, రావు ఆమెకు తనతల్లి పేరు పెట్టలేదు. నాజూకుగా ఉండాలనుకొని, 'సరోజిని' అని బియ్యం మీద రాసేశాడు. 'సరోజ' అని పిలిచేవారు. ఎదిగినకొద్దీ, సరోజకి రోజా పుష్పానికుండే సౌకుమార్యం, అందం వచ్చాయి. ఖర్చెక్కువైనా కాన్వెంటు చదువే మంచిదనిపించి రావు సరోజను కాన్వెంటులోనే చేర్పించాడు. పిల్ల చకచకా ఇంగ్లీషు మాట్లాడుతోంటే, బి. ఏ. ప్యాసయిన తనకన్న బాగా మాట్లాడుతోందని మురిసిపోయేవాడు.

శాస్త్రికీ పిల్లలు పుట్టారు గాని మొదటి ఇద్దరూ మగపిల్లలు. మూడోదే ఆడపిల్ల. సరోజకన్న నాలుగేళ్లు చిన్నది. దానికి శాస్త్రి 'సుబ్బమ్మ' అని పేరే పెట్టాడు. శాస్త్రి సుబ్బమ్మకి ఎనిమిదోయేట పెళ్ళి నిశ్చయం చేసి, పిలుపుకోసం కాకినాడ వెళ్ళాడు. రావు, 'ఇంత చిన్నతనంలో పిల్లకి పెళ్లియేమిటి?' అని శాస్త్రిని కేకలేశాడు. బాల్యవివాహాలవల్ల వచ్చే అనర్థాలన్నీ చెప్పాడు. 'పన్నెండేళ్ళు వచ్చినా, సరోజకి నేను ఆమాటే తలపెట్టటంలేదు చూడు' అన్నాడు. శాస్త్రి చిన్నబుచ్చుకుని ఇంటికొచ్చాడు. 'పెళ్లి చెయ్యటమా, మానటమా?' అన్న మీమాంసలో పడ్డాడు. కాని అక్కడంతా, 'ఏమిటి శాస్త్రీ నీకేమైనా పిచ్చిపట్టిందా? ఆ ఇంగ్లీషు

మేను మాట పట్టుకుని, నిశ్చయమైన పెళ్ళిమానటమేమిటి?' అని చీవాట్లు పెట్టారు. అనుకున్న ముహూర్తానికి పెళ్ళిఐపోయింది.

రావు పెళ్ళికి వెళ్ళలేదు. భార్యని పిల్లల్ని కూడా పంపలేదు. 'పిల్లలు సరదాగా చూస్తారు. వెళ్ళొస్తా పోనీ' అందామె. బాల్యవివాహాలను వెర్రిగా ద్వేషిస్తాడు రావు.

ఆ మరుసటేడు శాస్త్రికి గొప్ప విపత్తు వచ్చింది.

పండుక్కి అత్తారింటికి వచ్చిన సుబ్బమ్మ మొగుడు పద్నాలుగేళ్ళ కుర్రవాడు. తోడుపిల్లలతో ఈతలకు వెళ్ళి కాలువలో మునిగిపోయాడు. అల్లుడి శవాన్ని, కూతురు ముఖాన్ని చూసి 'నేనేం పాపం చేశాను దేవుడా, నన్నిలా శిక్షించావు?' అని గుండె బాదుకుంటూ ఏడ్చేడు శాస్త్రి. ఒక్క శాస్త్రికాదు, గ్రామం అశేషం ఏడ్చింది.

ఈ ఘోరవార్త విన్న రావు, భార్యతో 'చూశావా, చెపితే విన్నాడుకాదు' అన్నాడు. 'ఇప్పుడామాట ఎందుకు? వెళ్ళి చూసిరండి' అన్నదామె.

పరామర్శకు వచ్చిన రావుని కౌగలించుకుని శాస్త్రి, 'నువ్వు వద్దంటే వినక పెళ్ళిచేసి, ఇలా దీని గొంతుక కోసేశాను బావా!' అని వెక్కి వెక్కి ఏడ్చేడు. రావు తేరుకున్నాక తిరిగివెళుతూ, శాస్త్రితో, 'సుబ్బమ్మకి మళ్ళీ పెళ్ళి చెయ్యి' అన్నాడు. శాస్త్రి విస్తుపోయి 'అదెలా సాధ్యం? ఊళ్ళోవాళ్ళూ, బంధువులూ హర్షిస్తారా?' అన్నాడు. 'అలాగని అన్నెంపున్నెం ఎరగని పిల్లని ఆ జన్మాంతం వెధవనిచేసి కూచో పెడతావా?' అని కోప్పడ్డాడు. శాస్త్రి బదులు చెప్పలేదు. రావు వెళ్ళిపోయాడు.

కాలం గడుస్తోంది. రావు చెప్పినమాట శాస్త్రి మనసులో మెదులుతోనే ఉంది. సుబ్బమ్మ కంటపడ్డప్పుడల్లా, అతని కడుపు తరుక్కుపోతూనే ఉంది. 'రావు బావ చెప్పినదే సరి. సుబ్బికి మళ్ళీ పెళ్ళి చేయటమే న్యాయం. కాని—' అక్కడితో ఆలోచన ఆగిపోయేది. ఏవేవో అభ్యంతరాలు కనపడేవి. కాని క్రమంగా కనుపిస్తున్న ఆ అభ్యంతరాలను ఎదుర్కొని, తల ఎత్తనివ్వలేదు. 'ఊరివాళ్ళు వెలేస్తే గ్రామం వదిలేద్దాం. బంధువులు హర్షించకపోతే రాకపోకలు మానుకుందాం' అని మనసు సమాధాన పరుచు

కూడా వృథా చెయ్యకుండా రావు గుంటూరు పరుగెత్తి వెళ్లాడు. ఇతగాడు ఇస్తానన్న కట్నం కానుకలకీ వాళ్లేమీ బేరమాడకుండా ఒప్పుకున్నారు. రావు నిశ్చయం చేసుకొచ్చి, భార్యతో, 'మన అదృష్టం కొద్దీ, ఈ నగను పెళ్లికాకుండా ఆగిపోయాడు' అన్నాడు. 'ఎక్కడెక్కడి పెళ్లికొడుకుల్నీ ఏరేసి ముడిపెట్టేసే మన సంఘంలో ఈ ఒక్కడూ ఎందుకు మిగిలిపోయాడు?' అన్న సంగతే వాళ్లాలోచించలేదు. సంబంధాలకోసం తిరిగి తిరిగి, చెప్పులరిగిపోయేటప్పటికి, మొదటి రోజుల్లో ఉండే జాగ్రత్త క్రమంగా సడలిపోయింది.

సరోజకి వైభవంగా పెళ్లిజరిగింది. శోభనం చేదామనుకుంటూంటే పెళ్లికొడుక్కి ఉష్ణం తగిలిందన్నారు. కార్యం అడ్డిపోయింది. 'మునిగిపోయిందేమిటి? మరో ముహూర్తానికి చేదాం' అన్నాడు రావు.

ముహూర్తం పెట్టి వాళ్ళే రాస్తారని ఊరుకున్నాడు రావు. కాని గుంటూరు నుంచివచ్చే ఉత్తరాల్లో అల్లుడికింకా టెంపరేచరు వస్తూనే ఉందని తేలింది. 'ఏమిటి చెప్మా?' అని ఓ మాటు బయల్దేరి వెళ్ళాడు రావు. అప్పుడు గుంటూరులో మెడికలాఫీసరు కృష్ణప్రసాదు. ఆయన రావు క్లాసుమేటు. ఆయనను తీసుకొచ్చి పరీక్ష చేయించాడు. టి. బి. అని తేలింది. 'ఇలా ముదరబెట్టేశారేమిటోయ్!' అన్నాడు ప్రసాదు. రావు గుండె గతుక్కుమంది. ఎప్పట్నుంచి ఇది? పెళ్ళికాకపూర్వంనుంచీ ఉందన్నమాటా? వియ్యాలవారిని నిలేసి అడిగాడు. 'మాకు మాత్రం తెలుసునాండి?' అన్నారు వాళ్లు. అతడు కోపంలో ఏదో అన్బోతే, 'పిల్లవాడికెలా ఉంటుందో అని మేం బెంగెట్టుకుంటే మధ్య మీ గొడవేమిటి?' అన్నారు. రావు రెణ్ణెల్లు సెలవుపెట్టాడు. అల్లుణ్ణి మదనపల్లి శానిటోరియంలో చేర్పించి అక్కడే మకాం పెట్టాడు. కన్నవాడికన్న ఎక్కువ శ్రద్ధతోనూ, ఓపికతోనూ అల్లుడికి వైద్యం చేయించాడు. వెయ్యిరూపాయలు అప్పు అయింది. కాని, పాపం, మాటదక్కలేదు. పుట్టెడు దుఃఖంతో కాకినాడ వచ్చేశాడు.

పరామర్శకొచ్చిన అమ్మలక్కలలో కొందరు తప్పంతా మొగపెళ్లివారిదే అన్నారు.

'అంత రోగం పెట్టుకుని పెళ్లిచేయడమేమిటి, వాళ్ళ దుర్మార్గం కాకపోతే?' అంది ఒకావిడ. ఇవతలకొచ్చాక ఆమెను సమాధానం మరో కావిడ. 'రోగమైతే పెళ్ళి మానుకుంటారుటో? ఆడదాని మంగళసూత్ర

బలం మంచిదైతే, మంచంపట్టిన మొగుడు ఇట్టే లేచి తిరుగుతాడు!' అనేసి సరోజలో కూడా తప్పు లేకపోలేదన్నట్లు తేల్చింది.

శాస్త్రికి దుర్వార్త తెలిసేటంతలోనే రెక్కలు కట్టుకొచ్చి వ్రాలేడు. తక్కిన వాళ్లసమల్లే వెంటనే వెళ్లిపోకుండా ఓ పదిరోజులు ఆగాడు. ఆ కబురూ, ఈ కబురూ చెప్పుతూ, వాళ్ల దుఃఖం శమింపచేటందుకు పాటు పడ్డాడు.

శాస్త్రీ రావూ కలుసుకుని చాలా కాలమైంది. సుబ్బమ్మ మొదటి భర్త చనిపోయినప్పుడు కలుసుకోవడమే, సరోజ పెళ్లికికూడా శాస్త్రి రాలేదు. నాకీ సాహసానికి కారణం చెప్పకుండా దరమిలాన ఉత్తరం వ్రాశాడు. బంధువులంతా నన్ను వెలేశారు. సంస్కారివి గనక నువ్వు లక్ష్యపెట్టవు గాని, పెళ్లికొచ్చిన వాళ్లంతా నన్ను చూసి నవ్వుతారు. అందుకు రాలేదు. మరోలా అనుకోకు. అని వ్రాశాడు. ఆ ఉత్తరం తరవాత, వాళ్ళు జాబులుకూడా వ్రాసుకోలేదు. అంచేత ఇప్పుడు కలుసుకుని మాట్లాడుకోడంలో చాలా సంగతులు వెళ్లాయి.

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్నట్లు. రాజారాం నుంచి మకాం ఎత్తెయ్యటం చాలా ఇబ్బందిగానే ఉందనుకో. కాని అవసరం... బెజవాడ మకాం బాగానే వుంది. నాజోలీ, శొంఠి ఎవరికీ అక్కర్లేదు. ఎటొచ్చీ అన్నీ కొనుక్కోవాలి. అంతేకాకుండా నాకిక్కడ ఏమీ వృత్తిలేదు. కాస్త ఇంగ్లీషు చదువుకుని, లెక్కాడొక్కా నేర్చినవాణ్ణి కాదుగదా... ఏమైనా ఇప్పట్లో ఏ సమస్యా లేదులే. శేషి పెళ్లి మళ్లీయేట చెయ్యాలి. మనశాఖలో ఆశలేదు. పై శాఖలలో ఛాన్సు ఎలా ఉంటుందో మరి..."

శాస్త్రి వెడుతూ, వెడుతూ 'సరోజకు మళ్లీ పెళ్లి చేసెయ్ సుమా' అని రావుతో చెప్పేశాడు. రావు మొదట్నుంచీకూడా సంస్కారి; సర్వం తెలిసినవాడు; ఎలాగా చేస్తాడు; తాను చెప్పేదేమిటి ?

ఆ యేడే సుబ్బమ్మకి కొడుకు పుట్టాడు. మరో ఆర్నెల్లకి శేషమ్మకి పెళ్లి సంబంధాలు చూశారు. స్వశాఖ వెలనాట్లలోనే వరుడొకడు కన పడ్డాడు. కాని శేషికి అతను నచ్చలేదు. శేషితల్లి, 'నచ్చలేదంటే ఎలాగే? మన్ని వెలేశారు తెలుసా? నిన్ను పెళ్లిచేసుకుంటానంటూ రావటమే చాలు. వద్దంటే పెళ్లి కాకుండానే ఉండిపోవలసొస్తుంది' అంది. శాస్త్రి, 'పోనిలేవే, నచ్చలేదన్నప్పుడు కట్టపెట్టటం ఎందుకు? నచ్చిన

వాళ్లనే చేద్దాం' అన్నాడు. ఆ అడుసు చూసుకొని శేషి, 'అలైతే రంగమన్నారుకు చెయ్యండి' అంది. రంగమన్నారంటే పక్కింటి వ్యా— బ్బాయి. అతడూ శేషి అంతకుముందు కూడబలుక్కునే ఉన్నారుట! 'నా కభ్యంతరమేమిటి?' అంటూ శాస్త్రి ఆ శుభకార్యం కానిచ్చేశాడు. కాకినాడలో సరోజకి మాత్రం మళ్ళీ పెళ్ళి ఇంకా కాలేదు.

'ఏమండీ, మీ రావుబావ అలా ఊరుకున్నాడు' అంది శాస్త్రితో, అతని భార్య.

'తగిన సంబంధం దొరికి ఉండదు. చదువుకున్న పిల్లాయిరి. అన్ని విధాల నచ్చాలి' అన్నాడు శాస్త్రి.

మరో రెండు సంవత్సరాలు గడిచాయి. సరోజకి పెళ్లి కాలేదు.

శాస్త్రి యింట ఓ పేచీ వచ్చి, అతణ్ణి ఓ వూపు ఊపింది. అతని పెద్ద కొడుకు పెళ్ళి చేసుకుంటానన్నాడు రాజమండ్రి కాలేజీలో తనతో బి.ఏ. చదువుతూన్న కమలకుమారిట పెళ్ళికూతురు. నాయుళ్ళపిల్ల. శాస్త్రి గుండె గతుక్కుమంది. 'వాళ్ళకీ మనకీ ఆహార విహారాల్లో ఎంతో భేదం ఉంటుంది. ఇబ్బంది పడిపోతాం; వద్దు' అన్నాడు. కొడుకు చిన్నబుచ్చుకొని చక్కాపోయాడు. నాలుగురోజులు గడిచాయి. ఐదోరోజున కొడుకుని పిల్చి శాస్త్రి, 'సాధకబాధకాలన్నీ బాగా ఆలోచించుకుని ఫరవాలేదని తోస్తే చేసుకో. నా అభ్యంతరం లేదు' అన్నాడు. ఆ సాధకబాధకాలేవో ఆ వధూవరులు ఇదివరకే ఆలోచించుకున్నారు. మరో పదిహేనురోజులకి రిజిస్ట్రీ మేరేజి అయింది.

కాకినాడలో సరోజకి మాత్రం మళ్ళీ పెళ్లి కాలేదు.

బెజవాడలో శాస్త్రికి జబ్బు చేసింది. జబ్బు అంటే మరేం లేదు. జ్వరం కాసింది. తగ్గిపోతుందనే అనుకున్నారంతా. కాని తగ్గలేదు. నాలుగో రోజుని మాట్లాడుతూనే పోయాడు.

ఆ ఉత్తరం చూసుకున్న రావుకి శాస్త్రి జీవితమంతా ఓ మాటు కళ్ళయెదుట కొచ్చింది. 'ఎంత చొరవ చూపేడు శాస్త్రి! నేనేం చేశాను? కబుర్లు చెప్పాను: కోతలుకోశాను! నా కబుర్లన్నీ అతనిలో కార్యరూపం దాల్చేయి! 'పిలక బావ' అనికదూ ఎగతాళి చేసేవాణ్ణి! చివరిదాకా పిలక జుట్టే శాస్త్రిది. నా కబుర్లూ ప్రసంగాలూ ఏమిటి లాభం? ఒక్క పిల్లకి మళ్ళీ పెళ్లి చెయ్యటానికి సాహసించలేకపోయాను! శాస్త్రిబావ కాదు చచ్చిపోత! నేనే పోయాను! రావే చచ్చిపోయాడు!

---

# ముందరి కాళ్లకు బంధం

ఆ వేళ పన్నెండో తారీఖు. శంకరం నెల జీతమంతా అంతకుముందే ఖర్చైపోయింది. ఐపోయిందంటే ఆశ్చర్యమేముంది? మహా ఆఫీసర్లని చెప్పుకుంటూ, సంపదలు పెంచుకునేవాళ్లకే ఐపోతున్నప్పుడు, కో-ఆపరేటివ్ బ్యాంకులో నౌకరీచేసే ఈ గుమాస్తా జీతం కాస్తా రెండో వారంలోనే ఐపోయిందీ అంటే అబ్బురం లేదు.

వచ్చిపడ్డ చిక్కేమిటంటే ఆవేళ శనివారం. వారంలో ఆఖర్రోజు. రేషను బియ్యం, గోధుమలూ, చక్కెరా కొనుక్కోవలసిన కడపటి దినం. ఆ మూడుసరుకులకీ మొత్తంబిల్లు ఐదురూపాయిల పైచిల్లరవౌతుంది. శంకరం వద్ద ఆ 'పైచిల్లర' ఉంటేగాని 'ఐదు' లేదు. "అప్పు ఎవడిస్తాడూ?" అని ప్రొద్దుట్నుంచీ ఆలోచిస్తున్నాడు శంకరం.

'అంత పెద్దఊరు. ఎన్నేళ్ళనుంచో ఉంటున్నాడక్కడ. స్నేహితులూ, పరిచయస్థులూ ఎంతోమంది ఉండుండాలి. బ్యాంకుకు వచ్చివెళ్ళే 'కష్టమర్లం'తా అతనికి తెలిసినవాళ్ళే అయిరి. అలాంటప్పుడు ఒక్క ఐదు రూపాయిల అప్పే పుట్టదూ?' అంటారేమో. పుట్టదనే చెప్పాలి. ఏమంటే, ఇవ్వకలిగిఉండీ, ఇష్టపడ్డ మిత్రులంతా అతగాడికి ఇదివరకే ఇచ్చేశారు. ఆ ఐదులూ, పదులూ అతడింకా తీర్చనేలేదు. తీర్చలేకనే పాపం. అలాంటప్పుడు మళ్ళీ వాళ్ళనే వెళ్లి అడగటం సబబూ కాదు, ప్రయోజనమూ ఉండదు.

ఇంక బ్యాంకుకు వచ్చివెళ్లే 'కష్టమర్ల' మాటంటారా?...ఎంతో ఆప్యాయంగా కబుర్లు చెప్పివెళ్ళే చలమాజీగారిని చనువుకొద్దీ ఓమాటు ఒక 'ఫేవరు' అడిగి చూశాడు. ఆయనకు 'ఎకౌంటు'లో డబ్బున్న సంగతి శంకరానికి తెలుసుగనక, ఆయన ఇష్టంవుంటే ఇవ్వగలడన్న ధైర్యంతోనే అడిగాడు. ఆ అడగటంకూడా ఆయన బ్యాంకుకు వచ్చినప్పుడు కాదు. దీనికోసం

ప్రత్యేకం ఆయన యింటికివెళ్ళి అడుగుతే మర్యాదగా ఉంటుందనీ, మొదట ఇవ్వటం ఇష్టంలేకపోయినా, ఇంతదూరం ఆశపడివచ్చాడు. 'ఈ తగేతులతో పంపేస్తే పోదుకదా' అని ఆలోచించైనా చలమాజీ ఇన్నాళ్ళకపోడనీ ఉద్దేశపడ్డ, శంకరం ఆయన బసకే వెళ్లేడు 'అప్పు' అంటూ ఆయన యింటికి ఎందరో రావటం, ఆయన ఏదో సాకుచెప్పి పంపెయ్యటం ఇదివరకే జరుగుతూన్నదే. శంకరాన్నికూడా అలా పంపేసినుంటే తీరిపోను. కాని అంతటితో ఆగక, చలమాజీ గారు ఆ విషయం బ్యాంకు మేనేజరు గారికా తీసుకువెళ్ళి చెప్పారు. చెప్పటంలోనూ ఏమని? 'మీ గుమాస్తా శంకరం చాలా అప్పులలో ఉన్నట్లున్నాడు. అలాంటివాళ్లని బ్యాంకులో ఉంచటం శ్రేయస్కరం కాదేమో' అని. ఆయన వెళ్ళటంతోనే మేనేజరు శంకరాన్ని పిలిచి, 'అప్పులు చేస్తున్నావుట! ఉద్యోగం ఊడిపోతుంది, జాగ్రత్త!'' అని హెచ్చరించాడు. ఆ దెబ్బతో శంకరానికి చావుతప్పి కన్ను లొట్టపోయినంత పనిజరిగి, 'ఇంక ఎన్నడూ కష్టమన్నమాత్రం అప్పు అడగకూడదని ఒట్టు పెట్టుకున్నాడు.

'అప్పు ఎవడిస్తాడు ?' అనే ప్రశ్నతో ఆ ఉదయం శంకరానికి ఈ నాడవన్నీ జ్ఞప్తికొచ్చాయి. ఎనిమిదిగంట లైపోయిందప్పుడే. మరోగంటకి ఆదరా బాదరా రెండు మెతుకులు నోట్లో వేసుకొని బ్యాంకుకు పరుగెత్తాలి. ఆ ప్రొద్దుట ఎక్కడకు వెళ్ళి, ఎవర్ని అడగటానికైనా ఇంక ఒక్కగంటే వ్యవధి. ఏమి పాలుపోక అతడు భార్యను సలహా అడిగాడు. అతడు మరిచిపోయాడేమో అన్నట్టూను, శివరామేశ్వరరావు, శేషగిరి, సుబ్బరామయ్య, రామచంద్రుడు, వెంకటప్ప, ఉమామహేశం వగైరా మిత్రుల పేర్లన్నీ ఒక్కొక్కటే చెప్పటం మొదలెట్టింది. వాళ్ళకి అతడు తీర్చవలసిన పాత బాకీలు జ్ఞప్తికి రావటం తప్ప ప్రయోజనం లేకపోయింది. ఆఖరికి జగదాంబ, 'మారండి, ఆ వేళ పార్కులో కనపడి మీతో చాలాసేపు ఆప్యాయంగా మాట్లాడాడు. ఆయన పేరేమిటి?' అంది. "ఆయనా? నవరాజు గారు. మంచి బాగా జ్ఞాపకం చేశావు! చాలా యోగ్యుడూ. స్నేహపాత్రుడూను. ఈ చిక్కు సమయంలో ఆదుకోకపోడు. ఎక్కడ కనపడ్డా, 'మా యింటికి ఓమాటు రండి' అని చాలామాట్లు అడ్రెస్సుకూడా చెప్పాడు. 'శివలెంకవారి వీధి' అని కదూ అన్నాడు?...నెంబరేమిటి చెప్మా?... ఏం పరవా, అక్కడికి వెళ్ళి వాకబుచేస్తే సరి'' అంటూ శంకరం పైమీద కండువా వేసుకుని బయల్దేరాడు.

బ్యాంకులోంచి తీసి ఇస్తాను' అని నమ్మించి పట్టుకుపోయాడు. సోమవారం కాదుకదా ఇంతవరకూ మనిషి పికర్ లేడు. దుర్మార్గుడు! నమ్మించి ఇబ్బందిలో పెట్టాడు. ఈనెల జీతమూ ఆఖర్లోజుకదా. మళ్ళీఖర్చు కూడా వచ్చింది. ఒక్క పాతికరూపాయలు సర్దాలి మీరు. రెండు మూడురోజుల్లో నాకో బాపతు సొమ్ము రావలసిఉంది. ఇచ్చేస్తాను" అన్నాడు.

నిలువునా నీరైపోయాడు శంకరం! రెండుమూడు నిముషాలదాకా నోటే పెగిలిందికాదు వాడికి. ఆఖరికి ఓ గొప్ప నేరం చేసినవాడికమల్లే నిలబడి, 'క్షమించాలి. నావద్ద ఏమీలేదు. మిమ్మల్నే అడుగుదామని వచ్చాను' అన్నాడు. మరోనిముషం మళ్ళీ నిశ్శబ్దం. ముడిపడ్డ కనుబొమ్మల్తో గవర్రాజుగారు, 'పోనీలెండి. పనిమీద వెళుతున్నట్లున్నారు. వెళ్ళండి' అన్నారు.

శంకరం, 'లేదండి, ఇక్కడికే వచ్చాను' అన్నాడుకాని, ఆయన వినిపించుకోకుండా లోపలికి వెళ్లిపోయారు. ఇహ అక్కడ నిలబడి ప్రయోజనం లేదని శంకరం ఇంటిదారిని పట్టాడు.

గవర్రాజు లోపలకు వెళ్ళేటప్పటికి ఆయన భార్య ఎదురైంది. "చూశావా, దొంగముండాకొడుకు, ఎంత అబద్ధమాడేశాడో! 'మీదగ్గరికి అప్పుకోసం వచ్చాన'టూ ముందరికాళ్ళకు బంధంవేసేశాడు!" అన్నాడు.

పద్మనాభానికి కోపం ఆగలేదు. 'స్వాతంత్ర్యం వెళ్లిపోతుంది దీక్షగా ఒకచోట కూచోక ఊళ్ళమ్మట బయల్దేరటా యేమిటంటారు బయట వెళ్లిపోవటం, ఈయన వెళ్ళమనటం సరిపోయింది!' అని ఒక్క విసురు విసిరేడు వెంకటేశం మళ్ళీ రెండు నిముషాలు దగ్గి గొంతుక సవరించుకుంటూ "ఇప్పుడు వాడింకా రాకపోవటంవల్ల ఆదుర్దాగా ఉండి ఇలా అనిపిస్తోంది గాని, వాడు వెళ్ళేటప్పుడు ఇలా అనుకున్నామా, బావా? 'ఎంతసేపు? బస్సులో వెళ్ళి చక్కా వస్తాడనుకున్నాం." అన్నాడు. విశ్వపతిగారు, 'ఏంపనిమీద పంపేరు అన్నగారూ? మరొకర్ని ఎవరినైనా పంపలేక పోయారా? నాతో సెలవిస్తే నేను ఎవరినైనా పంపించుండునే?' అన్నాడు వెంకటేశం యీమాటకు దగ్గలేదు. 'వాడే చేసుకోవలసినపని బాబూ అది. ఏమిటో మనవిచేస్తా చిత్తగించండి. మా రంగడు బి. యల్. పట్టా పుచ్చుకుని అమలాపురంలో ప్రాక్టీసు పెట్టాక వచ్చిన మొట్టమొదటి కేసుట ఇది. సరిగ్గా అది యీనాడే హియరింగుకు రావాలా చెప్పండి. మన అదృష్టం కాకపోతే? వస్తేం, మరోనాటికి వాయిదా వేయించుకోవచ్చు. నేనలాగ వేయించుకోమనే అన్నాను. కాని ఆ మునసబెవరో కర్కోటకుడనీ, వాయిదాలివ్వడనీ, అందులో తనలాంటి కుర్రవాళ్ళంటే ఆయనకు అసలే లక్ష్యం లేదనీ...ఇలా ఏవేవో అభ్యంతరాలు చెప్పుకొచ్చాడు. వీటికేంగాని ఇవేళ ఎలాగైనా వెళ్ళి ఆ కేసు వాదించి నెగ్గియ్యాలన్న ఉబలాటం, ఉత్సాహం వాడిలో కనపడి, వాణ్ణి ఆపటంకన్న పంపటమే మంచిదనిపించింది. చెప్పకపోవటమేం? మా పద్మనాభం వద్దంటూంటే, 'పోనీ వెళ్లి రానియ్' అన్నాను నేనే. ఎందుచేతో రాలేదో మరి, నాకూ యేమీ పాలు పోవటంలేదు. ఆఖరి బస్సు వచ్చిందా?'

'ఆఖరి బస్సు వచ్చి రాత్రి ఏడింటికే వెళ్లిపోతుంది.' అన్నాడు విశ్వపతి గద్గదికతో. వెంకటేశం ఇంక తను మాట్లాడవలసినదేమీ లేదు గనక మళ్లీ దగ్గు దొరకబుచ్చుకుని, ఆయాసంకూడా రావటంవల్ల, రోజాయి పైన నడుం వాల్చాడు. పద్మనాభంగారు మాట్లాడకుండా పందిరికేసి చూస్తూ కాగితపు బుట్టలసంఖ్య లెక్కపెట్టటం మొదలెట్టాడు. విశ్వపతి ఏమీ తోచక ఇంటికి తిరిగొచ్చి భార్య సావిత్రమ్మతో అంతా చెప్పి, అంతవరకూ అణిగివున్న కోపాన్ని కక్కుతూ, వెంకటేశాన్నీ, పద్మనాభాన్నీ, మునసబునీ, కోర్టునీ, దావాలనీ, పార్టీలనీ తిట్టటం ఆరంభించాడు.

* * * * *

గంటేగా ఆలస్యం? అంతలో మునిగిందేమీ లేదు. ఈ ఆలోచనతో అత గాడు పేపరు కొనుక్కుని, సోడాకొట్టు ముందున్న కుర్చీపీటమీద చతికిల పడి, చదవటం ప్రారంభించాడు.

గంట అయిందిగాని బస్సురాలేదు. మరికాసేపు ఎదురుచూసి, 'ఊరికే కూచోటమెందుకు? భోజనంచేసి వద్దాం' అని హోటల్లోకి వెళ్ళాడు. భోజనంకానిచ్చి వచ్చాడుగాని బస్సురాలేదు. కొమరగిరిపట్నంవైపు వెళ్దా మనుకున్న మిగతావాళ్ళు యేమయ్యారో గాని అక్కడ కనపడలేదు. బస్సు వస్తుందా, రాదా? పెళ్ళి ముహూర్తసమయంలోనే దిగడిపోయిందేమిటి ఖర్మం? సోడాకొట్టువాణ్ణి సలహా అడిగాడు. 'రాకేం చేస్తుందండీ, వచ్చేస్తుంది' అన్నాడు వాడు.

కాని బస్సు రాలేదెప్పటికీ. రిపేరు ఏదో వచ్చి దారిలో ఉండిపోసి ఉంటుంది. ఎనిమిదిన్నర దాటిపోయిందప్పుడే. ఇంక ఆలస్యం చెయ్య కూడదు. మరోహూరిదీ మరోహూరిదీ కాదు. సొంతపెళ్ళి ఆయిరి! ఏదో ఓ బండి చూసుకుని వెంటనే కొమరగిరిపట్నం చేరుకోవాలి. ఈ ఆలోచన బాగానే ఉందిగాని బండి యేది? స్టాండులో ఒక్కబండికూడా లేదు. మునసబుకోర్టు, సబుకోర్టు, ఇంకా ఇంకా పెద్ద పెద్ద ఆఫీసులు ఎన్నో ఉండి తాలూకా హెడ్‌క్వార్టర్సుగావున్న అమలాపురానికంతకీ ఒక్క టాక్సీ ఐనా యేడిసిందికాదు. పోనీ, ఎంతకైనా ఇచ్చేసి అరగంటలో చేరు కునే ఉండును కొమరగిరిపట్నం! రంగధామం తన అవస్థలో అలాగ అనుకు న్నాడేకానీ, నిజంగా ఆ ఊళ్లో టాక్సీలే వుండేమాటుకు అతగాడికోసం కూచునేవా? బస్సూ, బస్సులతోబాటు అవీ ముహూర్తమేదో పోయి ఉండేవి!

తొమ్మిదయింది. రంగధామరావుకి తొందర యెక్కువయింది. కారు గలవాళ్ళ నెవరినైనా బ్రతిమాలితే? 'ఈ రాత్రి నాకు పదమూడు మైళ్ళ దూరంలో వివాహం. ఇక్కడ ఇలా బండీ, బస్సూ లేక చిక్కుకుపో యాను. కటాక్షించాలి' అంటే గుండె కరిగి వాళ్లు ఇవ్వకపోతారా? కాకపోతే, 'పెళ్లి ముందుపెట్టుకుని ఏం మునిగిపోయిందని వచ్చావిక్కడికి?' అని రెండు చీవాట్లు వేస్తారు. అంతేగా? కానీ కార్లున్నవాళ్లల్లా ఇద్దరే ఆ ఊరికంతా. సబ్‌జడ్జీకుంది. డాక్టరుకుంది. వాళ్లిద్దరికీకూడా తన మొహం

మైనా తెలవదు. ఎలాగ అడగటం ? ఎలాగో అడిగి వాళ్ళచేత 'సరే' అని పించుకున్నా డ్రైవర్లుంటారో ఉండరో ? అన్నట్లు డాక్టరుకు నేనే డ్రైవరు న్నట్లేను. ఆయన డ్రైవ్ చేసుకు పోతూంటాడు. వారు ఇస్తానన్నది చాలక మీరే డ్రైవ్ చేసి పెట్టండంటే యేం బాగుంటుంది ? బాగుండే దేమిటి ? పని జరుగుతుంటే బాగోగులమాట చూడక్కర్లేదు...విధంచెడ్డా ఫలందక్కుతుందా అని ?...నంగభావాని కంతటి ధైర్యం కలగలేదు. 'మీనమేషా లెక్కపెడుతూ ఇక్కడే నిలబడితే యేంలాభం ? పడికావ స్తోంది. ఆరుగంటలకే మెల్లగా నడక మొదలెడితే యీ పాటికి కెలాగో కొమరగిరిపట్నం చేరుకుని ఉందును. దిక్కుమాలిన బుర్ర పనిచేసింది కాదు' అనుకుంటూ ఆతగాడు కొమరగిరిపట్నం రోడ్డు పుచ్చుకొని నడక ప్రారంభిం చాడు. 'జన్మలో ఎన్నడూ పట్టుమని పదిఫర్లాంగులు నడవని నాకు పెళ్ళి నాడే నడక కర్మమేమిటి ? తప్పనిసరి గనక కాళ్ళీడ్చుకుంటూ నడిస్తే, లగ్నంవేళకి చేరుకోగలనన్న ధైర్యంకూడా లేదు. ఆ సంగతింగు ఇవాళే రావాలా ? వస్తే మాత్రం యీనాళ్ళఖర్మం వాళ్లదని ఊరుకోక నే నిక్కడకు తయారవటం యేమిటి ? దిక్కుమాలిన బుర్ర సరిగా పనిచేసింది కాదు.' అని తిట్టుకోటం మొదలెట్టాడు. 'నన్ను తిడితే యేంలాభం స్వామీ ? జరిగినదాని కనుకుని యేంలాభం ? ఇప్పుడు నన్ను సరిగా ఉపయోగించి పని సాధించండి' అంది ఆ బుర్ర. అప్పటి కాతను సుబ్బరాయుని గుడివరకూ వచ్చాడు. ఒక వందగజాల దూరంలోనే డాక్టరు బంగళా కనపడింది. ఆలోచిస్తూ అడుగులువేసి డాక్టరింటి కెదురుగా నిలబడ్డాడు. అంతా పడు కున్నట్లున్నారు; నిశ్శబ్దంగా ఉంది. ఒక్క క్షణం తటపటాయించి, 'ఏమైతేకానియ్. చూద్దాం' అనుకుంటూ గుమ్మాలెక్కి వెళ్ళి తలుపు తట్టాడు.

*　　*　　*　　*　　*

కొమరగిరిపట్నంలో కన్యాప్రదాత విశ్వపతిగారు తనకు చేతనైన తిట్లన్నీ తిట్టేసి, చేసేదేమీలేక మళ్ళీ విడిదిలోకి వెళ్ళాడు. 'ఏమండీ, వచ్చారా, పెళ్ళికుమారుడుగారు ?' అన్నట్లుగా పరికించాడు, వచ్చుండడని తెలుసుండి కూడా. ఏమాటంటే యేం ఉప్పెన వస్తుందో అని అంతా నిశ్శ బ్దంగా ఉన్నారు పెళ్ళివిడిదిలాగే లేదక్కడ. 'ఈ లగ్నానికి పెండ్లి జరుగు

తుందో లేదో!' అన్న ఆదుర్దాతో కూలబడిపోయారు. గడియారంమాత్రం 'నన్నెవరు అడ్డుపెట్టగలరు?' అన్నట్టు ఒక్కసారైనా మానకుండా పదకొండు గంటలూ కొట్టేసింది. విశ్వపతికి కళ్లనీళ్లపర్యంతం వచ్చింది. ఆయనేదో అనబోతూంటే పద్మనాభంగారే అన్నారు. "బావగారూ, నేనేం చెయ్యను చెప్పండి? ఏయింట్లో పెత్తనమైనా ఒక చేతిమీదుగా వెళ్లాలికాని, అందరిదీ తలో పెత్తనం పనికిరాదు. నేను 'వెళ్ళొద్దు' అన్నప్పుడు 'ఫరవాలేదు వెళ్లిరానియ్యి' అని పంపడమేమిటి?" ఆ విసురు తనమీదే అని వెంకటేశం గారు గ్రహించి, తనమీదకూడా కొంత తప్పు వుందిగనుక, ఏమీ మాట్లాడ లేదు. వచ్చే దగ్గును ఆపుకుందామనికూడా ప్రయత్నించాడు కాని, దాని తస్సాగొయ్యా, ఆ దగ్గుమాత్రం ఆగిందికాదు.

సరిగ్గా ఆ సమయానికే పందిట్లోకి ఓకారువచ్చి ఆగింది. అందరికళ్లూ అటువైపు తిరిగాయి కారులోంచి ముందు రంగధామరావు డాక్టరుగారి మందుల బాగ్ పుచ్చుకుని దిగాడు. కారు డ్రైవ్ చేసుకొచ్చిన డాక్టరు గిరి స్టెతస్కోపు చేతబట్టుకుని వెనకాలే వచ్చాడు. అంతా రంగధామరావుని ఏమిటేమిటో అడగబోయారుగాని అతగాడు, 'ఉష్' అంటూ మాట్లాడ నిచ్చాడుగాడు. డాక్టర్ని ఏమీ అడక్కుండానే వెంకటేశంగారి బల్లవద్దకు తీసుకు పోయాడు. ఆయన 'ఎవరురా ఈయన? డాక్టరులా గున్నాడే! ఈయన పనేమొచ్చిం దిప్పుడు?' అని అడగబోయాడు. కాని, ఆ దగ్గు అడ్డొచ్చి ఏమీ అడగనిచ్చిందికాదు. ఆయన లేవబోయాడుగాని డాక్టరు 'కదలకండి, అలాగే పడుకోండి' అని ఆజ్ఞాపించి, ఆయన ఊపిరితిత్తులు రెండు పరీక్షించి, బాగ్ తెరిచి ఇంజక్షనివ్వటానికి సన్నాహమంతా చేశాడు. అందరూ నిర్ఘాంత పోయి నిశ్శబ్దంగా నిలబడి చూస్తోంటే, మరో నిముషానికి వెంకటేశంగారు ఏదో అనబోతున్నా వినిపించుకోక, డాక్టరు ఆయనకు ఇంజక్షను ఇచ్చేసి, బాగ్ సర్దుకున్నాడు. 'వస్తానండి. మీరనుకున్నంత ఫరవాలేదు. రాత్రి నిద్ర బాగా పడుతుంది అవసరమనితోస్తే రేపు కబురుచెయ్యండి' అంటూ వెళ్లి, కారుఎక్కి స్టార్టుచేశాడు. రంగధామరావు చరచరా వెళ్లి, మూడు ఐదు రూపాయల నోట్లు ఆయన చేతిలోపెట్టి, 'థాంక్యూ సార్. ఆపదలో అడ్డు పడ్డారు పెళ్లి ఆగిపోతుందని ఆదుర్దాపడ్డాము అంతా' అన్నాను. డాక్టరుగారి కారు హారన్ చప్పుడుచేస్తూ వెళ్లిపోయింది.

రంగధామం లోపలికి రావటంతోనే, వెంకటేశంగారు ఇంజక్షనిచ్చినచోట తడుముకుంటూ, కళ్ళెర్రజేసి, 'ఏమిట్రా ఇదంతా?' అన్నాడు.

"ఏంలేదు మామయ్యా, బాలయోగిమూలాన్ని బస్సులూ, బళ్లూ అన్నీ మున్నుడివరం చక్కాపోయాయి. 'లగ్నం వేళకి అందుకోలేను. కాస్త మీ కారులో తీసుకువెళ్లి దిగబెట్టి రావాలి' అని డాక్టర్ని బ్రతిమాలుదామని గుమ్మం మెక్కాను. కాని నిద్రలోంచి విసుక్కుంటూ లేచివచ్చిన ఆయన ముఖం చూచేటప్పటికి నాకు భయంవేసింది. 'నేను టాక్సీవాణ్ణా, వచ్చి నిన్ను దిగబెట్టటానికని మొహం తగలేసి, తలుపు మూసుకుంటాడేమో అనిపించి, ఆయన్ని లాక్కురావటానికీయెత్తు వేశాను. ఏతేం, ఒక్క అబద్ధం కూడా చెప్పలేదు. 'మా మామయ్యకి దగ్గుగా ఉంది. ఈరాత్రి ఒంటిగంటకి నా పెళ్లి. మీరు ఇప్పుడు రాకపోతే నా పెళ్లి అడ్డిపోతుంది' ఇందులో అబద్ధమేముంది మామయ్యా?"

"ఏంలేదురా. ఎటొచ్చీ ఆయన నా దగ్గుమూలాన్ని నీ పెళ్లి అడ్డిపోతోందనుకుని వచ్చి, నాకు యీ ఇంజక్షనిచ్చి వెళ్ళాడు. మంచి ఎత్తు వేశావురా రంగా. నువ్విలా ఇక్కడకు చేరుకోకపోతే నీ పెళ్లిమాటకేంగాని వీళ్ళంతా జేరి నా పెళ్లి చేసేద్దురు!... వెళ్లు. ఇంక ఆలస్యం చెయ్యక ఊరేగింపుకు ముస్తాబు చేసుకో" అన్నారు వెంకటేశంగారు.

# కాంప్లిమెంటరీ టిక్కెట్టు

జోగారావూ శ్యామలాంబా పార్కునుంచి తిరిగొచ్చి తలుపు తెరిచే టప్పటికి ఎదురుగా నేలమీద తెల్లటి కవరొకటి కనపడింది.

"ఎవరు రాశారు?" అంది శ్యామలాంబ.

"ఉత్తరంకాదు, కాంప్లిమెంటరీ టిక్కెట్టు" అన్నాడు జోగారావు.

"కాంప్లిమెంటరీ టిక్కెట్టా? అంటే?"

"డబ్బిచ్చి టిక్కెట్టు కొనుక్కుని కాకుండా ఉచితంగా సినిమా చూడటానికని, కొందరికి ఇలాంటి పాసులు పంపుతారులే"

"సినిమావా? ఏం సినిమా అండీ?"

"గాజుల పిల్లట."

"బలే! ఇకనేం? ఈ సినిమాకి రేపో యెల్లుండో 'తీసుకెళ్ళండీ' అని అడుగుదామని అనుకుంటున్నాను కూడాను. సమయానికే వచ్చింది పాసు."

"ఎవరు పంపించారంటావ్?"

"ఎవరు పంపిస్తారు? మా అన్నయ్యే పంపించి ఉంటాడు."

"మీ అన్నయ్యా? పోస్టాఫీసులో గుమాస్తాపని చేసే మీ అన్నయ్యకీ, ఈ 'గాజులపిల్ల'కీ ఉన్న సంబంధం యేమిటి?"

"చాల్లెద్దురూ మీరూ మీ వ్యంగ్యమాటలూనూ! కార్డులు కొనుక్కోటానికనీ, బంగీలు పంపటానికనీ, మనియార్డర్లు కట్టడానికనీ ఎందరు వెళ్లరు పోస్టాఫీసుకి? మావాడు మీకుమల్లే ఓమూల ముంగిలా కూచునేరకం మనిషి కాడు. కలిసికట్టుగా ఉండి, పెద్దవాళ్ళందరితోటీ పరిచయం సంపాదించిన వాడు, ఏమనుకున్నారో!"

"ఐతే ఈ సినిమావాళ్లు కార్డులు కొనుక్కోటానికొచ్చి, మీ వాణ్ణి చూడటంతోనే చేయీచేయీ కలిపి, 'భాయీ భాయీ' అంటూ ప్రాణస్నేహితులై, 'ఇంత కన్నా యెవరికిస్తాం ఈ కాంప్లిమెంటరీ టిక్కెట్లు?' అనుకుని, మీ వాడిచేతిలో ఒకటి పడేసి ఉంటారంటావ్?"

"ఔను"

"ఐతే. ఈ టిక్కెట్టుతో, తనూ తన భార్యా సినిమాకి వెళ్లక, మనకెందుకు పంపిస్తాడూ? అంత త్యాగం, ఔదార్యం ఉందా మీఅన్నకి?"

"ఎందుకు లేదు? ఆమాటకొస్తే, ఔదార్యానికి మా అన్నతో ఎవరూ పోలరు ఏ పండుగకి నన్ను పిలవటం మానేశాడు చెప్పండి? మీకుమల్లే అనుకున్నారా ఏమిటి మావాళ్ళు?"

"నా మాట తీసుకొస్తావెందుకూ సందర్భంలేకుండా? మా చెల్లెల్ని నేను తీసుకు రాక ఊరుకోవటానికి కారణం ఏమిటో తెలుస్తూనే ఉంది."

"ఏమిటి తెలుస్తూనే ఉంది? నేను మీ చెల్లెల్ని తీసుకురావద్దన్నానా? అనవసరంగా నామీద విరుచుకు పడతారెందుకూ? మీకూ మీకూ అన్యోన్యాలు అలా అఘోరించాయి. మధ్య నేనేం చేశాను? మీరా నాకు..."

ఆ కాంప్లిమెంటరీ టిక్కెట్టు ధర్మమాఅంటూ, ఆ భార్యాభర్తల నడుమ ఇలా తుపాను ప్రారంభమైంది. పక్కింటి కామేశ్వరమ్మగారు ఆవేళకు అక్కడికి "ఐదురూపాయిలనోటుకు విడిరూపాయిలున్నాయా?" అంటూ రావటం మూలాన్న ఆ తుపాను ఆగిపోయిందేగాని లేకపోతే ఏ విధంగా చెలరేగి ఉండేదో మరి? కామేశ్వరమ్మగారు వచ్చి, తమ పేచీ అడ్డిపోయినందుకు శ్రీనివాసరావు మాత్రం సంతోషించాడు మళ్లీ ఆ సందర్భంలో తగువు రాకూడదని నిశ్చయించుకున్నాడు కూడాను. కాని శ్యామలాంబకు మట్టుకు అక్కసు తీరలేదు. చిల్లరనోటు పుచ్చుకుని వెళుతూన్న కామేశ్వరమ్మగారితో ఆమె, "ఏమండీ, రేపు 'గాజులపిల్ల' సినిమాకు వెళుతున్నాం. మా బావగారు ఫ్రీ టిక్కెట్లు సంపాదించారు!" అంది. ఈ మాటలు శ్రీనివాసరావుకు వినపడాలనే ఆమె గట్టిగా అంది. కామేశ్వరమ్మ "మీకు బావగారవుతారా? నాకు తెలియదాసంగతి. ఏంపని వారికి? ఈ పట్నంలోనే ఉన్నారా వారు?" అంటూ ప్రశ్నపై ప్రశ్న కురిపించింది. కాని సమాధానం రాకుండానే. రూపాయలకోసం కనిపెట్టుకుని ఉన్న

ఆవిడ భర్త 'రమ్మ'ని పిలవటం చూసి ఆమె వెళ్ళిపోవలసొచ్చింది. జోగారావుకి అన్నలెవరూ లేనేలేరు. శ్యామలాంబ పక్కింటావిడతో అనవసరంగా ఫ్రీ టిక్కెట్టుమాట తెచ్చి, "మా బావగారు పంపించా"రంటూ తన్ను వెటకారం చెయ్యటంలో అతనికి పుండుమీద కారం రాసినట్లయింది. ఐతేం? తన్ను కానట్లు ఊరుకున్నాడు. ఆ ఊరుకోడం, ఏమంటాడో చూదామనుకుంటూ లోపలికొచ్చిన శ్యామలాంబకు ఆశాభంగమే అయింది.

మర్నాడు జోగారావు బయటకు పోగా చూసి, శ్యామలాంబ డ్రాయరులోంచి ఆ కాంప్లిమెంటరీ టిక్కెట్టు తీసి పరిశీలించింది. "జూన్ పన్నెండో తారీఖున ఆరుంపావు ఆటకు" అని వుంది అందులో. పన్నెండంటే ఆ రోజునే. ఆవేళ వెళ్ళాలన్నమాట.

జోగారావు భోజనంచేసి ఆఫీసుకు వెడుతోంటే ఆమె, "ఏమండీ, ఒక గంటముందుగా వస్తారుకదూ సాయంత్రం?" అంది.

"ఎందుకు?"

"మరిచిపోయినట్లు మాట్లాడుతారేమండీ? సినిమాకు వెళ్ళొద్దూ మరి?"

"మీ అన్నయ్య కాంప్లిమెంటరీ టిక్కెట్టు పంపినాడు కదా అని. నాకు ఆఫీసువాళ్ళు గంట సెలవిస్తారా?"

"నిన్నరాత్రి కోపం ఇంకా పోలేదన్నమాట మీకు. సినిమాకని కాకుండా ఏదో పనుందని అడిగితే ఆఫీసువాళ్లుమాత్రం వొద్దంటారుటండీ?"

"వొద్దంటారనేకాదు. ఎక్కడో తిరువళిక్కేణిలో ఆడుతోంది. ఆ "గాజులపిల్ల" రాత్రి పదిగంటలైపోతుంది. మాంబళానికి బస్సు దొరుకుతుందో దొరకదో?"

"టిక్కెట్టు తేరగావస్తే మీ కన్నీ అభ్యంతరాలే కనపడతాయి. ఇదివరకు ఎన్నిమాట్లు సినిమాలకు వెళ్లలేదు? అప్పుడు దొరికిన బస్సులు ఇప్పుడు దొరక్కపోతాయేమిటి? అంతగా దొరక్కపోతే గుర్రబ్బండి కట్టించుకుందాం. టిక్కెట్టు కొనక్కర్లేదుగా? అసొమ్ము ఇలా పెడితేసరి"

ఇంక ఆట్టే బతిమాలించుకోకూడ దనిపించి, జోగారావు "సరే ఐతే నేను ఇంటికొచ్చేవేళకు చీర సింగారించి సిద్ధంగా ఉండు" అని చెప్పి ఆఫీసుకు వెళ్ళాడు.

వాళ్లు ఇదివరకు ఎప్పుడు సినిమాకు వెళ్లినా తొమ్మిదణాలకొనించి టిక్కెట్టు కొనేవారుకాదు. వాళ్లీనాడు ఫస్టుక్లాసులో మెత్తలున్న సోఫాలలో కూర్చొని చూడటం శ్యామలాంబకి సరదాగానే ఉంది. పెద్దపెద్ద ఆఫీసర్ల భార్యలతో సమంగా డ్రింకులూ, చాక్లెట్లూ, బిస్కెత్తులూ కొనాలనిపించింది. "టిక్కెట్టు ఖర్చు లేదుగా? ఆ సొమ్ము దర్జాగా ఖర్చు పెడదాం" అనిపించిందామెకు. "టిక్కెట్టు ఖర్చు లేకపోతేం? తక్కిన బిల్లంతా తడిసి మోపెడౌతోంది జాగ్రత్త!" అని జోగారావు మెల్లిగా సణిగాడు. "ఫరవాలేదండీ. ఇప్పుడే ఏ సరదా తీరినా. పిల్లలు బయల్దేరాక కాళ్ళకు సంకెళ్లే. అప్పుడు ఇంకెక్కడికి వెళదామన్నా వీలే ఉండదు" అన్నది.

జోగారావుకు "గాజులపిల్ల" కథ ఏమీ నచ్చలేదు. ఒక్క సందర్భం కూడా సహజంగా కనపడలేదతనికి. "ఎందుకు తీసినట్టు ఈ ఫిలుము?" అన్నాడు. మూడుగంటల ఫిలుమది. రెండుగంటలయాక, "పోదాంపద. తల నొప్పిగా ఉంది!" అన్నాడు. ఆవిడ ససేమిరా వప్పుకోలేదు.

ఆట అయిపోయిందిగాని "కాంప్లిమెంటరీ టిక్కెట్టు ఎవరు పంపించారు?" అన్న ప్రశ్నమాత్రం మిగిలిపోయింది. ఆ పంపిన స్నేహితుడెవడో సినిమా హాలువద్ద కనపడి, తమ థ్యాంక్స్ అందుకు వెళతాడని వాళ్ళనుకున్నారు. గాని అలా ఎవడూ వచ్చి కనపడలేదు. "ఐతే ఎవరు పంపించి ఉంటారండీ?" అంది శ్యామలాంబ. అతడు చిరాగ్గా, "ఎవడైతేం, నాపాలిట శనిగాడు! తొరగా అడుగువెయ్యి. అవతల బస్సు దొరక్కపోతే ఇంకా ఆముదం ఐపోతుంది!" అని చురుగ్గా నడిచాడు. ఆమె మాట్లాడకుండా అతని వెనక పరుగెత్తింది.

త్యాగరాయనగరులో బస్సుదిగి తమవీధి ప్రవేశించేవరకూ ఆమె మళ్లీ మాట్లాడనేలేదు. వెళ్లిన తక్షణం బస్సు దొరికిందిగనక, ఇంక పేచీ రాదనిపించింది. "ఏమండీ శనిగాడనేశారు! ఇలాగేనా కృతజ్ఞత చూపటం?" అంది మెల్లిగా. ఆమె ఏదో బదులు చెప్పబోతూంటే, వీధిలో నాలుగిళ్ల ప్రాంతంలోనే జనంగుమిగూడి ఏదో గలభా జరుగుతూన్నట్లనిపించింది. వాళ్లిద్దరూ చురుగ్గా అడుగువేసి, తమ ఇంటిముందే చేరిన ఆ గుంపుని "ఏమిటి?" అని అడిగారు.

"ఏమండి, మీరిలా సినిమాకు వెళ్లగానే చూసి, మీ యింట దొంగలు పడ్డారు. నే నెక్కడో వంటింట్లో పిల్లలకు అన్నాలు పెడుతున్నానేమో, మీ యింట వాళ్ళు ప్రవేశించిన అలికిడి తెలిసిందికాదు. సమయానికి మీ

పసమానుగాను దేవుళ్ళలాగ వెలిసి వచ్చారుగాని, లేకపోతే నాన్న అంతా దోచుకునేవాళ్ళు!" అంది కామేశ్వరమ్మగారు. శ్యామలాంబ గుండె కమ్ముక్కుంటూ లోపలికి పరుగెత్తింది. బీరువాల తలుపులు బాహాటంగా తెరిచివున్నాయి, ఆమె సిల్కు చీరలన్నీ బొత్తులు బొత్తులుగా బయటపడి ఉన్నాయి. వెండి సామానుల మూను పెట్టె మూత తెరచి ఉండి, కంచాలూ గిన్నెలూ నేలపాలు పడేసి ఉన్నాయి. డ్రాయరులో సొరుగులాగి ఉంచటం చూసి జోగారావు పరుగెత్తికెళ్ళి అందులో తాను భద్రపరచిన కరెన్సీనోట్ల బొత్తి కనపడక పోవటంతోనే 'గతుక్కు'మన్నాడు. గుమ్మంలో కాపలా కాస్తూ కూచున్న అతని పినతండ్రి వెంకట్రామయ్యగారు, "ఇవిగోరా నోట్లు. వాళ్ళని పోలీసుస్టేషనుకు తీసుకుపోయేటంతవరకూ నాకు వాళ్ల జేబులు సోదా చెయ్యాలని తోచిందే కాదు. వెళ్ళేముందు తడిమిచూస్తినిగదా ఒకడి జేబులో ఈ బొత్తి, రెండోవాడి జేబులో ఈ టిక్కెట్లూ దొరికాయి" అంటూ యిచ్చాడు.

"టిక్కెట్లేమి"టంటూ చూశాడు జోగారావు. తమకు వచ్చిన కాంప్లిమెంటరీ టిక్కెట్టులుమల్లేనే ఉన్నాయి అవన్నీ! శ్యామలాంబతో, "మనకి టిక్కెట్టు మీ పోస్టాఫీసు అన్నయ్య పంపాడనుకున్నావు! దాన్ని పంపుత మనం యెరగని యీ కొత్తన్నయ్యలు!" అన్నాడు. "దొంగ వెధవల్ని మా అన్నయ్యలనటం న్యాయంకాదు" అంటూ ఆమె నిజంగానే చిన్నపుచ్చుకుంది. "వాళ్లిద్దర్నీ చూచినవాళ్ళెవరూ దొంగలనుకోరు తెలుసా? ఇంతక్రితమే పోలీసువాళ్ళొచ్చి తీసుకుపోయ్యారుగాని, వాళ్ళెంత పెద్ద మనుషులులాగ కనపడుతున్నారో నీకేం తెలుసును? ఆ సెట్టూరు మల్లు వస్త్రలూ, ఆ జరీకండువాలూ చూసి నేనే దగాపడిపోయ్యాను. ఏంజరిగిందో తెలుసా? నేను సరిగ్గా ఎనిమిది గంటలకు వీధిలో బండిదిగి, 'అబ్బాయ్' అంటూ గుమ్మం యెక్కాను. లోపల దీపాలు కనపడుతూనే ఉన్నాయి. వాళ్ళలో ఒకడు చేరవేసిన తలుపు తెరచుకువచ్చి, "ఎవరు కావాలండీ మీకు?" అని అడిగాడు. నేను ఆ కొత్తముగం చూసి, "మా జోగారావు లేడా?" అన్నాను. "వారు నిన్ననే ఈ ఇల్లు ఖాళీచేసి మరోచోటికి వెళ్లిపోయారండీ. మేం కొత్తగా ప్రవేశించాం" అన్నాడు. "ఎక్కడికి మార్చేరుబాబూ?" అంటే, తడుముకోకుండా "చిన్నప్పన్ వీధి, తిరు

వలిక్కేణి, నెంబరు 23" అన్నాడు. నేనా అడ్రెస్సు రాసుకుని, సంచీ చేతపుచ్చుకుని తిరసునదాకి జట్కాపు. కామేశ్వరమ్మగారి భర్త ఎదురై, "ఏమండోయ్ ఎప్పుడొచ్చారు ?" అని పలకరించాడు. "ఏడున్నర గంటల ప్యాసింజరులో వచ్చానండి. మావాను ఇల్లు మార్చేశారుట గాని" అన్నాను. ఆయన నిర్ఘాంతపోయి, "ఇల్లు మార్చటమేమిటి ? ఐదు గంటలకి ఆయనా, భార్యా తాళం వేసుకుని వెళుతూంటే చూశానే ? సినిమాకు వెడుతున్నారంది మా ఆవిడ." అన్నాడు. దానితో నాకు అనుమానం వేసి, క్షణంలో ఇంట్లో ఉన్న మనుషులనూ పోగుచేసి, అందర్నీ ఆయన తమ్ముణ్ణి వాళ్లే బంట్రోతుల్ని వెంటపెట్టుకుని మళ్ళీ మీ గుమ్మం ఎక్కాం. "ఎవరయ్యా మీరు ?" అని ఆయన గద్దించి అడగటం, వాళ్ళిద్దరూ నీళ్ళు నములుతూ పారిపోవ టానికి సిద్ధపడటం, మేం మైనపడి పట్టుకోవటం అంతా ఒక్క క్షణంలో జరిగిందనుకో... వాళ్ళు మీకే టిక్కెట్టు పంపి బాగానే వేశారు. మద్రాసు టోపీ ! ఎట్లాచ్చీ తెలవని తలంపుగా నేను దిగి వాళ్ళ ప్లానుకు అడ్డురావ టం జరిగింది" అన్నాడు వెంకట్రామయ్యగారు.

---

# వసుంధరా విశ్వాసం

మహిళామణుల కళాశాల అది. ప్రిన్సిపాలు, డాక్టరు సావిత్రీ నటరాజన్, ఎం. ఏ. (ఆక్సన్) పి. హెచ్‌డీ. తన ఆఫీసు రూములో కూర్చుని, హిందీ లెక్చరరు ఉద్యోగానికని వచ్చిన దరఖాస్తులన్నీ పరిశీలిస్తోంది.

హిందీ రాజభాష కావటంతోనే దానికి ప్రాముఖ్యం ఎక్కువై, ప్రతి పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ పండితులూ, లెక్చరర్లూ ఒక్కమాటుగా కావలసివచ్చారు. డిమాండుకున్న సప్లయి తక్కువ కావటంవల్ల చాలా విద్యాసంస్థలు సరియైన హిందీవాళ్ళు దొరక్క తికమకలు పడవలసి వచ్చింది. తన కాలేజీలో తక్కిన ఉద్యోగాలన్నింటికీ ప్రచురణ లేకుండానే మనుషుల్ని సంపాదించ కలిగిందిగాని, ఈ హిందీ పోస్టుకిమాత్రం సావిత్రీ నటరాజన్ గారు, అనగా నటరాజన్ గారి సతీమణి ఐన సావిత్రిగారు ఎడ్వర్టయిజు చెయ్యక తప్పిందికాదు.

ఎడ్వర్టయిజుమెంటుకు సమాధానంగా చాలానే వచ్చాయి దరఖాస్తులు. వాటినే ఇప్పుడామె పరిశీలిస్తోంది. సుందరేశ ముదల్యారూ, వేదాంత దేశికర్, గోపాలమీనన్, కొట్టిక్రిష్ణ నంబియార్, నారాయణ ఆప్టె, గోవర్ధన నింబకర్—వీళ్ళ దరఖాస్తులన్నీ ఆమె చదువకుండానే క్రింద సంతకం మాత్రం చూసి పెదవి విరిచి పక్క ట్రేలో పారేసింది. ఆవిడ పెర్సనల్ అసిస్టెంటు, స్టెల్లా జోసెఫ్—జోసెఫ్‌గారి సతీమణి అన్నమాట. తర్వాత అప్లికేషను అందించింది. అది శంభుదాస్ దాల్మియా అనేవాడి సంతకంతో వచ్చిన దరఖాస్తు. ఆ సంతకంకూడా చూడ్డంతోనే సావిత్రీ నటరాజను ప్రాణం విసిగి "ఛస్" అని విసిరికొట్టింది. స్టెల్లా అదిరిపడి, "ఏమిటి చెప్మా?" అని బెదురు చూపులతో నిలబడేటప్పటికి, "వీళ్ళంతా మగవాళ్ళే! "ఈ పోస్టుకు మగవాళ్ళు దరఖాస్తు చెయ్యనక్కర్లేదు. స్త్రీలు మాత్రమే చెయ్యాలి" అని నువ్వు ఎడ్వర్టయిజుమెంటులో ఎందుకు రాయ

చేసు?" అని ప్రిన్సిపాలు ప్రశ్నించి అడిగింది. స్టెల్లా, ముసి ముసి నవ్వులతో "ఆడవాళ్ళ కాలేజీ గనక మీరు చెప్పకపోయినా చెయ్యకూడదన్న సంగతి మగ వాళ్ళకి తెలియకపోతుందా అని ఆ మాట రాయలేదు మేడమ్" అని సర్దేసింది. "ఎందుకమ్మా, మీరు ప్రతిదీ చూస్తూ టైము వేస్టుచేసుకోకండి. స్త్రీల దరఖాస్తులేవో నాలుగుతీసి సైడు పెడతాను. అవిమాత్రం చూద్దురుగాని" అని అధికారిణిని సమాధానపరచి, స్టెల్లా స్త్రీల దరఖాస్తులకోసం అన్వేషణ ప్రారంభించింది

ప్రారంభించిందేగాని కాస్సేపటికి స్టెల్లాకే ప్రాణం విసిగింది. శివశంకరపాండ్యా, విశ్వనాథసాఠే, గౌరీపతిశాస్త్రి, గోపాలక్రిష్ణ గంధేకర్ — ఏ దరఖాస్తు చూసినా శాస్త్రీ! మగవాళ్ళు! స్త్రీలజనాభా సగానికి వుంటారని కాని ఉత్తిమాట. చూడ్డానికైనా ఒక్కటిగాని ఒక్కటి కానరాదు. స్త్రీ దరఖాస్తు! ఆమె ఓపిక ఉన్నదేగాని, తనుకూడా ప్రిన్సిపాలుకు మల్లే ఈ దరఖాస్తుల్ని విసిగి కొట్టడానికి వీల్లేదు గనక కొసవరకూ చూడక తప్పదని మళ్ళీ ఓపిగ్గా తిరగేసింది. అన్నీ పురుషుల దగ్గర్నుంచే! ఇంకొక్కటే మిగిలింది. అదికూడా ఎవరో పురుషుడు పంపినదే ఐ యుంటుంది. ఐనా చూద్దాం.

స్టెల్లా చూసింది. ఆమె కృషి ఫలించింది. "కష్టే ఫలీ" అనీ, "కృషితో నాస్తి దుర్భిక్షం" అనీ ఊరికే అన్నారా పెద్దలు! ఆ దరఖాస్తు స్త్రీదే! "వసుంధరా విశ్వాసం" అని ఉంది వ్రాలు. "విశ్వాసం" — విశ్వాసమనాయనను పెళ్ళిచేసుకుందన్నమాట యీ వసుంధర. ఆ ఆలోచనతోబాటు స్టెల్లాకు మరో ఆలోచన వచ్చింది. ఈ దరఖాస్తు చేసినావిడ ఎవరో క్రిస్టియన్ ఐ యుంటుంది. "విశ్వాసం" "సంతోషం" "ఆనందం" ఇలాంటిపేర్లు క్రైస్తవులకే ఉంటాయి...ఇంత పెద్ద కాలేజీ అన్నమాటేగాని స్టాఫు అంతకీ తనొక్కర్తె క్రిస్టియను. ఈ వసుంధర వస్తే ఎప్పుడైనా మాటా మంతీ ఆడుకోడానికి వీలుగా ఉంటుంది. క్వాలిఫికేషను కాస్త తక్కువైనా సరే ఈవిడకు ఉద్యోగం వేయించాలి.

ఆ నిశ్చయంతో స్టెల్లా, ఆ దరఖాస్తును ఆమూలాగ్రంగా చదివింది. క్వాలిఫికేషన్లు తక్కువేమిటి? విశారద, బి. ఓ ఎల్. ఇంకా యేవేవో ప్యాసయ్యానని ఉంది ఆ దరఖాస్తులో. ఇంక ఆలస్యమెందుకు? ఆలోచనెందుకు? ఆ కాగితం తీసుకెళ్ళి ప్రిన్సిపాలుముందు పెట్టింది స్టెల్లా. సావిత్రి

నటరాజను అప్లికేషను పూర్తిగా చదివి, ఎడ్రెస్సులో "గుంటూరు" అని ఉండటం చూసి, "తెలుగు" అంది. "ఔను మేడమ్" తెలుగు కనుకనే ఈవిడ్ని తప్పకుండా ఇప్పుడు అపాయింటు చెయ్యాలి ఏమంటే, మన కాలేజీలో తెలుగు లెక్చరరుషిప్పుకూడా అరవామెకు ఇస్తిమని నిండా గోలగా ఉంది. తెలుగావిడ ఒక్కర్తే స్టాఫులో లేనన్నలోటూ తీరిపోతుంది" అంది స్టెల్లా. ప్రిన్సిపాలు, స్టెల్లాకు తెలుగువాళ్లంటే ఇంత అభిమానమెందుకో చెప్మా అని మనసులో అనుకుంటూ, 'సరే, వచ్చి జాయిన్ కమ్మని వ్రాయి' అంది. 'టెలిగ్రాము సంప్రదాయం మేడమ్. కాలేజీ తెరచి ఇరవై రోజులైనా ఇంకా లెక్చరరు రాలేదని గోలచేస్తున్నారు పిల్లలు' అంది స్టెల్లా. "సరే" నంది ప్రిన్సిపాలు.

తన అక్క కూతురుకో, తన కూతురుకో ఉద్యోగం వేయించుకుంటే వచ్చినంత సంబరంతో స్టెల్లా టెలిగ్రాం రాసి పట్టుకొచ్చి, ప్రిన్సిపాలు ముందు అప్రూవలుకు పెట్టింది. "శ్రీమతి వసుంధరా విశ్వాసం" అని ఆరంభమైన చిరునామా చూచి ప్రిన్సిపాలు "టెలిగ్రాములో మర్యాద లవసరంలేదు స్టెల్లా. అణా తగ్గినా తగ్గటమే!" అంటూ 'శ్రీమతి' అన్న మాట కొట్టేసి, కాగితం తిరిగి ఇచ్చేసింది.

టెలిగ్రాం వెళ్లిన మూడోనాడు పదిగంటలకు మామూలుగా డాక్టర్ సావిత్రి నటరాజన్ తనగదిలో కూర్చుని, స్టెల్లా తయారుచేసి యిచ్చిన టైముటేబిలు పరికిస్తోంది. బంట్రోతు చిన్నచీటి ఒకటి తెచ్చి ఆమెముందు పెట్టాడు. "వసుంధరా విశ్వాసం... ఆల్ రైట్, రమ్మ"ను అన్నదామె. మరుక్షణంలో బిళ్లె పంచెకట్టూ, ఖద్దరు జుబ్బా, దానిమీద మడతవిప్పకుండా వేసుకున్న జరీఖండువాతో పిల్లమీసాల యువకుడొకడు ముప్పై యేళ్లకు లోపువాడు లోపల ప్రవేశించాడు. అతణ్ణి చూడ్డంతోనే సావిత్రి నటరాజన్ ఒక భూతాన్ని చూసినట్లుగా నిశ్చేష్టురాలైంది. కాని అతడు వసుంధరను వెంటబెట్టుకొచ్చిన మిస్టర్ విశ్వాసం అయివుంటాడనుకొని "మిసెస్సును తీసుకొచ్చారా? లోనికి రమ్మనండి" అంది. ఆమాటవిని, ఆవచ్చినవాడు తెల్లబోయి, "నేను అవివాహితుణ్ణి మేడమ్" అన్నాడు.

"అయితే, వసుంధర ఎవరు? మీ సిస్టరా?"

"వసుంధర మా యింటికోడలు!"

సతీరాజను
ఉంటాయి. దరఖాస్తులో 'నేను పురుషుణ్ణి' అని రాసేస్తే తీరిపోను. అసలు సంతకంలోనైనా ఏ 'మిస్టర్' అన్నో సూచిస్తే మా సంగతి తెలిసిపోను!" అన్నది.

విశ్వేశానికి కొంచెం కోపం వచ్చింది. "అమ్మా, నా యింటిపేరుతో మిమ్మల్ని మోసంచేద్దామన్న ఉద్దేశం నా కెన్నడూ లేదు. ఏమంటే నన్ను చూడ్డంతోనే, నే నెవర్నో తెలిసిపోయింది చూడండీ మీకు? అందుచేత దరఖాస్తులో మిమ్మల్ని దగాచేసి ఏం లాభం? ఇంక సంతకంలో నేను 'మిస్టర్' అనిచేర్చి తీరిపోకన్నారు. అలాగ సంతకాలు చెయ్యటం ఇదివరకెన్నడూ నేను వినలేదు. ఇంకా పోనీ మీరే ఒక పనిచేస్తే తీరిపోను. నాకు పంపిన టెలిగ్రాములో ఏ 'మిసెస్సో', 'శ్రీమతో' ముందు చేర్చిఉంటే, జరిగిన పొరబాటును గ్రహించి, వెంటనే 'అమ్మా, నేను జుబ్బావాడిని గాని, జాకెట్టుదాన గాను' అని మనవి చేసుకునేవాణ్ణి" అన్నాడు.

ఆమాట వినటంతోనే స్టెల్లాకి ప్రిన్సిపాలు ముఖంకేసి ఒక్కమాటు చూడాలనిపించింది. తాను 'శ్రీమతి' అని రాస్తే, ఈవిడ అనాఖర్చు తగ్గించాలని ఆ ముక్క కొట్టేసి, వ్యవహారం ఇంతవరకూ తెచ్చింది! ఇప్పుడేమంటుందో!

కాస్సేపంతా నిశ్శబ్దం. ఆఖరికి ప్రిన్సిపాలే మాట్లాడింది. "మిస్టర్ విశ్వేశం, జరిగిన పొరబాటేదో జరిగిపోయింది. మిమ్మల్ని ఇక్కడ అపాయింటు చెయ్యటానికి రూల్సు పర్మిట్ చెయ్యవు. మరోచోట ట్రైచెయ్యండి."

"సరే మేడమ్, నాదొక్క మనవి ఆలకించండి. ఉద్యోగమైంది అన్న సంబరంకొద్దీ, మామూలుగా థర్డుక్లాసులో వచ్చేవాణ్ణి, ఇంటరు టిక్కెట్టు కొనుక్కుని ప్రయాణం చేశాను. నాకీ ప్రయాణపు ఖర్చులు ఇప్పిస్తే, ఈ వ్యవహారంలో నాకు నష్టంలేకుండా చేసినవారౌతారు."

ప్రిన్సిపాలు స్టెల్లాకేసి చూసి, "టి. ఎ. ఇవ్వటానికి రూల్సు ఒప్పుతాయా?" అంది. "ఒప్పవు మేడమ్" అంది స్టెల్లా. మళ్ళీ ఒక క్షణం నిశ్శబ్దం. స్టెల్లా విశ్వేశంతో, "మిస్టర్, మీరు విజిటర్సురూములో ఉండండి ఒక్క నిముషం" అంది. విశ్వేశం ఆ గదివిడిచి వెళ్ళాడు. స్టెల్లా ప్రిన్సిపాలుతో, "మేడమ్, టి. ఏ. ఇవ్వటానికి రూల్సు ఒప్పవ్. అపాయింటు చెయ్యటానికి రూల్సు ఒప్పవ్. ఏదోఒకటి మాత్రం చెయ్యాలి. మనకి

అర్జంటుగా లెక్చరరు కావాలిగనుకా, ఆడవాళ్ళ దరఖాస్తు ఏదీ లేదుగనుకా, అతణ్ణి అపాయింటు చేసేస్తే, అన్ని సమస్యలూ తీరిపోతాయి. టెంపొరరీగా ఒక యేడాదికి వేద్దాం. మళ్ళీయేడు ఆడదివస్తే చూసుకోవచ్చు" అంది. ప్రిన్సిపాల్ "ఆల్ రైట్" అంది.

వింటున్న రూములో కూచున్న విశ్వేశంతో స్టెనో, "మిస్టర్ విశ్వాసం, ఉద్యోగం అయింది" అంది.

"థ్యాంక్స్ మేడమ్. మీరంతా నన్ను విశ్వాసం అనే అంటున్నారు. దానికేం గాని టి. ఏ. ఇవ్వటానికి రూల్సు వప్పవని నాకు ఉద్యోగం ఎలా ఇప్పించారు?"

"ఎవరు ఇప్పిస్తా? "వసుంధర" ఇప్పించింది. వచ్చి మేకులా కూచున్నావు' పొమ్మనలేక నౌకరీ ఇచ్చింది ప్రిన్సిపాలు. అదృష్టం అంటే నీదేనయ్యా విశ్వాసం. మగవాళ్ళనే వేసుకోవాలంటే, ఆ దరఖాస్తులో నీ తలదన్నిన క్వాలిఫికేషన్సున్న మగవాళ్ళెందరో ఉన్నారు. ఐతేం? నీకా "వసుంధరే" పెద్ద క్వాలిఫికేషనుఐ ఇప్పించింది... వెళ్ళు. "సి" బ్లాకులో 3వ గదిలో ఇంటరు జూనియరు క్లాసుంటుంది. తీసుకో" అని అతడేదో చెప్పబోతూంటే వినిపించుకోక తరిమింది.

---

విశ్వనాథంగారు డ్రాయరు లాగి అందులోంచి ఏదో తీసుకోబో యారు. అది అక్కడ కనపడక, డ్రాయర్లోవున్న కాగితాలన్నీ అటూ ఇటూ ఒత్తిగించి వెతకటం మొదలెట్టాడు. ఎంత వెతికినా కనపడకపోవ టంవల్ల ఆఖరికి ఆయనకు చిరాకేసు కొచ్చింది. తలుపు వెనకాల పొంచి ఉండి అంతా కనిపెడుతూ నిలబడ్డ కామాక్షి తొమ్మిదేళ్ల పిల్ల, "ఏమిటి నాన్నా. వెతుకుతున్నావ్?" అని అడిగింది.

"ఐదురూపాయిల నోటమ్మా. ఈ డ్రాయిర్లో పెట్టాను."

"ఐదు రూపాయిలా? మొన్న దసరాకి సిల్కుగౌను కుట్టించమంటే దగ్గిర రాగిడబ్బుకూడా లేదన్నావ్! ఐతే, ఐదురూపాయిలు పెట్టుకునే అబద్ధమాడావన్నమాట! పోనీలే."

ఆయనకి ఐదు రూపాయిలూ కనపడకపోవడమే కాకుండా అమ్మా యికి తను అబద్ధమాడిన సంగతి వెల్లడైపోయినందుకు మరికాస్త చిరాకెక్కు వైంది.

"అది కాదమ్మా, నేతివాడి బాకీ తీర్చడంకోసం ప్రత్యేకం ఆనోటు దాచాను. అలా కేటాయింపుగా ఉంచకపోతే ఐదుగాదు ఐదువందలకి సరి పడే ఖర్చుంది...సరే కాని, ఇంతకీ నోటేమైనట్లు?"

"ఏమైందా! నువ్వులేదని అబద్ధం చెప్పినందుకు అలాగే లేకుండా పోయింది!" అంటూ కామాక్షి అక్కణ్ణుంచి తుర్రుమంది. ఆ నోటు పోయిందీ తెలియక ఉన్నదీ తెలియక ఆయన చిర్రుమన్నాడు "ఒరేయ్ పెద్దబ్బాయ్. ఈ డ్రాయర్లో నోటుపెట్టాను, మీరెవళ్ళైనా తీశారా?" అని కేకేశాడు.

రాఘవరావు, "ఏమిటండీ ఫైవ్రూపీ నోటేనా?" అంటూ పక్క గదిలోంచి వచ్చాడు.

"ఔను."

"ఇప్పుడేం సంజాయిషీ చెబుతుందో అమ్మ! "పిచ్చి ఆలోచనలకి పోయి డబ్బు తగలెయ్యకమ్మా" అని చెబితే వింది కాదు!"

"తగలెయ్యట మేమిటి? మళ్లీ తగరపు తప్పేలాకేమైనా కొందేమిటి?"

"అలా కొంటే నయమే!"

"అబ్బ! అడగండి! నేను "వద్దు" అని చెవికి ఇల్లుగట్టి పోరేను. "పోనీ, నాన్నగారితో చెప్పి చెయ్యి, అన్నాను. వినందే!"

కొడుకు అన్నమాటలు సగానసగం చెవినిపడి, కాంతమ్మగారు వంటింట్లోంచి చక్కావచ్చింది "ఏమిట్రా నామీద ఏవో నేరాలు చెబుతున్నావు తీరకూచుని?"

"ఆ ఐదు రూపాయిల సొమ్మూ ఎలా తగులడించావని నాన్నగారడుగుతున్నారు!"

"తగులబడ నేమిట్రా తెలివితక్కువ వాజమ్మా! అలాంటి అవాచ్యపు మాటలు నోటమ్మట రాకూడదు"

విశ్వనాథంగారికి ప్రాణం విసిగింది. కామాక్షి, రాఘవరావు, కాంతమ్మ—ఒకాళ్ళ తరవాత ఒకాళ్ళు అంటున్నారేగాని, అసలు సంగతేమిటో చెప్పరేగారు. ఆయన వొళ్లుమండి, "సరేనా! ఏంచేశావో చెప్పు" అంటూ పళ్లు పిండుకున్నాడు.

"ఏమిటండీ నేనేదో పాడుచేసినట్లు నిలవేసి అడుగుతున్నారు! ఆ సొమ్ము సద్వినియోగమే అయింది."

"అంటే?"

"ఈవేళ శుక్రవారం మహాలక్ష్మికి భక్తితో పూజచేసి, ధనప్రాప్తి కలగాలని కోరుకుంటూ..."

"సరి! ఆ ఐదురూపాయిలూ పెట్టి శాస్త్రుల్లుగారి భార్యకి చీర కొన్నావన్నమాట!"

"కాదునాన్నా, లాటరీలో వేసింది." అంటూ, పెరట్లోవున్న కామాక్షి లోపలికి చక్కావచ్చింది.

విశ్వనాథం నిర్ఘాంతపోయి, "లాటరీలో నే! ఇదురూపాయలూనా?" అన్నాడు.

రాఘవరావు, "ఆహా! నిస్సంకోచంగా!" అన్నాడు.

"ఇదేమిటే? మనకి లాటరీ ఎందుకే? కష్టపడి సంపాదించుకుంటూన్న డబ్బుతో తృప్తిపడక, లాటరీలో అప్పనంగా డబ్బొచ్చి పడాలన్న దురాశ పట్టుకుందేమిటి?"

"దురాశేమిటండీ, డబ్బు చేదేమిటి? అదృష్టం బాగుండి ఏ పాతిక వేలో వస్తే, హాయిగా ఉండొచ్చు."

"పాతిక వేలే చాలా!"

"ఎందుకండీ ఆ వెటకారం? పెసరట్లు బుచ్చిలింగానికి లక్షరూపాయిలు రాలేదూ? ఆ మాత్రం చెయ్యకపోయామా మనం?"

ఆ మాటలు విన్నాక విశ్వనాథానికి కేంచెయ్యాలో తెలిసిందికాదు. "చాల్లే! 'తెలివితక్కువపని చేశాం' అని అఘోరించక ఇంకా సమర్థించుకుంటున్నావ్!" అని ఒక విసురు విసిరాడు. "ఇంతకీ తప్పంతా నాది. నోటు పెట్లో తాళం వేసుకుపోక 'ఎవరిష్టంవచ్చినట్లు వాళ్ళు తగలెయ్యండ'ని డ్రాయర్లో వదిలిపోవటం యేమిటి?" అని తన్నుతాను నిందించుకున్నాడు. కాంతమ్మగారు చిన్నబుచ్చుకుంది. కాని ఊరుకోలేదు.

"నేను జన్మానికల్లా శివరాత్రి అని ఒక్కమాటు ధైర్యంచేసి మీ డబ్బు ముట్టుకున్నందుకు మీ ఇష్టంవచ్చినట్లు మాటలంటున్నారు! అనండి. ఎన్ని అనాలో! ఇంతకీ ఆనందాన్ని నోరుమూసుకుని ఊరుకోక ఇంత స్వతంత్రించటమేమిటి నేను?" అని గద్గదిక తెచ్చుకుంది. ఓమాటు కళ్ళు ఒత్తుకుందికూడాను. దానితో అంతా నిశ్శబ్దం ఐపోయింది. వాళ్లల్లో ఎవరూ మాట్లాడకుండా అలా ఎంతసేపు ఉండి ఉందురోకాని, మరోక్షణానికి ఆవిడ రెండో కొడుకు, ఆనందం పత్రిక చంకన బెట్టుకుని లోపల ప్రవేశించాడు. ప్రవేశించి, "ఏమిట్రా, అంతా ఓ చోటజేరి ధ్యానం చేస్తున్నారు?" అన్నాడు.

తక్కినవాళ్ళు మాట్లాడలేదుగాని కామాక్షి, "ఏంలేదు చిన్నన్నయ్యా, అమ్మ మో లాటరీలో ఐదు రూపాయలు వేసిందని నాన్నగారు పొట్లాడారు" అని క్లుప్తంగా చెప్పేసింది.

ఆనందం అందమైన ముఖాలూ స్టడీచేస్తూ, "ఐసీ!" అన్నాడు సర్వం గ్రహించినట్లు.

"ఐతే అమ్మా, ఆ ఎదురూపాయిలూ లాటరీలో ఎందుకు వేశావ్?"

ఆ ప్రశ్నకి కాంతిమ్మగారు జవాబు చెప్పలేదు. విశ్వనాథంగారే, "ఎందుకేమిటి? ఒక్కుమ్మడిగా పాతికవేలు వచ్చిపడతాయని!" అంటూ వెటకారంగా వెలిబుచ్చాడు.

"ఐదయిదులు ఇరవై ఐదు. రూపాయి పెట్టుబడికి ఐదువేల రూపాయిల రాబడి అన్నమాట! ఇకనేం! ఫస్టుక్లాసు ఇన్వెస్టుమెంటు! 'వస్తే అంతా సుఖపడవచ్చు'ననే ఉద్దేశంతో లాటరీ వేసింది గనక పర్వనుబోనా ఫైడీయే! ఇంక అమ్మమీద కేసేముంది నాన్నా?"

ఈ మాటలతో వాతావరణం మారింది. విశ్వనాథంగారి ముఖాన్ని చిరునవ్వు మెరిచి, "కేసేమిట్రా? 'అమాంతంగా ఆ పాతికవేలూ ఒక్కుమ్మడి వచ్చిపడితే దాన్ని యేవిధంగా ఖర్చు చెయ్యగలం?' అని ఆలోచిస్తున్నాను, అంతే" అన్నారు.

"నిజమే నాన్నా, ఆ విషయం ఇప్పుడే సెటిల్ చేసుకోటం మంచిది. సొమ్మొచ్చి కూచున్నాక తీరికెక్కడుంటుంది?.....ఏమోయ్ అన్నయ్యా, నీకేమైనా సొమ్ము అవసరం ఉంటుందా?"

"నాకా? రెడీగా వున్నవాణ్ణి నేనే అసలు. మొన్న మా ప్రొప్రయిటరుకూ నాకూ మాటా మాటావచ్చి, 'నౌఖరీకి రాజీనామా ఇచ్చేద్దామా' అనిపించింది తెలుసా? 'మనకే డబ్బుంటే స్వంతంగా బిజినెస్ పెట్టుకొని ఒకడికి ప్రాధేయపడనక్కర్లేకుండా ఉండొచ్చుకదా' అనుకున్నా. మనకు సొమ్మువచ్చే విధానం ఉందీఅంటే ఈ క్షణంలో వెళ్లి మా ప్రొప్రయిటరుతో 'నువ్వెంత చేసు నీ ఉద్యోగం ఎంతచేసు!' అని, ముఖంమీద నాలుగూ దులిపేసి చక్కా వస్తాను."

"వచ్చి, 'రావ్ బ్రదర్స్—కెమిస్ట్సు అండ్ డ్రగ్గిస్ట్సు' అని బ్రహ్మాండమంత బోర్డు ఒకటి రాయించి, వాడిషాపు కెదురుగుండానే నీ షాపుకూడా ఓపెన్‌చేసి, వాడి బిజినెస్సంతా నువ్వే లాక్కోవచ్చు. మాంచి స్టేటస్సున్నవాడివని తెలియటానికి ఓచిన్న కారుకూడా కొను...ఐతే వీటన్నిటికీ నీకు ఏమాత్రం కావలసుంటుంది?"

"ఏడెనిమిద వేలైతే చాలోయ్" అన్నాడు రాఘవరావు.

"పోనీ తొమ్మిదివేలే అని వేసుకో" అన్నారు విశ్వనాథంగారు.

"ఆనందం! నీ స్కీమేమిట్రా?"

"ఏమేంటండీ, ఈ ఆనర్సు పూర్తి అయ్యే అవటంతో డైరక్టుగా ఇంగ్లండు వెళ్ళి బార్‌ప్యాస్, అమెరికా వెళ్ళి పి. హెచ్. డీయో ఏ చక్కా వస్తాను."

"రైట్! నీ ఫారిను ట్రిప్పుకి ఓ పదివేలు పడుతుందనుకుంటా."

"ఆ పదివేలతో మేనేజ్ చెయ్యొచ్చు."

"అమ్మడూ, నీక్కూడా ఏంకావాలో ఇప్పుడే చెప్పెయ్యి, ఆనక మళ్ళీ దెప్పకండావు."

కామాక్షి చాలాసేపు ఆలోచించింది. ఆఖరికి, "నాకో గొలుసు చేయించు నాన్నా" అంది.

"ఓసి వెర్రిమొహమా ఇంతేనే!" అంటూ కాంతమ్మగారు అందుకొని, "అన్నలిద్దరూ తండ్రి సంపాదించి పడేసిన ఆస్తికిమల్లే తలో పదేసి వేలూ పంచుకుంటూంటే నీకొక్క గొలుసేనే కావలసింది?" అని మందలించింది.

"పోనీ చెల్లికి తెలియకపోతే దానికేంకావాలో నువ్వే ఆలోచించి చెప్పరాదూ?" అన్నాడు రాఘవరావు.

"ఏంకావాలేమిట్రా? బోలెడంత ఖర్చుంది. దానికి మంచి సంబంధం చూసి పెళ్ళిచెయ్యాలంటే తగిన కట్నం ఇవ్వాలి. లాంఛనాలన్నీ జరపాలి, నగలూ నాణేలేకాకుండా ముద్దుముచ్చట లెన్నో జరపాలి. అప్పుడదాత్తగా సొమ్ముకోసం తడుముకోడంకన్న ఇప్పుడే ఓ ఐదువేలు బ్యాంకులో వేసుకోటం మంచిది"

"నిజమేనమ్మా. ఓ ఐదువేలు బ్యాంకులో వేద్దాం. సరేకాని అమ్మా, "నీకేంకావాలో చెప్పావేకాదు!"

"నాకా నాయనా, తండ్రీ కొడుకులూ చేరి అయిందానికీ, కానిదానికీ చివాట్లెట్టకుండా ఉంటే అదే చాలు. నా కింకేమీ అక్కర్లేదు!"

"అదేం, అలాగంటే ఎలాగ! ఇంతకీ ఈ డబ్బంతా నీ మూలాన్నే కదా వస్తోంట? మొహమాట పడక చెప్పు."

కాని కాంతమ్మగారు చెప్పిందికాదు. నిస్త్రాణంగా నిలబడిపోయింది. ఏతేం, కామాక్షి ఊరుకోలేదు.

"నాన్నయ్య. అమ్మాకేం గావాలో చెప్పనా?"

"ఏం కావాలో నీతో చెప్పి ఉంచానా?" అంది కాంతమ్మ.

"ఇంజనీరుగారి పెళ్ళాం నిన్న చేయించుకో మనలేదుటే?"

"ఆవిడకేం, తోంభై చేయించుకోమంటుంది. మనకు తాహతుం డొద్దూ?"

"తాహతు లేకపోవటమేమిటే, పాతిక వేలొస్తోంటే! ఏమి చేయించుకోమందో చెప్పు" అని హెచ్చరించాడు విశ్వనాథంగారు.

ఆవిడ ముసిముసి నవ్వులతో, "ఊహూ!" అందిగాని కామాక్షి, "రవ్వల దుద్దులు నాన్నా!" అనేసింది.

"అలా చెప్పు, ఇంకనేం?" అన్నారు విశ్వనాథంగారు. అంతా నవ్వారు.

"భేష్! చవట ఐదు రూాయిలు పోతేపోయాయిగాని. చక్కటి తలపులు పుట్టాయర్రా. మీ అందరికీ!—అయితే ఆనందం! మొత్తం లెక్క చూడు. రాఘవకి తొమ్మిదివేలు; నీకు పది; చెల్లెలికి ఐదు; మొత్తం ఇరవై నాలుగు. ఇంకో వెయ్యి మిగులుంది."

"ఆ వెయ్యీ, అమ్మ రవ్వలదుద్దులకి సరిపోతాయి" అన్నాడు ఆనందం.

"ఐతే పాతికవేలొచ్చినా ఆఖరికి నాకేమీ మిగలదన్నమాట!" అన్నాడు విశ్వనాథంగారు నవ్వుతూ.

"మిగలకేం నాన్నా?"

"ఏదీ! ఏం మిగిలిందీ?"

"సేతివాడి బాకీ నాన్నా."

ఆ మాటకి అందరూ నవ్వారు. అందరికన్నా విశ్వనాథంగారికి ఎక్కువగా నవ్వొచ్చింది. దరిమిలానకూడా ఆ మాట జ్ఞాపకంవచ్చి, ఆయన తనలో తానే నవ్వుకుంటూండేవాడు.

---

# అంతరం

కామాక్షమ్మగారంటే, అప్పుడు అమలాపురంలో డిప్టీకలెక్టరుగా ఉంటూన్న సోమరాజు పంతులు భార్య. పేరుకి డిప్టీకలెక్టరు ఆయనగాని, ఆ హోదా చెలాయించేది కామాక్షమ్మగారే. ఆవిడ పవరు చెలాయించడం అనేది ఆయన మేస్ట్రీటు ఐననాడే ఆరంభమైంది. మొదట గుమాస్తాగా చేరి, తర్వాత మేస్ట్రీటై, ఆపిమ్మట తాసిల్దారీచేసి, ఇప్పుడు డిప్యూటీ కలెక్టరయ్యాడాయన. ఆయనకిలా ప్రమోషనుమీద ప్రమోషను రావటానికి కారణం స్వభావికాగా తెలివైన వాడవటం. లంచాల కక్కుర్తి పడకుండా సూటిగా పని చేసుకుంటూ పోవటం అని అతని స్నేహితులు అభిప్రాయపడే వారు. కామాక్షమ్మగారి అభిప్రాయం మాత్రం అవేవీ కాదని. అతడు తన పెళ్లినాటికొక గుమాస్తా మాత్రమే! తను కాపరానికొచ్చి నప్పట్నుంచే కదా ఆయనకీ మంచిదశ ప్రవేశించింది? దీనికంతకీ తన జాతకం కారణం! ఈ ప్రయోజకత్వమంతా తనదే!

కామాక్షమ్మగారిలా అనుకోగలిగింది కనుకనే ఆవిడ భర్తమీదకూడా ఒక విధమైన పవరు చెలాయించ గలిగేది. ఒక ఉన్న ఇంటిపిల్ల ఇల్లరిక మున్న మొగుణ్ణి చూసినట్లు చూసేదావిడ సోమరాజుని. 'ఊరంతకీ డిప్టీకలెక్టర్నికాని, ఇంటావిడకీ డిప్టీకలెక్టర్నా?' అన్నట్లాయన ఆవిణ్ణి ఎప్పుడూ ప్రతిఘటించేవాడు కాడు. అలా చేయక పోవటమే తెలివైనపని అనుకోండి. ఏమంటే, ప్రతిఘటించి రభస తెచ్చుకోటంతప్ప ప్రయోజనం ఉండదని ఆయనకి బాగా తెలుసు

ఆయన భార్యతో చటుక్కుని ఏకీభవించనిదల్లా ఒక్కమాటే-ఆవిడ శ్యామల పెళ్లి ప్రస్తావన తెచ్చినప్పుడు, "పిల్లకి పద్దానుగోయేడు వచ్చింది. తగిన సంబంధం చూసి ఈ యేడు పెళ్లి చేసెయ్యాలి" అందావిడ. "వేరే చూడ్డం యేమిటి? కాశీపతి కొడుక్కిచ్చి చేస్తానని యెప్పుడో అన్నానుగా" అన్నాడాయన. ఆమాట ఆయన నోటమ్మట వచ్చేసరికి పొడుకలవచ్చి

ఉలిక్కిపడి లేచినట్లయింది కామాక్షమ్మకి. "ఏమిటి, ఏమన్నారు? ఇంకా ఆ మేస్ట్రీటుతోనే వియ్యమందాలని ఉందా మీకు? వాళ్ళంతరం ఎక్కడ? మనంతరం ఎక్కడండీ? డిప్టీకలెక్టరు చేస్తూకూడా మీకీ చచ్చు ఆలోచన పోలేదేమిటి?" అంటూ ఒక తట్టు వరసపెట్టింది. ఆయన చెట్టనిచ్చి మెల్లిగా ఇలా అన్నాడు. "చూడూ, నేను డిప్టీకలెక్టరీచేసి వెలిగించిందీ లేదు, కాశీపతి మేస్ట్రీటుగా ఉండిపోయి, చెడిపోయిందీలేదు. వాళ్లు వచ్చిన దాంట్లోనే మిగిల్చి, మిగిల్చి, మరో పెట్టెడు భూమిదాకా సైనా కొనుక్కోగలిగారు. కాని నువ్వు నా జీతంలో ఒక్క కానీ ఐనా మిగల్చ లేక పోతున్నావు. ఇంక వాళ్ళ శేషగిరిమాట వాడు యేటేటా ఫస్టుగా పరీక్షలు ప్యాసై పోతున్నాడు. మన శ్యామలకి పద్ధానుగూ, వాడికి పద్దెనిమిదీని. ఈడూ, జోడూను. మరి మూడేళ్ళల్లో ఆనర్సు ప్యాసవుతాడు. ఎవరుపడితే వాళ్ళు కళ్ళు కద్దుకుని బోలెడు కట్నం యిచ్చి పిల్లనిస్తారు వాడికి. నువ్వు యేమిటో అనుకుంటున్నావు కాని, మనకి శ్యామల ఒక్కత్తే కాదుగదా. మందిమీద మజ్జిగ పల్చనన్నట్లు, ఆడపిల్లలందరికీ మనం పెద్ద పెద్ద కట్నాలిచ్చి చెయ్యగలమా? ఈ సంబంధం అన్నావ్? పేచీ పూచీ లేని వ్యవహారం. కాశీపతి, సత్యవతీకూడా మనం యేమిచ్చినా సంబరపడ తారు. ఆలోచించుకో."

ఈ మాటలు కామాక్షమ్మగారికి ఎంత మాత్రం రుచించలేదు. కాశీపతి తన మొగుడితోబాటు కలెక్టరాఫీసులో గుమాస్తాగా ప్రవేశించినా ప్రమోషననేదిలేక మొన్న మొన్నటిదాకా అలాగే ఉండిపోయాడు! అంతా ఈ మధ్యనేకదూ అతనికి మేస్ట్రీటవుత? ముందు ముందు తాసిల్దారీ ఐనా అవుతుందో కాదో! ఒకవేళ ఐనా ఈలోపుగా తన మొగుడికి జిల్లా కలెక్టరీ తప్పకుండా ఔతుంది! తన జాతకం అలాంటిది. తన భర్త జిల్లా కలెక్టరు కాబోతూ తానా సత్తెమ్మతో వియ్యమందడమా! ఛస్! ఇలాంటి దౌర్భాగ్యపు ఆలోచన తట్టిందేమిటి తన మొగుడికి? శ్యామల పుట్టినప్పుడు, 'నీకు కోడలు పుట్టిందిరా' అని ఆయన కాశీపతితో అన్నమాట నిజమే కావచ్చు. ఐతేం? అప్పటి పరిస్థితులు వేరు, ఇప్పటి పరిస్థితులు వేరు; ఈలోగా నిచ్చెనమెట్లు ఎన్ని ఎక్కిచచ్చింది తను! సత్యవతో? అణుగునే అణగారిపోయింది! తనంతరం ఎక్కడ, ఆవిడంతరం ఎక్కడ...ఆయనకి తోచినందుకు చెప్పాలి.

కామాక్షమ్మ భర్త కోరిన ప్రకారం ఆలోచించకపోలేదు. ఎంత ఆలోచించినా, తనకీ సత్యవతికీ ఉన్న ఆ 'అంతరమే' గోచరించింది. మూడురోజులయాక భర్తతో చెప్పేసింది. "మంచి మనిషికొక మాటా, మంచి ఎద్దుకొక పోటూను చెపుతున్నా వినండి. ఆ సత్తెమ్మ సంబంధం నాకు హితవుగాదు. వియ్యానికైనా, కయ్యానికైనా సమాన స్థాయి ఉండాలి. మన స్తోమతకి తగ్గ మరో సంబంధం చూడండి."

సోమరాజుగారు విని, 'ఆ హోదాయేదో సరిగ్గా చూసి, ఆ సంబంధమేదో నువ్వే చూడు' అని చెప్పి, అక్కడ నిలబడకుండా వెళ్ళిపోయాడు.

'నేను చూడకపోతే మీరు చూస్తారనుకున్నానా?' అన్నట్టుగా ఒక నవ్వు నవ్వి, ఆవిడే వరాన్వేషణ ప్రారంభించింది.

పెద్ద అన్వేషణ కేముంది? భర్త ఆఫీసులో హెడ్డు గుమాస్తాగా వుంటూన్న శేషాచలం గార్ని రప్పించి, అంతకు పూర్వం అక్కడ ఎవరెవరు డిప్టీ కలెక్టరీచేసి వెళ్ళారో, వాళ్ళలో ఎవరెవరికి పెళ్ళియీడు కుమారుల్లున్నారో, యావత్తు సంగతులూ అడిగి తెలుసుకుంది. శేషాచలం చిత్రగుప్తుడు లాంటివాడు. గోత్రాల దగ్గర్నించీ చెప్పుకొచ్చాడాతను. చంద్రశేఖరయ్య గారి కుమారుడు పద్దెనిమిదేళ్ళవాడు ఉన్నాడనీ, ఈపాటికేదో పెద్ద చదువు లోనే వుండి వుంటాడనీ, చంద్రశేఖరయ్యగారు సోమరాజు పంతులుగారికి మల్లే మడిగట్టుకు కూచోకుండా మడీ భాగ్యం సంపాదించాడనీ ఆ ఆరిందా గుమాస్తా ఆవిడకు తెలియజేశాడు.

"నువ్వు మాకు పరాయివాడవు గనకనా? పెళ్ళి సంగతి సంభాళ్ళేవో కనుక్కోరా. మనకి సంతోషపడుతుందని తోస్తే, వచ్చి తాంబూలాలు పుచ్చుకోమని రాద్దాం" అంది కామాక్షమ్మ.

"అలాగేనమ్మా, మీ శ్యామల పెళ్ళి ఒకటీ, మా కామి పెళ్ళి ఒకటీనా? స్వవిషయంకింద శిరసావహించి, కార్యం చక్కచేసుకొస్తా"నని చెప్పి, శేషాచలం మర్నాడే, చంద్రశేఖరయ్యగారు రిటైరై స్థిరపడివున్న నిడదవోలుకి ప్రయాణమై వెళ్ళాడు. వెళ్ళినట్టూ, వచ్చినట్టే లేదు. అంత త్వరగా వచ్చి, "పెళ్ళిసంబంధం నిశ్చయమైనట్టే. శ్యామన్ని చూచుకోటానికి రమ్మనికూడా మీ తరఫున చెప్పి వచ్చాను" అన్నాడు. "మంచిపని చేశావు!" అని కామాక్షమ్మ మెచ్చుకుంది.

చంద్రశేఖరయ్య, పెళ్ళికొడుకుతోబాటు, సౌగ్యనికూడా వెంటతీసు కొచ్చాడు. ఆయన కట్టిస్తినా, ఇంకా చిరిగిపోకుండావున్న ఆ లాంగు కోటూ, జరీపాగా ధరించే వచ్చాడు. ఆ కోటుకడ్డంగా బంగారపు గొలుసు బయట వేలాడుతూ కాసేపటికి కామాక్షమ్మ కంట్లో ప్రస్ఫుటంగా ఉంది. సుందరమ్మగారు కామాక్షమ్మకంటె వయసు మళ్ళినదే అయినా, కోయంబత్తూరు చీర సరికొత్తది కట్టుకొచ్చింది. [illegible] ఆవిడతోనే అందాలనిపించింది కామాక్షమ్మకి 'సుందరమ్మ' ఆ పేరే చెప్పుకుంటూ కాసేపు వరకూ! సత్తెమ్మా, సుబ్బమ్మా ఏం పేర్లవి! ఎప్పె!..... చెప్పొద్దూ [illegible], కామాక్షమ్మకి నచ్చిందా సంబంధం. వారు కోరినంతా ఇవ్వటానికి ఒప్పుకొని సోమరాజుచేత తాంబూలాలు ఇప్పించేసింది.

పెళ్ళిలో, పెళ్ళికొడుకు సాంబశివరావుకన్న ఒక ఛాయ ఎరుపూ, ఒక అంగుళం పొడుగూ, పొడుక్కి తగ్గ పుష్టీవున్న [illegible] పిల్లవాడొకడు తాను తెచ్చిన పెళ్ళిబహుమానాన్ని శ్యామల కందిస్తోంటే కామాక్షమ్మ చూసింది. 'ఎవరీ అబ్బాయి? ఎక్కడో చూసినట్టుగానే వుందే?' అనిపించిం దావిడకి.

"మరిచిపోయావా అత్తయ్యా? నేను శేషగిర్ని. కాశీపతి గారి అబ్బాయిని. మా అమ్మకి వంట్లో బాగుండలేదు. అందుచేత పెళ్ళికి రాలేకపోయింది. ఏమీ అనుకోవద్దంది" అన్నాడతడు.

"నువ్వటోయ్, ఎవరో అనుకున్నాను. ఈ నాలుగేళ్ళలో ఆనవాలు పట్టలేకుండా ఎదిగిపోయావు మరి!" అంది కామాక్షమ్మ. 'ఎదిగాడు గోడగా చక్కగా ఎదిగాడు!' అనుకుంది చూస్తూ. అప్పుడెవరో ఆవిడతో 'ఆయన చిలక్కి చెప్పినట్టు చెబితే పనికొచ్చిందిగాదు నీకు! నువ్వు తెచ్చిన పెళ్ళికొడుకు ఈ కుర్రాడికన్న ఏం ఎక్కువని!' అని దెప్పుతో నిలేసి అడిగి నట్లయింది.

సాంబం, శేషగిరీ నా స్నేహితులే ఒకే క్లాసులో చదువుతున్నా వాళ్ళకి పరిచయంతప్ప పెద్ద స్నేహమేమీలేదు. పెళ్ళిలోనే స్నేహమయింది. సాంబం అత్తవారింటికొచ్చి వెళ్ళినప్పుడల్లా శేషగిరిమాట చెపుతోండేవాడు. 'శేష గిరిగాడు తెలివైనవాళ్ళలో లెక్క. ఫస్టుక్లాసు వస్తుందనుకుంటున్నాను' అన్నాడొకమాటు. తనే అలా చెప్పటంవల్ల అత్తగారిమనసు నొప్పించటం అని అతనికేం తెలుసు?

సాంబం, శేషగిరీకూడా ఆనర్సు ప్యాసయారు. శేషగిరికి ఒక మార్కులో ఫస్టుక్లాసుపోయింది సాంబం తర్డుక్లాసులో ప్యాసయాడు. మామగారికి రాసిన ఉత్తరంలో, శేషగిరికి ఒక్కమార్కు తేడాలో, మొదటి క్లాసు పోయిందన్న సానుభూతిని కనపరిచాడు. "ఇతడు తనకి సెకండు క్లాసైనా రాలేదన్న విచారానికి బదులు, ఎవడికో ఫస్టుక్లాసు రాలేదని వ్యథపడతాడేమిటి ?" అనిపించింది కామాక్షమ్మకి. "ఇతను క్లాసు వస్తుందని అనుకోలేదుగా రాకపోతే విచారించటానికి ?" అన్నాడు సోమరాజు. "అతనికీ సెకండుక్లాసు వచ్చేదే, ఏదో ఒకమార్కు తక్కువై యుంటుంది" అందావిడ.

శేషగిరి బి. ఎల్. చదవటానికి మద్రాసు వెళ్ళాడు. కాశీపతి, కొడుక్కి పెళ్ళిచేసి, నౌకరీలో ప్రవేశపెట్టించాలనుకున్నాడుగాని, "తొందర పవద్ద"న్నాడు శేషగిరి. సోమరాజు సాంబంతో, "లా" క్వాలిఫికేషనుంటే అన్నివిధాలా ఉపయోగిస్తుంది. చదవ్వోయి" అని సలహా ఇచ్చాడు కాని, అతగాడు తనకీ "లా"లో "ఇంటరెస్టు" లేదనేశాడు. కామాక్షమ్మ కూడా వద్దనేసింది. "ఎందుకండి ప్లీడరీ ? ఈ పట్టా పుచ్చుకున్న వాళ్ళంతా వాదించేటప్పుడు మీముందు నిలబడవలసిందేకదూ ?..."చదువు చదువంటూ కాలయాపన చెయ్యక, సాంబాన్ని చక్కా నౌకరీలో ప్రవేశపెట్టించండి. అదృష్టం బాగుండి ప్రమోషనొచ్చి, మీకు మల్లేనే అతడూ డిప్టీకలెక్టరీ చేస్తాడు" అంది. చంద్రశేఖరయ్యగారుకూడా కుమారుణ్ణి రెవిన్యూ ఇలాకాలోనే ప్రవేశపెట్టడానికి నిశ్చయించారు. సోమరాజుగారే కలెక్టరుతో చెప్పి సాంబానికి గుమాస్తా ఉద్యోగం వేయించారు.

ఆనర్సులో జారిపోయిన ఫస్టుక్లాసును, శేషగిరి బి. యల్. లో పోనివ్వలేదు. వచ్చి బల్లకట్టి ప్రాక్టీసు మొదలెట్టాడు. "కేసులేమీ రావటంలేదుట పాపం" అన్నాడు సాంబం. "పరీక్షలు ప్యాసైతే సరిపోయ్. వాగ్ధాటివుండాలి. రేఖవుండాలి" అంది కామాక్షమ్మ.

మునసబీకి దరఖాస్తు పెట్టమని ముసలి ప్లీడరొకాయన సలహాయిస్తే శేషగిరి, "పోనీ ఓ దెబ్బ విసిరిచూద్దాం" అనిపించి అప్లికేషను పంపాడు. బ్రాహ్మల్లోకల్లో ఇతనికొక్కడికే సెలక్షనయింది. సోమరాజుగారికి కోనసీమనుంచి చాలా ఊళ్లకి ట్రాన్స్ఫరై ఆఖర్ని శ్రీకాకుళానికి బదిలీ అయింది. ఆయన ఆ ఊరు వెళ్ళి స్థాయిపడుతోన్న రెండ్రోజునే, మల్లు

పంచా, చల్లుచొక్కా ఖాదువా వేసుకున్న ముప్పైయేళ్ల యువకుడొకడు. పాతికేళ్ళ భార్యనీ ఐదేళ్ళ కొడుకునీ వెంటబెట్టుకొని ప్రవేశించి, "నమస్కారం పంతులుగారూ" అన్నాడు.

"ఎవరూ. శేషగిరిగావా ?" అన్నాడు సోమరాజుగారు.

"ఔనండీ, ఇక్కడ డిస్ట్రిక్టు మునసబుగా వుంటున్నాను" అన్నాడు శేషగిరి. సోమరాజుగారు సంతోషంతో కౌగలించుకుని శేషగిర్ని లోపలకి తీసుకెళ్ళాడు. "ఔనే. చూడూ, శేషగిరి భార్యనీ పిల్లాణ్ణీ తీసుకొని మనల్ని చూడటానికొచ్చాడే. ఇక్కడ జిల్లా మునసబుగా ఉంటూన్నాట్ట" అని కామాక్షమ్మతో అన్నాడు. శేషగిరి కొడుకుని పలకరిస్తూ, "అచ్చు మీ నాన్న ఫోటోయేరా నువ్వు ?"... శేషగిరీ, నువ్వు ఈ ఈడులో ఇలాగే ఉండేవాడివి" అన్నాడు.

కామాక్షమ్మ కిదంతా వెగటుగా తోచింది. "మగపిల్లవాడు తల్లి పోలికైతే అదృష్టంగాని తండ్రిని పోలితే యేముంది ? ఎందుకూ ఈ ముసిలాయన ఇంత పొంగిపోతాడు ?" అనుకుంచావిడ. ఐతేం, ఆ హాలాహలం అంతా ఒక్కమాటు దిగమింగి, శకుంతల్ని కూచోమని ఆప్యాయం కనపరుస్తూ, "మా సత్యవతి కోడలువా అమ్మా ! నీ మొగుడికి జిల్లా మునసబీ అయిందా ? సంతోషం ! ఇదంతా నీ అదృష్టమే అనుకో. పెట్టిపుట్టావు" అంది.

వచ్చినవాళ్లు కాసేపు కబుర్లుచెప్పి, "వచ్చే ఆదివారం మాయింటికి విందుకు రావాలి" అని సోమరాజుని, కామాక్షమ్మని పిల్లల్ని ఆహ్వానించి వెళ్లిపోయారు. వెళ్లనిచ్చి, కామాక్షమ్మ, "ఏమండీ, మీరు సొంతవిషయంలో బొత్తిగా శ్రద్ధతీసుకోవటంలేదు. ఎన్నాళ్ళండీ ఆగుమాస్తాగిరీ, ఈపాటికి మేస్త్రీ చేసినా అవొద్దు ?' అంది.

'నాచేతిలో ఏముందే ? కాలం మారిపోతోంది. మనమాట వినే వాడెవడూ లేడు. అతడే ఆఫీసర్ల సొష్టసంపాదించి ప్రమోషను తెచ్చుకోవాలి" అన్నాడు.

కామాక్షమ్మ ప్రార్థన దేముడికి వినిపించినట్లుంది. ఏమంటే మనలో యేడాదికి, సొంతానికి కిష్టిమసని అయింది సొంబం దగ్గిస్నంచి ఆ ఉత్తరం వచ్చిన రోజున ఆవిడికి రాంగా సంతోషంగా వుంది, 'ప్రమోషను ఓమాటువస్తే ఇంక వసిసాక్కా అలా వస్తూనే ఉంటుంది' అనుకుంచావిడ.

ఐతేం ఆ సాయంకాలమే ఆవిడ సంతోషముతో చప్పబడి ఊరుకుంది. ఏమంటే, శేషగిరి, శకుంతలతో వచ్చి, తన్ను సబ్‌జడ్జీగా వేశారు, అనంత పురానికి' అని చెప్పి, "ఎల్లుండి వెళుతున్నాం" అన్నాడు.

"ఎల్లుండిదాకా ఎందుకు, తక్షణమే పోరాదూ? పనిగట్టుకొచ్చి మాతో చెప్పాల్సింది ఏమిటి?" అన్నది కామాక్షమ్మ. ఆవిడ ఏమనుకుం టున్నదీ వాళ్ళు గమనించలేదు. అక్కడే సేపు ఉండకుండానే, "పిల్లల్ని వదిలి వచ్చా"మంటూ వెళ్ళిపోయారు. ఆ వెళ్ళేటప్పుడూ శకుంతల మామూలు గానే అడుగులు వేసింది గాని కామాక్షమ్మకి ఆ నడకలో సబ్‌జడ్జీ గార్య కుండే ప్రత్యేకపు ఠీవియేదో గోచరించింది. ఆవిడకి దూరాన్ని కాకినాడలో ఉన్న శ్యామల జ్ఞాపకంవచ్చి, శ్యామలకి రావలసిన పదవి శకుంతల కొచ్చే సిందనిపించింది. శ్యామలకి ఆ స్థానం భోగాన్విత తనేగా! మొగుడు చిలక్కి చెప్పినట్లు చెపితే వింది గాదు తను! కాని ఆయన తన ఇష్టంవచ్చినట్లు ఏర గనివ్వటం యేమిటి? మొగాడు ఆడదానికి పెత్తనం వదలేస్తాడా ఇలాంటి వాటిలో! మరొకాటికే మరొకాటేనా. కూతురు పెళ్లి విషయమాయిరి! ఛీ, ఆయన ఎప్పుడూ ఇలాగే ముంచెబెట్టేస్తారు!

ఏళ్లు గడిచాయి. 1947 వచ్చింది. ఆగష్టు 15వ తేదీతో తెల్ల ఉద్యోగులు దేశంలోంచి వెళ్లి పెద్ద ఉద్యోగాలన్నీ మనవాళ్ళకి అందు బాటులోకొచ్చాయి. దానితో కామాక్షమ్మగారి చిరకాలవాంఛ ఈడేరి, సోమరాజుగారికి జిల్లా కలెక్టరీ అయింది. అప్పుడు అయినా కాకపోయినా ఒకటే ఆయనకి. ఏమంటే మరొక్క సంవత్సరంలో రిటైరు కాబోతున్నా డాయన. ఐతేం. కామాక్షమ్మకి మట్టుకి కలెక్టరు సతీమణి అనిపించుకో కలిగినందుకు ఆనందంగానేవుంది. ఆవిడ జాతకం మంచిది! కనుకనే 1947 ఆయన రిటైరు కాకుండానే వచ్చి, ఆయనకి కలెక్టరు పదవి యిప్పించింది. డిప్టీ కలెక్టర్లు కలెక్టర్లు కావటమే కాకుండా చాలామంది మేస్ట్రీట్లు తాసి ల్దారయ్యారు. ఆవిడ జాతకం భర్తకే కాకుండా అల్లుడికికూడా సాయంచేసి నట్లుంది! సాంబశివరావు తాసిల్దారయ్యాడు.

ఆయేడు వేసంగిలో కామాక్షమ్మగారు భర్తతో, "ఏమండి, మన లాంటి పెద్ద ఉద్యోగులస్తులంతా ఉతకమండలం వెళ్తారుకదా. మనం ఒకమాటు అక్కడికి వెళ్లి అదేమిటో చూసిరావాలండీ" అంది.

ఆయన "వెళ్ళకన్నానా, వేసంగుల్లో నెలవల్లనా కాకే అది వీలు. మనం వెళ్ళాలంటే ఇప్పుడు సెలవు పెట్టాలి" అన్నాడు. "పెట్టండీ పోనీ" అందా

విడ. ఆయన ఆవిడమాటకు ఎప్పుడైనా అడ్డుచెప్పాడు గనకనా! "సరే" నన్నారు. సెలవు పెట్టి ఉదకమండలానికి ప్రయాణం కట్టారు. అల్లుడికి కూడా ఉత్తరం రాయించి, కుటుంబంతో రప్పించింది. సోమరాజుగారు ఎరుగున్న స్నేహితుడొకాయనకు ఉదకమండలంలో ఒక ఇల్లు అద్దెకు చూసి పెట్టవలసిందని జాబురాశాడు. ఆ స్నేహితుడు సమాధానంలో "పెద్ద ఇళ్ళన్నీ భర్తీ అయిపోయాయి. ఒక బంగళాలో ఔట్‌హౌసొకటి మాత్రం ఖాళీగావుంది. అది కుదిర్చాను" అనిచెప్పి ఆ చిరునామా తెలుపుచేశాడు. సోమరాజు గారు ఇంటిల్లిపాదినీ వెంటబెట్టుకొని ఊటీచేరి, ఆ ఔటుహౌసులో ప్రవేశించారు. "ఇల్లు చిన్నదేమిటి? చాలు. ఆ సామానూ ఇంట్లో కుక్కుకుంటాం గనక నా? వేసుక చూట్టానికని అనతలకి పోతూనేవుంటాం" అని తృప్తిపడి కామాక్షమ్మగారు సామాను సర్దుతోంది.

బయట సోమరాజుగారూ, సాంబం ఎవరితోనో మాట్లాడుతోన్న అలికిడి అయింది. అవతలాయన కంఠస్వరం ఆవిడకి ఎక్కడో విన్నట్టే తోచింది 'ఎవరు చెప్మా' అనుకుంటూ ఆమె గుమ్మంలోకొచ్చేసరికి, "ఏమి త్తయ్యా, కులాసాగా వున్నారా? ఎవరో పరాయివాళ్ళు దిగుతున్నారనుకున్నాను. మీరే అని తెలియలేదు" అన్నాడు శేషగిరి.

సోమరాజు అందుకుని, "ఈ బంగళాలో మొన్ననే ఇతనూ పిల్లలూ దిగారట! తలవని తలంపుగా మనమంతా ఒకచోటే చేరటం ఎలాకుదిరిందో చూడు. ఆపేక్షలున్నచోట భగవంతుడిలాగే కుదురుస్తూంటాడు" అన్నాడు.

సాంబం, "శేషగిరీ, చాలా యేళ్ళయిందోయ్ మనం కలుసుకుని!" అని అప్పుడైనా కలుసుకోకలిగినందుకు సంబరపడ్డాడు. శకుంతలా, పిల్లలూ ఆ సమయానికే అక్కడికి చేరారు. సంగతి తెలిసి శకుంతల, "మన బంగళాలో కావలసినంత ఖాళీవుంటే, వీరు సామాను ఇక్కడ సర్దుకోడమేమిటి" అంది "నేనూ అదే అన్నాను పంతులుగారితో ఏం మామయ్యా, ఇంక మీరు అడ్డుపెట్టటానికి వీల్లేదు. మీ అమ్మాయేవచ్చి పిలుస్తోంటే. అభ్యంతరం చెప్పటానికి వీలేమరి?" అన్నాడు.

అంతవరకూ నోట మాటరాక నిలబడిపోయిన కామాక్షమ్మ చప్పుని, "అక్కర్లే ఎందుకయ్యా, ఇక్కడే వుంటాం. ఇంతకీ ఒక ఆవరణలోనేగా వున్నాం. అందరం అక్కడచేరితే మీకూ, మాకూ ఇబ్బందే" అంది. 'నాకేమీ ఇబ్బందిలేదు' అని శకుంతల చెప్పబోయిందిగాని, కామాక్షమ్మ

వైఖరి అదో మోస్తరుగా కనపడి, ఇంతట్లో అక్కడికొచ్చిన శ్యామలతో పరిచయం కలగచేసుకుంది. సోమరాజు, "శేషగిరీ, ఇప్పుడెక్కడా, నీ ఉద్యోగం? మళ్లీ ప్రమోషనేమైనా వచ్చిందా? నేనీమధ్యలో పేపర్లు సరిగ్గా చూట్టంలేదు. అన్నాడు. "కోయంబత్తూరులో జిల్లాజడ్జీగా వేశారు" అన్నాడు శేషగిరి. "జిల్లాజడ్జి! జిల్లాజడ్జీ అంటే జిల్లా కలెక్టరీలాంటిదే!" అనిపించింది కామాక్షమ్మకి. ఆవిడే ఎవరూ చూడకుండా లోపలికి వెళ్ళిపోయింది 'జిల్లా జడ్జి!'

ఆ మర్నాడే కాశీపతీ, సత్యవతమ్మా వచ్చారు. సత్యవతమ్మ కామాక్షమ్మని కావిలించుకుని, "ఎన్నాళ్లకి కలుసుకున్నాం వదినా!" అని ఆనందబాష్పాలు రాల్చింది. కామాక్షమ్మకి నోరు పెగల్లేదు. ఆనందంచేతే నోరు పెగల్లేదనుకున్నారు అంతా. సోమరాజు సంతోషానికి అంతేలేదు. "ఏమిరా కాశీపతీ" అంటూ మెడమీద చెయ్యివేసి, తోటలో అటునుంచి నుంచి ఇటూ, ఇటునుంచి అటూ పచార్లుచేస్తూ, ఏవేవో కబుర్లు విడిచాడు. సాంబం శేషగిరీ క్లాసు మేట్లూ పాతస్నేహితులేకదా. శ్యామలకూ శకుంతలకూ ప్రథమ పరిచయమే ఐనా, పరమస్నేహమై ఊరుకుంది. శకుంతల పిల్లలూ, శ్యామల పిల్లలూ పుట్టకపూర్వంనుంచీ ఎరుగున్నవాళ్లమల్లే మాటలూ, ఆటలూ ఆరంభించారు. పెద్దలూ, పిన్నలూ అంతావెళ్లి ఆ బంగళాలోనే కూచునే వారు. ఒక్క కామాక్షమ్మే సామాను సర్దుకోవాలంటూ, ఆ కొట్టుపక్కాను లోనే చెఱఉండిపోయేది. ఆ సంగతి ఒక్క సత్యవతే గుర్తిస్తే. ఎవళ్ళ యీడువాళ్లు వాళ్ళతో బాతాఖానీ వేస్తోంటే, తనతో కబుర్లుచెప్పేవాళ్ళు లేరనిపించింది సత్యవతికి. ఆవిడే కామాక్షమ్మదగ్గరికి వెళ్లి చనువుగా, "ఏమిటొదినా ఇక్కడే వుండిపోతా వెప్పుడూను! ఊటీకొచ్చినా సర్దుకోడం తప్పదంటావు! ఎన్నాళ్ళూ ఈ సర్దడం, తెములుచ్చుకురాక!" అంటూ ప్రారంభించింది రిటైర్డ యేడాదైన సేట్టిగారి భార్యకుమల్లేనే మాట్లాడింది సత్యవతి. ఐతేం, కామాక్షమ్మకా కంఠస్వరంలో ఏదో గర్వం కనపడి, "జిల్లాజడ్జి తల్లివాయిరి! ఆమాత్రం ఉండకపోతుందా ఏమిటేమి!" అనుకుంది కామాక్షమ్మ. "రా, యీపాటికి బయటికి. ఇవాళ మీరంతా మా ఇంటే భోజనం" అని అంటూ సత్యవతి కామాక్షమ్మ జబ్బపట్టుకుని ఈడుచుకెళ్ళింది. "ఈవిడ్ని కళ్ళు! జిల్లాకలెక్టరు పెళ్ళానై ఉండకూడదా

మేస్ట్రేటు పెళ్ళాంచేతిలో పిల్లిగా లొంగవలసొచ్చింది నాకు. జిల్లా జడ్జి తల్లివాయిరి మరి! ఈడ్చుకెళ్ళు" అనుకుంటూ కామాక్షమ్మ తప్పనిసరిగా కూడా వెళ్ళింది. తోటలో శకుంతల పిల్లలూ, శ్యామల పిల్లలూ కలిసి ఆడుకుంటున్నారు. శకుంతల కొడుకొకడు శ్యామల కూతురుపక్కని నిలబడి పువ్వులుకోసి ఇస్తున్నాడు. ఆ చిన్న శేషగిరీ, ఆ చిన్న శ్యామలా ఈడూ జోడుగా కనపడ్డారు కామాక్షమ్మకి. 'పెళ్ళిచేస్తే చక్కటి ఉజ్జీ!' అనుకుందావిడ. మరుక్షణంలోనే, 'ఏమిటీ ఈ పిచ్చిఊహ! జిల్లాజడ్జి భార్య తాసిల్దారు పెళ్ళాంతో వియ్యమందుతుందా?' అని నిట్టూర్చింది.

సోమరాజు సెలవూ, సాంబం సెలవూ పూర్తిగాకుండానే, "వెళ్ళిపోదామండీ" అంది కామాక్షమ్మ వాళ్ళు ఆశ్చర్యపోతూ, "ఏం, ఎందుకూ తొందరపడుతున్నావు?" అన్నారు. "వంట్లో బాగుండలేదు" అనేసిందావిడ. ఆ మర్నాడే బయల్దేరి వెళ్ళిపోయారు వాళ్ళంతా. ఇంక వాళ్ళూ, వీళ్ళూ మళ్ళీ కలవటం తటస్థించలేదు.



# అవతారాలు

రంగారామ్ ఎన్నో ఫిలుముల్లో నటించాడు. ఎందరో డైరెక్టర్లూ ప్రొడ్యూసర్లూ అతనికి తెలుసు. వాళ్ళందరికీ తలకాయలున్నా, అవి సరుకు లేని ఉత్తి సొరకాయలే అని అతని అభిప్రాయం.

అతని తెలివి వల్లనో, వాళ్ళ తెలివితక్కువవల్లనో అతనికి ప్రతీ ఫిలుములోనూ ఆదాయపుపన్ను చెల్లించవలసినంత పెద్ద మొత్తాలే ముట్టేయి. సొమ్ము చేరుతున్న కొద్దీ సొంతంగా ఫిల్ములు తియ్యాలనీ, 'ఆదర్శ దర్శకుడు' అనిపించుకోవాలనీ ఆసక్తి కలిగింది.

తెలుగు తమిళాల్లో ఇంతవరకు ఎవడూ తలపెట్టని ధీమతో ఫిలుము తియ్యాలనిపించిం దతనికి. పల్లెటూరి బైతుల్ని మాత్రం ఆకర్షించే అసభ్యపు చెత్తాకారీ ఫిలుములకుమల్లే గాక చదువూ సంస్కృతీ ఉన్నవాళ్ళచే 'శభాష్' అనిపించుకోతగ్గ కథ తీసుకోవాలని ఆలోచించాడు. ఆలోచించి ఆలోచించి, ఏమీ పాలుపోక నిద్రపోయేసరికి కలలో అతగానికి కాంతిపుంజ మొకటి కనపడింది. అది క్రమంగా ఒక ప్రశాంతమైన ముఖంగా మారింది. ఆ ముఖం అతనితో మాట్లాడితే ఏం చెప్పి ఉండేదోగాని, అతనికి మెలకువ వచ్చేసింది. సాయిబాబాదై యుంటుందా? కాదు; ఐనా సాయిబాబా ఫిలుము ఎవరో మొదలెట్టారు. రమణమహర్షా? ఊహూ, హరనాథబాబా యేమో? ఏంతమాత్రం కాదు. మరెవరు?

అతడున్న వీధికి పుదుచ్చేరి బొమ్మలు అమ్మకాని కొచ్చాయి. అమ్మదెచ్చినవాడు గంప దించేసరికి అందులో రంగారామ్‌కి బుద్ధవిగ్రహం ఒకటి కనపడింది. తక్షణమే అతడు తన కలలో కనపడ్డది బుద్ధుడే అని నిశ్చయించుకున్నాడు.

ఆ నెలాఖరుకు వెలువడ్డ సినిమా పత్రికల్లో, రంగారామ్ అనే ఆయన బుద్ధభగవానుడి చరిత్ర ఫిలుముగా తీయదలచినట్లు ప్రకటించబడింది.

బుద్ధుణ్ణి పోలిన నటుడు ఎవరైనా ఉంటే, ఇంటర్వ్యూకి రావలసిందనికూడా ఆ ప్రకటనలో ఉంది.

రంగారామ్‌కు తక్కిన తారాగణమంతా సంకల్పమాత్రంలో సమకూరిందేగాని కథానాయకుడే ఎక్కడా కనపడలేదు. 'ఏమిటి గత్యంతరం?' అని అతడు దిగాలుపడి చూస్తోంటే, ఆ బుద్ధ భగవానుడే పంపించినట్లుగా అతనివద్దకొక మనిషి వచ్చాడు. వాడంతట వాడు రాలేదు; ఎవరో తీసుకొచ్చారు.

రంగారామ్ సంతోషించి, "మీ రేటు ఎంత?" అని అడిగాడు. ఆ 'బుద్ధుడు' ఏదో చెప్పబోతూంటే మధ్యవచ్చిన ప్రబుద్ధుడు వాణ్ణి మాట్లాడనివ్వక అడ్డుతగిలి, 'రంగారామ్‌గారూ, మీకు తెలియనిదేముంది గనక? మరొకచోట పుచ్చుకుంటూన్న రేటు ప్రకారం మీరు ఇప్పించండి!' అనేశాడు.

రంగారామ్, మీరు చెప్పింది న్యాయమే అనుకోండి. కాని ఈయనెవరో ఇంకా ఫీల్డులో కొత్తగదా?' అన్నాడు.

"దానికేం లెండి. మీ చేతిలో నలిగితే మూడునిముషాలలో ముల్లోకాల్లోనూ మించిన నటుడౌతాడు." అన్నాడు, ఆ స్తోత్రం రంగారామ్‌ను గిలిగింతపెట్టింది. ఐతేం, డబ్బు విషయంలో కొంచెం జాగ్రతగా ఉండాలి. ఫిలుం తియ్యటం సామాన్యమా? తన సొమ్ము అంతా నటుల జీతాలకే పెట్టేస్తే తక్కిన ఖర్చుల మాటేమిటి? "అయ్యా. నేను కళాభిరుచితో తీస్తున్నానీ ఫిలుము. తారాగణం, పనివాళ్లూ నాతో సహకారంచేసి, ఏదో కొద్ది జీతాలతో తృప్తిపడాలి. తర్వాత లాభాలొస్తే చూసుకోవచ్చు ప్రస్తుతం ఈయనకి నెలకు వెయ్యిరూపాయిలిస్తాను," అన్నాడు.

ప్రబుద్ధుడు ఏదో అనబోయాడుగాని 'బుద్ధుడు' వప్పేసుకున్నాడు. మధ్యవర్తికి కోపంవచ్చింది వచ్చినట్లు రంగారామ్‌కూడా గ్రహించాడు. "ఈ వేడి చల్లారకుండా 'బుద్ధుడి'చేత కాంట్రాక్టు సంతకం చేయించి పుచ్చుకోవటం మంచిది. లేకపోతే ఈ మధ్యవాడు చెడగొడతాడు" అని తోచి, వెంటనే సంతకం పెట్టించాడు.

ఆ 'బుద్ధుడూ', 'ప్రబుద్ధుడూ' 'మళ్లీ దర్శనం చేస్తామ'ని చెప్పి సెలవుతీసుకొని వెళ్ళిపోవటంతోనే, రంగారామ్ కంట్రాక్టుమీద ఉన్న

చేవ్రాలు యథాలాభంగా చూశాడు. "సుబ్బారాయుడు వ్రాలు" అని ఉంది. సంతకంలో 'రా' లోపించిందని తెలియటంతోనే, 'అయ్యో, ఈ సుబ్బరాయుడు అంతగా చదువుకున్నవాడులా కనపట్టంలేదు తను నటించబోయే భగవానుని జీవితచరిత్ర ఇతడు ఘట్టుఘారం హిస్టరీలోనైనా చదివుండడు' అనీ తెల్లమై ఆతగాడి గుండె గతుక్కుమంది. మధ్యవర్తి లేకుండా చూసి, అతడు 'బుద్ధుణ్ణి' కలుసుకున్నాడు. సుబ్బారాయిను తన గతం అంతా మర్మం లేకుండా చెప్పాడు. "అయ్యా, నేను చదువుకున్న వాణ్ణి కాదు. ఏలూరు హేమావతి మేళంలో ఫిడేలు వాయించి పొట్టపోసుకునే వాణ్ణి. హేమావతిని సినిమావాళ్ళు తన్నుకుపోవటంతోనే ఆ మేళం చెదిరిపోయి, ముఖ్యంగా నేను ఇబ్బందిలో పడిపోయాను. 'నాగతేంగాను?' అంటూ హేమావతికి జాబు వ్రాసినాను. "ఫిలుముల్లోకూడా ఫిడేలు వాయించేవాళ్లు కావలసిఉంటారు. ఇక్కడకు రా" అని జవాబు వ్రాయించింది. నా వాయిద్యం ఇక్కడ ఎవళ్లకీ నచ్చలేదు. 'రైలు టిక్కెట్టుకి హేమావతినే యాచించి తిరుగుదారి పడదాం' అనుకుంటూంటే, రోడ్డుమీద ఎవరో ఒకాయన నాకు ఎదురై ఎగాదిగా పరికించటం మొదలెట్టాడు. 'ఏమిటి బాబూ? అలా చూస్తున్నారు?' అని నేను అడిగేసరికి, 'నువ్వు సినిమాలో యాక్టుచేద్దువుగాని, నాతోరా, అంటూ మీ వద్దకు తీసుకొచ్చాడు... మీరు ఇస్తానన్న జీతానికి నేను వప్పుకున్నందుకు నన్ను చాలా మెచ్చుకున్నాడు. ప్రతీనెలా ఈ వెయ్యి రూపాయిల్లోనూ నేను వాడికి కొంత ఇవ్వవలసుంటుందట! నిజమేనా బాబూ?" అన్నాడు.'సుబ్బారాయుడు'

'ఆదర్శ దర్శకుడు' రంగారావుకి ఏం చెయ్యాలో తోచిందిగాదు. జ్ఞానదేవుడైన బుద్ధభగవానుని భూమికను ఈ అజ్ఞాననిధికా ఇవ్వటం? కాని గత్యంతరం యేమిటి? వీణ్ణి కాస్తా జారవిడిస్తే అలాంటి ముఖం మళ్ళీ దొరకదు. కవిగారితో చెప్పి, ఇతగాడికి సాధ్యమైనంతవరకూ డైలాగులు లేకుండాచేస్తే సరి! కాని కథానాయకుడాయె! నోరు విప్పనివ్వకుండా ముఖం చూపించి ఊరుకోడానికి వీలా? ఏదో తంటాలు పడాలి! ఆదర్శంగా ఫిలుము తీద్దామనుకుంటే గొప్ప చిక్కే వచ్చింది! ప్రథమ కబళంలోనే మక్షికాపాతం!...ఐతేం, ఒకందుకు తృప్తిగాఉంది రంగారావుకి. సుబ్బారాయుడు బుద్ధుడికిమల్లేనే కనపట్టమేకాకుండా, బుద్ధుడికి మల్లేనే మర్మం ఆడంబరంలేని మనిషి. ఉన్న దున్నట్టుగా చెప్పేశాడు. సాత్వికుడు

ఎక్కడికి కక్కడికే తృప్తిపడాలి మరి: అన్ని గుణాలూ ఒక మనిషిలో పట్టమంటే పడతాయా?

కాని సుబ్బారాయుడికి తర్ఫీజు ఇవ్వటంలో రంగారావ్ యేమీ శ్రమపడవలసిన అవసరం లేకపోయింది. ఏమంటే అసలు తర్ఫీజు ఇవ్వటం దాకా రానేలేదు. రంగారావ్‌కి ఆర్థికంగా సహాయం చేస్తానని ఆసెలో వాక్సహాయం చేసిన వాళ్ళెవ్వరూ ఈ ఆపర్స పర్చుకుని తమర్ని తమకి ఏ గోతిలో దింపుతాడో అన్న అనుమానంతో తమ కూడాయిల సంచుల్ని బయటకు తియ్యలేదు. రంగారావ్ సొంతసొమ్ము కారాగణం, ప్రముఖ గణాల మొదటి నెల జీతాలకి సరిపోయింది. అతగాడు ధనాన్వేషణలో నిమగ్నుడై, రైలు ప్రయాణాలు చేస్తుంటే వాళ్ళందరూ ఎవరి దారివాళ్ళు చూసుకోటం మొదలెట్టారు.

మరో అలజడికూడా బయల్దేరింది. భారతదేశంలో ఇందు; సింహళంలో అక్కడివాళ్ళకెలా ఉప్పు అందుతుందో గాని 'తమ' బుద్ధభగవానుని చరిత్రను ఇండియాలో ఫిలుము తీస్తున్నారని తెలిసింది. ఫిలుముతీస్తే తమ మతం అపవిత్రం ఐపోతుందని వారు మహాజర్లు పంపారు. దానితో కవిగారికి కూడా ఆశవదిలిపోయి, 'బుద్ధం శరణం గచ్ఛామి' అనటం మానేశారు. ఎవరో "పేదరాసి పెద్దమ్మ" శరణుజొచ్చాడు.

సుబ్బారాయుడు ఏమైనదీ తెలీదు. అతగాణ్ణి రంగారావ్ వద్దకు మొగటు తీసుకు వెళ్లిన ఆ మధ్యవర్తి మాత్రం అతడికోసం కొన్నాళ్ళు వృథాగా వెతికాడు.

ఒక పుష్కరం గడిచింది. రంగారావ్ ఏ ఫిలుమూ తియ్యలేక పోయినా అనుభవం మాత్రం పుష్కలంగా గడించాడు. 'చింత చచ్చినా పులుపు చావద'న్నట్లు ఫిలుం తియ్యాలన్న సరదా అలాగే ఉండిపోయిందతనిలో. తనచేత ఫిల్ము తీయించమని, వెళ్ళి వెంకునాయుణ్ణి ఆశ్రయించాడు.

"తీయిస్తాను గాని, బుద్ధుడూ, సిద్ధుడూ అంటే భక్తాలు కిట్టవు! డాన్సులూ, హాస్యం. ఎక్కువగా పెట్టి తియ్యాలి! మడిగట్టుకున్నట్టుకాకుండా పచ్చిపచ్చిగా, దోరదోరగా శృంగారం పెట్టాలి! అధమం ఒక బలీ, ఒకక్లో

ఇద్దర్లో విలన్లు ఉండాలి, కథా విషాదంగాకంటే సుఖంగా అంతమవాలి. ఏదోసందర్భంలో మహాత్మగాంధీ సిద్ధాంతాలు తీసుకురావాలి !" అన్నాడు వెంకునాయుడు.

'అలాగే' అని రంగరామ్ తారాగణాన్ని సేకరించటం మొదలెట్టాడు. ఇదివరకు కథ తయారుచేయించి, పిమ్మట నటీనటులకోసం వెతికేడు.

"మొదట తారలను చూడు 'బుక్' ఐనవాళ్ల సామర్థ్యాలనుబట్టి కథ అల్లవచ్చు. హీరోయిను పాత్రకు మా విమ్యలత ఉంది. తక్కినవిలనూ వగైరాలను చూడు" అన్నాడు వెంకునాయుడు. 'సరే' అని రంగారామ్ యాక్టర్లను ఇంటర్వ్యూకి పిలిపించాడు.

ఇంటర్వ్యూకి వచ్చిన విలనులందరిలోకి ఒకడి ముఖమే రంగరామ్‌కి నచ్చింది, "మిస్టర్, మిమ్మల్ని 'బుక్' చేస్తున్నాను. నెలకు ఐదువందలు జీతానికి వప్పుకున్నట్లైతే ఇప్పుడే కంట్రాక్టు సంతకం పెట్టవచ్చు" అన్నాడు.

ఆ 'విలను' "సంతకానికేం పెడతాను, కాని నాదొక్క మనవి" అన్నాడు.

"ఏమిటి ?"

"నా రేటు సగానికి సగం తగ్గించేశారు !"

"అంటే ?"

"పన్నెండు సంవత్సరాల క్రితం మీరే నన్ను బుద్ధుడిపాత్ర నటించటానికి వెయ్యిరూపాయల చొప్పున బుక్ చేసుకున్నారు"

రంగారామ్ నిర్ఘాంతపోయాడు. "ఆ సుబ్బారాయుడివేనా నువ్వు?"

"ఔను సార్."

"నేను నమ్మలేకుండా వున్నాను! ఆనాటి నీ ముఖం ఇంకా నా కళ్లకు కట్టినట్లుంది. అది ప్రశాంతమైన ముఖం. ఆ చూపుతీరే వేరు. ఆ విగ్రహమే వేరు. చూసినప్పుడే 'నీకు ప్రణమిల్లాలి' అనిపించేటట్లుండేది. ఇప్పుడో నిన్ను పోల్చుకోటానికే వీలులేకపోతోంది. ఈ నల్లబడిపోయిన ముఖం, ఈ లోతు కళ్ళూ......"

సుబ్బారాయుడు నవ్వాడు. "డైరెక్టరుగారూ, మీకు సందేహం అక్కర్లేదు. నేనే అతణ్ణి. అవతారం మారిపోయిందంతే. అప్పుడు బుద్ధావ

తాం. ఇప్పుడు గుప్తావతారంలో ఉన్నా... చాలా కథ ఉందిలెండి సావకాశంగా మరొకమాటు చెబుతాను. మీరు అప్పుడు ఇచ్చిన ఆ వెయ్యిరూపాయలనూ పసిగట్టి, బెల్లంమిఠాయిమీద మూగే ఈగలమల్లే నా చుట్టూ స్నేహకోటి చేరింది. త్రాగుడు, జూదం, ఇంకొకటి_ ఇలాంటి విద్యలన్నీ నేర్పటంలో నా కొక్కొక్కరూ ఆచార్యత్వం వహించి, గురుదక్షిణక్రింద ఆ సొమ్ము ఖర్చుచేయించారు. మళ్ళీ నెలజీతం వస్తోందికదా అనుకునేసరికి ఆ ఆశ లేకుండా ఏంజరిగిందో మీకే తెలుసు. ఆ తరవాత, సొమ్ముకోసం నేనెన్ని పాట్లుపడ్డదీ ఆ భగవంతుడికి తెలుసు. అన్నీ కాకపోయినా కొన్ని పాట్లు పోలీసువాళ్ళకి తెలుసు. చాలాసార్లు తప్పించుకుంటూ వచ్చానుగాని కాలం ఎప్పుడూ ఒకేలాగ వెళుతుందా? ఒకమాటు పట్టుబడ్డాను. జైలు జీవితం గడిపాను. పాత అఫెండరుగా వాళ్ళ లిస్టులో చేరిపోయినాను. నా నేరాలమాట అటుంచి, ఎవరు నేరం చేసినా పోలీసులదృష్టి నామీదే పడుతోంది. కనుక ఇంక బుద్ధిమంతుణ్ణవక తప్పదు. ఏందారి అని ఆలోచిస్తోంటే మీ ప్రకటన పడింది. ఇదివరకు బుద్ధిపాట్లు నటించవలసిన సందర్భంలో మీకు ఎటువంటి శ్రమ ఇచ్చేవాణ్ణో చెప్పలేనుగాని, ఇప్పుడు మీరు నాకు ఇవ్వబోయే విలను పాత్రలోమట్టుకు ఏ శ్రమా ఇవ్వనని ఘంటాపథంగా చెప్పగలను! ఏ సన్నివేశమైనా అవలీలగా అర్థంచేసుకుని, చూసేవాళ్ళ రక్తం గడ్డకట్టుకుపోయేటట్లు నిర్వహిస్తాను... చెప్పవచ్చేదేమిటంటే, నాకు ఇప్పుడు కూడా ఆ వెయ్యిరూపాయల చొప్పున ఇప్పించండి."

"మిస్టర్ సుబ్బారాయుడూ, వెంకన్నాయుడుగారితో సంప్రదిస్తేగాని చెప్పలేను. ఐదు వందలకే నాకు అధికారం ఉంది."

"వారితో మాట్లాడే చెయ్యండి. రేపు మళ్ళీవచ్చి తమ దర్శనం చేస్తాను" అని, సుబ్బరాయుడు లేచాడు. ఒకటి రెండు అడుగులు వేసి, తిరిగొచ్చి రంగారామ్‌తో, "ప్రస్తుతం కొంచెం ఇబ్బందిలో ఉన్నాను, ఒక్క టెన్ రూపీస్ ఇవ్వండి, లెక్కల్లో మినహాయించుకుందురుగాని" అని, పుచ్చుకుని వెళ్ళిపోయాడు.



# కష్టార్జితం

సత్యవతి భూదేవిలాంటిది. ఐతేం? ఎంత ఓర్మిగలవాళ్ళైనా, సాధింపు హద్దుమీరినప్పుడు "చుర్రు"మనక మానరు. శిలలాంటి సాధుజంతువుకూడా అదేపనిగా తరుముకెడితే, పరుగెత్తుతోన్నదల్లా తటాలున వెనక్కి తిరిగి మీదపడి బరుకుతుంది. ఆనాడు సత్యవతికూడా అలాగేచేసింది.

అంటే బరికిందనికాదు. అంత ధైర్యమేది ఆ పిల్లకి? అత్తగారిమాటకి సమాధానం చెప్పింది. అంతే చెప్పి, తర్వాత పశ్చాత్తాపపడింది.

'అక్కడ కూచున్నావు. ఇక్కడ నిలబడ్డావు. ఆ పని చేశావు. ఈ పని చేశావు కాదు.' ఇలాంటి మామూలు సాధింపు కాదు, కల్పకమ్మగారిది. కోడలు నలుపని కాదు; పనిపాటలు చేతగానిదని గాదు; చదువు సంధ్యలు లేనిదనీ గాదు ఆవిడ అసంతృప్తి. సత్యవతిది సువర్ణచ్ఛాయ, పుట్టింట ఆటపాటలే గాని పనిపాటలు నేర్చుకోనిమాట నిజమే. ఐతేం, అత్తింట అడుగుపెట్టిననాటినుంచే పనిలో శ్రద్ధచూపింది. ఆమాటకొస్తే, అత్తింట కూడా ఆమెకు పనేలేదని చెప్పాలి. ఆమెకేగాదు కల్పకమ్మగారికే లేదు. ఏమంటే సంపన్నులు వాళ్ళు. రాఘవయ్యగారు ప్లీడరిలో రెండు చేతులా ఆర్జిస్తున్నారు. పిత్రార్జితమే యాభై యకరాల పల్లముంది వారికి. తోటలున్నాయింకా. కల్పకమ్మ దర్జా కనపర్చాలన్న తరహాలో మనిషి గనక సీతన్నను వంటకు పెట్టింది. సీతన్న గాక తోటవాడున్నాడు. దాసీమనిషి మాట చెప్పనక్కర్లేదు. అందుచేత ఆవిడకి గాని సత్యవతికి గాని ఆ యింట్లో చెప్పతగ్గ పనేలేదు. ఐతే ఇంక కల్పకమ్మగారు ఎందుకూ కోడల్ని సలపటం?

కల్పకమ్మ కాపరానికొచ్చినప్పట్నుంచీకూడా, 'నాకు కొడుకులే పుట్టాలి' అని బ్రహ్మని కోరుకుంది. ఆమెకు జడిసో, మరెందుచేతనో గాని బ్రహ్మదేవుడు ఆమెకు కుమారుణ్ణే ప్రసాదించాడు. ఆ పిల్లవాడికి మోహనరావని పేరెట్టుకుందావిడ. మోహనుడు ఎదిగి వస్సుచేసినకొద్దీ అందగాడై

పేరుకు తగ్గావాసనిపించుకున్నాడు చదువులో అంతపెద్ద లెక్కలోకి రాకపోయినా యేటేటా ప్యాసవుతూ వచ్చాడు. ఐశ్వర్యంతోబాటు చదువు కూడా ఉంటేనే మంచి కట్నంతో పెళ్లికూతురు వస్తుందని కల్పకమ్మగారు మొదటినుంచీ ప్లాను వేసి, ప్రయివేటు చెప్పించి, అతను ఫెయిలవకుండా చూసింది.

మోహనుడు స్కూలు ఫైనలు చదువుతూనప్పట్నుంచి పెళ్ళి సంబంధాలొచ్చేవి. వాళ్ళు ఇస్తామన్న కట్నంకానుకల జాబితా వినేసి, తనకి చాలా తక్కువని తోచి, 'మావాడింకా పెళ్లిచేసుకోనంటున్నాడ'ని చెప్పి పంపేది. ఆవిడ అభిప్రాయం ఏమిటో ఈ విధంగా ఏ కన్యాప్రదాతకీ అంతుచిక్కలేదు. మోహనుడు ఇంటరులోకి వచ్చాడు. బి. ఏ. లోకి వచ్చాడు సంబంధాలు వస్తూనే ఉన్నాయి. ఒకళ్లకన్న ఒకళ్లు క్రమంగా హెచ్చుకట్నం ఇస్తామనే అన్నారు. ఐనా ఆవిడ అనుకున్న స్థాయికి వాళ్ళు రాలేదు. అంచేత, 'మోహనుడింకా పెళ్లికిష్టపడడు.'

ఆ ఊళ్ళోనే అంటే నెల్లూరులో భానోజీరావుగారు జడ్జీ. ఆ జడ్జీగారికొకనాడు పెద్దాపురంనుంచి ఒక జాబు వచ్చింది. 'మీ ఊళ్ళో పెళ్ళికొడుకులెవరైనా ఉన్నారా!' అని వాకబుచేస్తూ, బాల్యస్నేహితుడు పురుషోత్తం రాశాడు. జడ్జి సమాధానంలో రాఘవయ్యగారి కొడుకుమాట రాస్తూ, 'కట్నం విషయంలో నీ కందుబాటులో ఉండదేమో మరి' అని చేర్చేరు. ఈ జవాబు అందటంతోనే పురుషోత్తం స్వయంగా బయల్దేరివచ్చి చాటుగా పెళ్ళికొడుకుని చూచి తృప్తిపడి, జడ్జీగారితో, 'భానోజీరావ్, ఈ సంబంధం నువ్వెలాగైనా మాకు నిశ్చయం చేసిపెట్టాలి' అని పట్టుబట్టాడు. 'మూడువేలదాకా ఇస్తామంటూ వచ్చినవాళ్ళనికూడా పంపేశారట!' అన్నాడాయన. 'ఎంతైనా ఇస్తాను. పిల్ల సుఖపడుతుంది. నీకు పుణ్యముంటుంది. కుదర్చిపెట్టు' అని పురుషోత్తం బ్రతిమాలాడు. భానోజీరావుగారికి ఆశ్చర్యం వేసింది. పురుషోత్తం ఆయనెరుగున్నంతవట్టుకి అట్టే ఆస్తిపరుడుకాడు. 'ఎంతైనా ఇస్తానంటున్నారు. దగిమిలాను బాగా సంపాదించాడన్నమాట' అనుకున్నాడు. రాఘవయ్యగారితో ఆయనా కల్పకమ్మగారితో ఆయన భార్యా పురుషోత్తం కూతురుమాట చెప్పారు. పెళ్లికూతురు ఫోటో చూపించారు. వాళ్లకి సత్యవతి నచ్చిందనటంతోనే, "మీ అభిప్రాయం యేమిటో చెప్పండి" అన్నారు. 'అభిప్రాయానికేముంది

లెండి; మేం అడుగుతామా ఏమిటి? వారు ఇష్టపడ్డంత. వారి సరదాకొద్దీ ఇవ్వటమే. ఇంతకీ మాకు కట్నంగావాలన్న పట్టుపట్టలేదు. కాని పుచ్చుకోకుండా చేసుకుంటే పిల్లవాడికేదో లోపం ఉండి, అయిందే చాలని చేసుకున్నామేమో అని లోకులు అనుకుంటారు. అందుకోసంగాని...' అని ఆరంభించారు. ఆ తరవాత 'వారింత ఇస్తామన్నారు' 'వీరింత ఇస్తామన్నారు' అని చేర్చేరు. 'ఔను. వింటూనే ఉన్నాను. మీకెంత కావాలో చెప్పెయ్యండి సెటిల్ చేయిస్తాను' అన్నారు జడ్జీగారు. జడ్జీదంపతులు స్వయంగా వచ్చి మొహమాటం పెట్టుతుంటే వల్ల. 'మీరే చెప్పండి. ఏమిస్తారో?' అని నళ్ళీ అని తప్పుకోటానికి మగపెళ్లివారికి వీల్లేకపోయింది. రాఘవయ్యగారు భార్యకేసి చూశారు. కల్పకమ్మగారు చెప్పేసింది. ఐదువేలు కట్నం తతిమ్మా ఏవేవో లాంఛనాలూను. పురుషోత్తం, 'ఇస్తాను' అన్నాడు. 'కొంచెం తగ్గండి' అని ప్రాధేయపడతా డనుకుంటూంటే పురుషోత్తం ఇలా ఒప్పేసుకోడం జడ్జీ దంపతులకి ఆశ్చర్యం వేసింది. రాఘవయ్య దంపతులకి 'తక్కువగా అడిగేశామన్నమాట' తొందరపడ్డాం! అని విచారం వేసింది.

దరిమిలాన సత్యవతీ - మోహనులకి పెళ్లి అయింది. పురుషోత్తం అనుకున్న ప్రకారం, కట్నమూ కానుకలూ ఇచ్చేశాడు. అసలింకేవో ఇంకా జరగలేదని పేచీలొచ్చాయి పెళ్లిలో. "ఆడపెళ్లివారితరఫున పెళ్లికివచ్చిన ముత్తయిదువ ఎవరో, వంగినవాడ్ది వంచుతోంది ఈ వియ్యపురాలు!" అంది, ఆమాట కల్పకమ్మ చెవినిపడి, పెద్ద రభస జరిగింది. "ఒక్కగాని ఒక్క కొడుకు. నా ముచ్చటలన్నీ తీర్చద్దా?" అంటూ ఆమె నాగవల్లినాడు భోజనాలు లేకుండానే రైలెక్కించింది తనవాళ్ళని. "సత్యవతికూడా ఒక్కగాని ఒక్క కూతురే మాకు. ఈవిడ మాకు తీర్చిన ముచ్చటలేమిటి మహా!" అంది పిల్లతల్లి "ఊరుకో" అన్నాడు పురుషోత్తం.

క్రమంగా సర్దుకుంటూ వున్నాడు పురుషోత్తం. సర్దుకునేవేగాని, కల్పకమ్మగారికి తన వియ్యంకుడి రహస్యం తెలిసి అతడు చేసిన త్యాగానికి మెచ్చుకోటానికి బదులు ఆమెకు ఆగ్రహం ఎక్కువైంది. పురుషోత్తానికి అంతాకలిపి పుట్టెడు భూమికన్న ఎక్కువలేదు. అందులో ఆరెకరాల ఖండం తొమ్మిదివేలకు అమ్మేసి, ఐదువేలు కట్నంక్రిందా ఖర్చుపెట్టాడు. ఆయన అనుకున్నదేమిటంటే, సత్యవతి ఒక్కత్తే కూతురు. దానికి మంచి

సంబంధంచూసి పెళ్ళిచేసే ఇంక తనూ తన భార్యేగా ? తన సంపాదనతో కాలం గడిచిపోతుంది. ఉన్న భూమి అమ్మేస్తేమాత్రమేం, గొప్ప సంబంధం వచ్చినప్పుడు ? ఈ ఉద్దేశంతో అతడు సాహసించాడు. కల్పకమ్మగారు, "వీళ్ళు సామాన్యులు, మేం అడిగినదంతా ఇస్తామని వప్పుకోటంలో ఎవరో గొప్పవాళ్ళనుకుని మోసపోయాం. మాకు ద్రోహంచేశారు" అనుకోడం మొదలెట్టింది.

దీనికితోడు మరో మూణ్ణెల్లకి మోహనుడి క్లాసుమేటు కాశీపతికి పెళ్ళి అయింది. కాశీపతి మోహనరావుకన్న ఓచాయ తక్కువ రాఘవయ్యగారి ఆస్తికన్నా వాళ్ళది ఏమాత్రమో తక్కువే. ఐనా కాశీపతికి ఎక్కువ కట్నం వచ్చింది. ఆడపెళ్ళివా రెవరో జమీందార్లట. అమాంబాపతులు పదివేలదాకా ముట్టజెప్పారు. అక్కడితో ఆగిందా ! వాళ్ళది సుయ్యా, కాశీపతిది చేదాను ! కల్పకమ్మకి మహా దుగ్ధగా ఉంది. 'ఏంకొంప మునిగిపోయిందని నేనిలా తొందరపడ్డాం ! ఆ జడ్జీగారిమూలాన ఇలా బోల్తాపడిపోయాను. మనవాడికి పెళ్ళి అయిపోయిందని తెలిసి కాశీపతిని చూసుకున్నారుగాని, లేకపోతే ఆ జమీందార్లు మనగుమ్మం ఎక్కవలిసిన వాళ్ళేగా ! కళ్ళు మూసుకుని గోతులో పడిపోయాను !"

పురుషోత్తం మరొక్క యకరం అమ్మేసి కల్పకమ్మ దర్జాకి లోపం రాకుండా ఉండేఫక్కీలోనే సారెపెట్టి సత్యవతిని అత్తింటికి పంపాడు. కాని కాశీపతి పెళ్ళాం దానికి రెట్టింపు సారె తెచ్చింది. దాన్ని తల్చుకొంటూ కల్పకమ్మ 'ఎండుగులవారు ఎండుగుల ఎండబెట్టుకుంటే ఎలుక తోక ఎండ బెట్టుకుందిట ! చూశాండీ మా వియ్యాలారు పెట్టారు సారె !' అని గుమ్మంలోకి వచ్చినావిడతో అనేసింది. ఆ వచ్చినావిడ, 'వారిది సుయ్యి, మీది చేదాను ! అప్పుడే ఏమయిందిలెండి' అన్నది. కల్పకమ్మ 'ఆ సుయ్యి పెళ్ళినాడే ఎండిందమ్మా' అంటూ, తనకు జరిగిన 'మోసం' 'ద్రోహం' వెళ్ళబోసుకుని కంటతడిదాకా తెచ్చుకుంది.

సత్యవతికి అత్తింట పరేకష్టంలేదు. కాని మనస్సు సున్నితమైన పిల్లలకి ఆమాత్రంచాలు మథనపడ్డానికి. 'మా నాన్న ఎంత తెలివితక్కువ పని చేశాడు ! నాకోసం చూసిన సంబంధాలలో పుట్టెడుభూమి ఉన్నవాళ్లెందరో ఉన్నారు. ముందు ముందు ఈయన పుట్టెడు భూమికూడా తనకే

వస్తుందిగదా అన్న ఆశకొద్దీ వాళ్లంతా చేరి కట్నమడక్కుండా ఈ సంబంధం నిశ్చయం చేసుకోటానికి ప్రయత్నించారు నాన్న వాళ్ళని కాదని ఈ జమీందారీ సంబంధానికి ఎగబాకి భంగపడ్డాడు. భూమి అంతా నాకోసం తెగనమ్మి, గొక్కుడితేనేగాని దొరక్కుండదనే స్థితిలోకి తెచ్చుకున్నాడు. ఇదంతా 'మోసం' 'గ్రహించకుండ జరిగిపోయింది పెళ్ళికి.»

కాశీపతి ఆనాడు మోహనుడికోసం వచ్చాడు. ప్లేజరు సూటూ, బంగారుపు రిస్టువాచీ వగైరాలన్నీ అతగాడికి వన్నె తెచ్చాయి. అవన్నీ 'అత్తగారి సొత్తే' అని కల్పకమ్మ ఊహించుకుని గట్టిగా ప్రారంభించింది. ఇరుగావిడకో పొరుగావిడకో ఆ సాధింపు వినటానికీ, మధ్యమధ్య ఓ పుల్ల వెయ్యటానికీ ఎదురుగా వున్న దేమోఅంటే ఎవరూ లేరు. సత్యవతి ఒక్కతే ఆ గొణుగు వింటూంది. వినాలనేగా ఆవిడ అంటూన్నదీని! కొంతసేపటికి కాశీపతితో మోహనుడు బయటకు వెళ్లిపోయాడు. ఇంక అత్తగారి గొణుగు ఆగుతుందనుకుంది సత్యవతి. కాని స్థాయి ఎక్కువైంది. 'నిర్భాగ్యుల్ని ఎవరు బాగుచెయ్యగలరు? నిక్షేపంలాంటి సంబంధం బారెడు దూరంలో ఉందని తెలుసుకోలేక తొందరపడి గోతిలో పడ్డాను' అంది కల్పకమ్మ.

సత్యవతికి తానేం చేస్తూన్నదీ పొల్లు తెలియలేదు. చరచరా అత్త గారి ఎదటకొచ్చి, 'ఎన్నాళ్లీ అసంతృప్తి? అలాంటి నిక్షేపపు సంబంధ మేదైనా ఇంకొకటి ఉందేమో చూడండి!' అంది. భూదేవే కంపించింది! కల్పకమ్మ కూలపడింది. కాని ఇట్టే సర్దుకుని, కళ్ళనిప్పులు రాలుస్తూ, "ఏమిటీ అన్నావు? మరొక సంబంధం చూడనా? నేను తలుచుకుంటే చూడలేననేనా? ఒకటి కాదు పది పెళ్లిళ్లు చెయ్యగలను నా కొడుక్కి. ఏమనుకుంటున్నావో? 'మన అదృష్టంకొద్దీ ఈ పంచను చేరుకోగలిగేం' అని సంతోషిస్తూ ఊరుకోక నన్నే ఎదిరిస్తావా? కఫడ్దార్. ఏమనుకున్నావో!» అని ఉరిమింది. వంటచేస్తూన్న సీతన్న 'ఏమిటి చెప్మా?' అనుకుంటూ అక్కడికొచ్చాడు. సత్యవతి గదిలోకి పరుగెత్తి, పరుపుమీద పడి వెక్కి వెక్కి యేడ్చింది

ఆరాత్రి సత్యవతి భోజనం చెయ్యలేదు. మోహనుడికి కారణం తెలియలేదు కాని, అలా ఉన్నావేం?' అని అడిగాడు. ఆపిల్ల, వెక్కి వెక్కి ఏడిచింది మళ్ళీ అతడు ఆశ్చర్యపోతూ, 'ఏమిటే!' అన్నాడు. ఆమె దుఃఖం

అప్పుకుంటూ, "ఏమండీ, మీ అమ్మ మీకుగాని మళ్ళీ పెళ్లి చేస్తానంటే మీరు ఒప్పుకోరుకదా?" అంది. అతడు నిర్ఘాంతపోయి, ఆమెను తన కౌగిలిలోకి తీసుకుని ప్రేమతో, 'ఏమిటే ఈ నా స్వప్నం?' అన్నాడు. ఆమె మరి మాట్లాడలేదు. తనకింక భయంలేనట్టుగా అలాగే నిద్రపోయింది.

ఆ మర్నాడు సీతన్న కంటికిరాలేదు. అతనిస్థానే అతనితల్లి గవరమ్మ గారొచ్చింది. 'ఏమమ్మా, నువ్వొచ్చావు?' అంది కల్పకమ్మగారు.

'మా సీతయ్య అత్తవారింటికెళ్ళాడండి. రేపు సాయంత్రాని కొచ్చేస్తాడు.'

'ఏం. ఎందుకు? కోడల్ని పుట్టింటికి పంపించాడా?'

'లేదండి. కోడల్ని తీసుకురావటానికే వెళ్ళాడు.'

ఆ మాట వినేసరికి కల్పకమ్మకి, లోపల గదిలో ఉండి వింటూన్న సత్యవతికీకూడా ఆశ్చర్యం వేసింది. కల్పకమ్మగారు, 'తీసుకురావటానికంటా వేమిటి? మొన్ననేగా మీ కాశమ్మ మాయింటికొచ్చి వెళ్లింది!'

'నిజమేనండి. నాఖర్మకొద్దీ నాకూ దానికీ తగువొచ్చింది. ఏమీలేదు అది ఒక పౌడరుడబ్బా కొంది. అది నిన్న నా కంటపడింది. 'బోలెడు డబ్బోసి మనకెందుకే ఈ పౌడర్లు?' అన్నాను. పెద్దదాన్ని అంటే అన్నానని ఊరుకోవచ్చా? 'మధ్య నీ బోడిపెత్తనమేమిటి? నా ఇష్టం!' అని చెంపమీద కొట్టినట్లు చెప్పింది. చెట్టంతమనిషిని నన్నిలాగ అందీ అంటూంతో నాకు 'చర్రు'మని, నేను దానిజుట్టు కాస్త పట్టుకొన్నమాట నిజమే అనుకోండి. ఏతేం, పడుచుదేమో అది ఒక్కతోపు తోసేసరికి వెలకితలా పడిపోయాను. సరిగ్గా ఆ సమయానికి మా సీతన్న రావటం, చూడటం జరిగి, నేను 'వొద్దురా' అని అడ్డపడ్డా వినక దాన్ని రెండు వేశాడు. అంతే. ఈవేళ తెల్లవారి చూసుకున్నాం, కాశమ్మ ఇంట్లోలేదు. పుట్టింటికే పోయుంటుంది లెండి.'

సత్యవతి అంతా వింటూనేవుంది. కాశమ్మకి తనే ఆ పౌడరుడబ్బా ఇ స్త! 'చిలిపితనంకాకపోతే కొన్నానని చెప్పటమేమిటి వెర్రిపిల్ల! పని వేగా ముప్పుతెచ్చుకుంది కాశమ్మ' అనుకుంది. ఇంతలో కల్పకమ్మ మాటలు వినపడ్డాయి.

'అంచేత నీ కొడుకు దానికోసం వెనకాలే పరుగెత్తాడన్నమాట! అందుకే దానికి లోకువై ఆడింది ఆటా, పాడింది పాటా చేస్తోంది. కొన్నాళ్లూరుకుంటే రోగం చప్పగా కుదిరి వాళ్ళే తీసుకొచ్చి దిగబెడూతురుగా?'

'దిగబెట్టరమ్మా. అలాంటి రకంగాదు వాళ్ళు. మా వియ్యపరాలు దీనికి మద్దత్తుగనకనే ఇది ఇలా వేపుగుతింటోంది మమ్మల్ని.'

"అలాగా, నీకు చేతగాదన్నమాట. 'దిగబెట్టటం' అని వాళ్లు అన్నారూ అంటే, ఆ మర్నాడే మరొక త్తెనుచూసి నీ కొడుక్కి పెళ్లిచేస్తే సరి. దానితో పిల్లరోగం తల్లిరోగంకూడా చప్పగా కుదురుతుంది!" అంది కల్పకమ్మ.

సత్యవతి వళ్ళు ఝల్లుమంది! ఎంత ఘోరంగా చెబుతోంది సలహా! 'స్త్రీకి శత్రువు స్త్రీయే' అంటే ఇదే కామోను!...గవరమ్మ సమాధానం వినబడుతోంది. "అమ్మా, కల్పకమ్మగారూ, మీరు చెప్పినది సబబుగానే ఉందిగాని, మావాడికి మళ్ళీ పెళ్లిచెయ్యాలీ అంటే అంత పైపైనఉందా? మీ యింటా మీ యింటా నౌఖరీచేసి కూడబెట్టిన తొమ్మిదివందల రూపాయిలూ పట్టుకెళ్లి ఆ బ్రహ్మయ్య చేతిలో పోస్తేనేకానీ ఈ పెళ్ళి అయింది కాదు. 'మళ్ళీ పెళ్ళి' అంటే డబ్బేది?"

సత్యవతి వింటూ మనస్సులో, 'కాశమ్మ కాపరానికి పరవాలేదన్న మాట. ఆ పిల్ల వీళ్లకి కష్టార్జితం గనక వదులుకోలేరు' అనుకుంది. కాశమ్మకు సాగినట్టు కనకమాత్రం సాగదు. తన అత్తగారికి డబ్బున్నది. తలచుకుంటే ఎంత పనిఐనా చెయ్యగలదు. కక్కినకూటికి వడిపట్టి, పిల్లమీద పిల్లన్ని ఇచ్చేవాళ్లూ ఉన్నారు. ఎందుకైనా మంచిది. తను జాగ్రత్తగానే ఉండాలి' అనుకుంది.



# మారిపోయిన పిల్లాడు

'ఇదుగోనమ్మా నీపిల్లాడు' అని, నర్సు అందిచ్చినప్పుడే అన్నపూర్ణకి అనుమానం తట్టింది 'మారిపోలేదుగదా! ఆస్పత్రిలో అలాటి ప్రమాదం జరగటానికి అవకాశం చాలా ఉంది. ఒకళ్ళూ ఇద్దరూనా, పందలకొద్ది శిశువులాయిరి! నీళ్ళుపోసి తీసుకొచ్చి తల్లులకు అందివ్వటంలో ఒకళ్ళకొకళ్ళు తారుమారైపోవచ్చు.'

అన్నపూర్ణకి ఇది ఐదో పురుడు మొదటి రెండు పురుళ్ళు పుట్టింట పోసుకుంది. మూడో పురటికి తల్లిని సాయం రప్పించుకుంది. నాలుగోమాటుకి తల్లిపోవటం, మేనత్తను బ్రతిమాలటం జరిగింది. ఈమాటు ఎవర్ని బ్రతిమాలినా రాక, ఆమె ఆస్పత్రిలో పోసుకోవలసొచ్చింది. ఆస్పత్రిఅంటే ఆవిడకి ఎందుచేతనో మొదట్నుంచీ ఇష్టంలేదు' లేనట్టుగానే, పిల్లాడు మారిపోయాడన్న అనుమానం తగిలింది.

'అనుమానమేమిటి? నిజంగానే మారిపోయాడు! నా పిల్లలంతా మామిడిపండులా పచ్చగా ఉంటారు. ఏదీ ఆఛాయ వీడికి?' అనుకుందామె పురిటి మంచంమీదే కూర్చున్న మూడేళ్ళ ఎడపిల్లవాణ్ణీ ఆ మూడురోజుల పసిపిల్లాణ్ణీ పోల్చి చూసిందోమాటు. ఆవిడ అనుమానం ధృఢపడింది. తన పిల్లలముక్కులన్నీ కోసుదేరి ఉంటాయి. ఆ తండ్రి ముక్కులే అవి. 'ఈ ముక్కుతీరే వేర్పు, ఈ మొహమే వేరు!'

మరో పిల్లవాణ్ణి స్నానం మాడించి తీసుకుపోతూ నర్సు కనపడింది. అన్నపూర్ణ ఆమె నాపి, 'ఏమమ్మా, మా పిల్లాడు మారిపోలేదుగద!' అని అడుగుదామనుకుంది. అనుకోడమేగాని అడగలేదు. కొందరు కొన్ని పనులు చేద్దామనుకోడమేగాని చెయ్యలేరు. అలాంటిదే అన్నపూర్ణాను. అడిగితే ఆ నర్సు ఏమనుకుంటుందో? 'నీకేమైనా మతిగాని పోయిందా? మేం అంత వాళ్ళు తెలివకుండా మసులుతున్నామా?' అని ఝాడించి

నలిపెడుతుంది. పక్కనున్న బాలింతలంతా పకపకా నవ్వేశారు తన్ను చూసి! ఆమెకు నోరు పెగిలిందికాదు.

తనకు పక్కనే అవతల ఆ తల్లి ఎవరోగాని ఆమెకుకూడా ఈ అనుమానం తగలవలసిందేగా? ఆవిడ ధైర్యంచేసి అడిగేస్తేకూడదమ్మా పోనీ! అప్పుడు, 'ఇదుగో వీడేమో చూసుకోండి' అని చెప్పి ఇచ్చేసి తన పిల్లణ్ణి తెచ్చుకోవచ్చు. అలా జరిగితే ఎంత బాగుండిపోను! 'నా పిచ్చిగాని అలా ఎందుకు జరుగుతుంది?' ఆ తల్లికికూడా అనుమానం తగిలినా, ఆమె గప్‌చిప్‌గా ఊరుకుంటుందిగాని బయటపెట్టదు! ఏమంటే ఈ నల్లటివాడికి బదులు దబ్బపండులాంటి పిల్లవాడు దొరికితే ఏ తల్లి వద్దంటుంది?

పాపం ఆమె ఆ పంటివానికేసి ఓమాటు ఎదవానికేసి ఓమాటూ చూస్తూ నీళ్లు నమిలి బాధపడింది. సాయంత్రం నాలుగు కొట్టడంతోనే చూచిపోడానికని వచ్చేవాళ్లకోసం ఆస్పత్రి తలుపులు బారుపెట్టారు. అందరితోబాటు రఘుపతిగారుకూడా వచ్చి భార్యని పలకరించారు. ఆమె అతనితో తన అనుమానాన్ని చెప్పింది. ఆయన నవ్వేశాడు. 'నీకు ఆస్పత్రి అంటే ఇష్టంలేకపోవటమే ఈ అనుమానానికంతకీ కారణం' అనేశాడు. అన్నపూర్ణకి ఆస్పత్రి అంటే ఎంత అయిష్టమో, రఘుపతికి అంత ఇష్టం అక్కడ అంతా ఒక 'సిస్టం' ప్రకారం జరుగుతుందనీ, అందరూ 'కరక్టు'గా ఉంటారనీ, ఆయన నమ్మకం. అందుచేత అన్నపూర్ణ తన అనుమానానికి హేతువులు చూపుతోన్నా ఆయన కళ్ళు చూశాయికాదు చెవులు విన్నాయి కాదు. ఇంగ్లీషులో 'ఫూలిష్, నాన్‌సెన్సు!' అని నవ్వేశాడు.

అన్నపూర్ణని ఆస్పత్రినుంచి ఐదోరోజున వెళ్ళిపోవచ్చునన్నారు. వెళ్ళటం అంటే ఆమెకు చెఱవిముక్తిగానే తోచింది. కాని గేటువదలి తాను కూర్చున్న బండి ఆస్పత్రికి దూరమౌతూన్నకొద్దీ సొంత బిడ్డణ్ణి వదలేసి పోతూన్నట్లూ, వాడి స్థానే ఎవణ్ణో తెచ్చుకుంటూన్నట్లూ అనిపించింది.

బారసాల జరిగింది. నామకరణ సమయంలో 'ఏం పేరు?' అన్న మాట వచ్చినప్పుడు 'ఎవరో కన్నన్న' అని పెట్టండి! ఏ పేరైతేం?' అందామె. రఘుపతే నిర్ధారణచేసి, బియ్యంమీద 'సూర్యప్రకాశం' అని రాశాడు. "ఈ నల్ల నేరేడు పండుని సూర్యప్రకాశ మనటమేమిటి?" అని నవ్వుతుంది అన్నపూర్ణ.

వాడు నల్లనే కోపం చేసినా, ఆమె వడిలో ఉన్నప్పుడల్లా ఆమెకు పాలు చేపొస్తూనే ఉండేవి. ఆమెకేం అనుమానమున్నా, ఆమె పాలివ్వటం మానా లేదు; పెంచక పోనూ లేదు. పుట్టినరోజులూ చేసింది; భోగిపళ్ళూ పోసింది. అల్లరిచేసి ప్రాణం విసిగించినప్పుడు కొట్టనూ కొట్టింది. కాని చిత్రమేమిటంటే, కొట్టిన కొద్దీ వాడామె దగ్గరికొచ్చి ఏడ్చేవాడు కాని దూరంగా పోయేవాడు కాదు. వాడు ఏడుస్తోంటే ఆమెకు జాలి వేసేది; ఎక్కువగా జాలివేసేది కూడాను! ఆ జాలికి కారణం ఆ అనుమానమే. సొంత పిల్లవాణ్ణి కొట్టినా అంత తప్పులేదు. నర్సు పొరపాటువల్ల సొంతతల్లిని పోగొట్టుకొని తనవద్దకు వచ్చిన నిర్భాగ్యుడేఐతే, వాణ్ణి తను కొట్టవచ్చా? క్రమంగా ఆమెకు ఈ రకం సానుభూతి ఎక్కువై, 'వీడికి నావల్ల ఎట్టి అపచారం జరగకూడదు.' అనే నిశ్చయానికి ఆమె వచ్చింది. తన పిల్లవాడు ఏ తల్లివద్దనున్నాడో? వాణ్ణి ఆమె ఎలా పెంచుతోందో, కొడుతోందో, ఏమిటో?...ఇలాంటి ఊహవచ్చి, 'ఏమైనా వీణ్ణి నేను న్యాయంగా పెంచాలి!' అనుకుంది. తల్లికన్నా ఎక్కువగా పెంచింది!

సూర్యప్రకాశం 'అన్న'లకన్నా ఛాయ తక్కువే కాని ఎక్కువ బుద్ధిమంతుడన్న పేరు తెచ్చుకున్నాడు. ఆవిడ 'అన్నమాటే అది' ఇక్కడ సరుకుతీసి అక్కడ పెట్టమంటే ఆ తక్కిన నలుగురూ పెట్టేవారు కాదుట. వీడలా కాదు. అమ్మకూడా వుండి పనివేళ అవీ ఇవీ అందిస్తూ ఆడపిల్ల ఆసరాలేదన్న లోపం కనిపించకుండా చేసేవాడు. ఆవిడ ఏంచేసినా, మొగుడూ ఆయన ముక్కు తీరేవచ్చిన ఆ నలుగురు బిడ్డలూ వంకలెంచుతూ గాని తినేవారుగారు. ముక్కు కోణాలూ కాస్త పెద్దవే ఐనా, శరీర ఛాయ కొంచెం నలుపే ఐనా, ప్రకాశిగాడు మట్టుకు అమ్మ చేసినదల్లా మెచ్చుకుని తింటూండేవాడు. వాడు, 'అమ్మా, బాగుందే మిఠాయి!' అంటే, ఆవిడకి మరీకాస్త పెట్టబుద్ధేసేది.

ఒకనాడు అన్నపూర్ణకి మొగుడితో పేచీ వచ్చింది. గృహపతికి ముక్కుకొననే ఉండేది కోపం. పిల్లలతల్లి అన్న ఆలోచన లేకుండా అఘా[illegible]డావేళ ఆ ఇల్లాలుపైన చెయ్యికూడా చేసుకున్నాడు. ఆవిడ కోపంతోనూ దుఃఖంతోనూ వెళ్లి పడుకుంది. వంట సిద్ధంగా ఉన్నది మాటాడకుండా వడ్డించుకుతిని ఆయన ఆఫీసుకీ, పెద్దకొడుకు కాలేజీకి తక్కిన

ముగ్గురూ బళ్లోకి వెళ్ళిపోయారు. ప్రకాశ్‌గాడికికూడా ఇంత పప్పూ అన్నం కలిపి కంచంలో వేసిపోయారుగాని, అది అలాగే ఉండిపోయింది. పుచ్చకాయలా ఎప్పుడూ కబుర్లు చెప్పుతూ అమ్మ వెంట తిరగటం వాడికి అలవాటు. ఆమె వెళ్లి పడుకోడంతో వాడికాళ్లకి నోటికీ బందాలుపడి వాడికేం తోచిందికాదు. బిక్క మొహం వేసుకుని చాలాసేపు ఒకమూల కూచున్నాడు. ఇంక ఉండబట్టలేక మెల్లిగా తల్లి మంచందగ్గరకి వెళ్ళాడు. అప్పటి కావిడకి నిద్రపట్టినట్టుంది. కళ్ళుమూసింది. వాడు ఆమె పక్కలో పడుకునేసరికి మెలకువ వచ్చింది.

"బువ్వ తిన్నావుట్రా ?"

"లేదు"

"ఏం ?"

"నాన్న మంచివాలుకాదే. నిన్ను కొత్తాలు"

"బువ్వ తిను కొట్ను"

"వొద్దే. నిన్ను నాన్న కొత్తాలు" అని వాడు వెక్కి వెక్కి యేడవటం మొదలెట్టాడు. ఆమె లేచి బుజ్జగించింది. కంచం దగ్గిరకి తీసుకెళ్లి ముద్ద నోటికందిచ్చింది. వాడు నోరు తెరవలేదు. 'తినవేంరా' అంటే 'నువ్వుకూలా తినవే అమ్మా!' అన్నాడు. ఆమె కళ్లమ్మట నీళ్లు బొటబొట రాలాయి. ఐదేళ్లు నిండాయో లేదో ఆ రోంతవాడికి తనంటే ఎంత ప్రేమో అనిపించిందామెకు చచ్చి స్వర్గానవున్న తల్లి జ్ఞాపకంవచ్చి, 'మా అమ్మే వీడి నోట ఈమాట అనిపించింది!' అనుకుందామె.

మరునటి సంవత్సరం రఘుపతి. పెద్దకొడుకు కామేశ్వరరావుకి 'మంచి' సంబంధం వచ్చిందని సంబరపడి పెళ్లి చేసేశాడు. రఘుపతికి పిల్లలు తప్ప వేరే ఆస్తి ఏమీలేదు. కామేశ్వరరావు చదువుమానే అవతలవాళ్లు కట్నంకూడా ఇచ్చిచేశారు. కట్నంలోంచి సగంతీసి కోడలికి నగలు చేయించాడు రఘుపతి. మిగతా సగం, సదస్యానికనీ, పల్లకీ భజంత్రీలకనీ, గృహప్రవేశానికనీ ఖర్చైపోయింది. అప్పు చెయ్యనక్కర్లేకుండా చక్కని చుక్కలాంటి కోడలు చక్కావచ్చిందని సంబరపడ్డారు దంపతులిద్దరూను.

కాని కోడలువచ్చిన కొద్దికాలంలోనే రసరసలు బయల్దేరాయి. కామేశ్వరరావుకి ఊళ్లోనే ఉద్యోగమైంది. అతడు తెచ్చిన జీతం ఇంటో

ఇచ్చేయ్యటం ఆ పిల్లకి అంతగా నచ్చలేదు. పెద్దకొడుకు అందివస్తే తర్వాత వాళ్ళ బతి జీతాలను ఇబ్బంది పడనక్కర్లేదనుకున్నాడు రఘుపతి. రెండువేల కట్నం ఏ గంగలో కలిసిందన్న ఆరా తీశాయి అత్తింటివాళ్ళు; క్రమంగా కామేశ్వరరావుకూడా వాళ్ళపక్షమే అనిపించింది రఘుపతికి. ఒకనాడు ఆయన తొందరపడి, మాటలన్నాడు కొడుకుని. సరిగ్గా ఆయన పోలికేగా ఆ కొడుకులూను. ఆయన ముక్కు, ఆ ముక్కోపం వాళ్ళకీ ఉంది. 'ఇప్పుడే పోతా నీ కొంపలోంచి!' అంటూ కామేశ్వరరావు, పెళ్ళాన్నీ ఆదిక సాదె సామాన్నీ ట్రంకుపెట్టెనీ బండిలో కెక్కించి వేరు వెళ్ళాడు.

రెండో కొడుకు మధుసూదనం కామేశ్వరరావు కంటే ఎక్కువ తెలివిగా ప్రవర్తించాడు. 'నేను కట్నం పుచ్చుకోను' అన్నాడు. కాని తాను పుచ్చుకోదలచినదంతా పిల్లపేర భూమి రూపంలో రాయించుకున్నాడు. ఊళ్లో ఏదో నౌకరీవస్తే అదినచ్చింది కాదని చెప్పి బయట ఊరికిపోయాడు రభస లేకుండా వేరు కాపరం పెట్టుకోగలిగి నాలుగురాళ్లు వెనకేయ్యగలిగేడు. రఘుపతి రెండుమూడుసార్లు తమ్ముళ్ల జీతాలమాట ఎత్తుతో జాబులో రాశాడు. కాని మధుసూదనం, 'ఈరోజుల్లో అన్నీ ప్రియం. నాకు వంట్లో ఆరోగ్యంగా లేదు మందులకే బోలెడు అప్పుచేయవలసి వచ్చింది' అన్న ధోరణిలో జవాబులు రాసి, 'ఇది పట్టిరొద్దు. లాభంలేదు' అనే అభిప్రాయానికి తండ్రిని తీసుకొచ్చాడు.

మధుసూదనం పెళ్లికి రఘుపతి అప్పుచెయ్యవలసొచ్చింది. ఆ అప్పు ఎప్పటికీ తీరక ఆయన చిక్కుపడ్డాడు. మూడోకొడుకు నరసింహమూర్తి పెళ్లికి ఆయన జాగ్రత్త పడ్డాడు. "మాకు కట్నం వద్దు, కానుకలూ వద్దు. ఉభయఖర్చులూ మీరే పెట్టుకొని, పెళ్లి చెయ్యండి మీ పిల్లకి మీ యిష్టం వచ్చిన నగలు మీరే పెట్టుకోండి" అన్నాడు. అలాగే జరిగింది వివాహం. పెళ్లైన యేడే నరసింహమూర్తి ఇంటరు ప్యాసయ్యాడు. "నేను నీకు బి. ఏ. దాకా చెప్పించలేను" అని కాళ్లు చాచాడు రఘుపతి. వియ్యాలవారికి కా సంగతి తెలిపి "అర్ధాంతరంగా మానిపించేస్తే ఎలాగ?" అని వాళ్లే, అల్లుడి బి. ఏ. [illegible] పూనుకున్నారు. అది పూర్తిఅయాక అతగాడికి

ఉద్యోగం కూడా వాళ్ళే చూసి పెట్టేరు. డబ్బు కోసమని నరసింహమూర్తికి జాబు రాయాలని రఘుపతికి అప్పుడప్పుడు అనిపించేది గాని, 'ఏ ముహం పెట్టి అడగటం?' అని, కొసకి కలం జేబులో పెట్టేసేవాడు.

వీరభద్రం సిక్స్‌ఫారం, ప్రకాశరావు థర్డుఫారం చదువుతుండగా రఘుపతి అవతారం చాలించాడు. అప్పు ఆసుల అంతులు చూసుకుంటే, మధుసూదనం పెళ్ళి బాపతు ఋణశేషం ఇంటి తనఖామీద ఇంకా మూడు వందలు దాకా ఉన్నదనీ, భీమాపాలసీ సొమ్ము వెయ్యిరూపాయల పైచిల్లర రాబోతోందనీ తేలింది అది ఎలా పంచుకోడమని పైకిపోయిన ముగ్గురు కొడుకులూ ఆలోచిస్తోంటే గమనించిన అన్నపూర్ణ నివ్వెరపోయింది. ఆవిడ దుఃఖం దిగమింగుకొని, "నామాట అటుంచి, ఇంకా మీకు ఇద్దరు తమ్ముళ్ళూ, వాళ్ళ చదువులూ, కార్యాలూ కథలూ ఉన్నాయన్న మాట మరిచిపోకండి" అంది. వాళ్ళు ఏమనుకున్నారో, మరి మాట్లాడక చక్కాపోయారు. భీమా సొమ్ములోంచి ఆమె ఋణశేషం తీర్చివేసింది ఆయేడు. ప్రకాశం థర్డు ఫారం తప్పిపోయాడు వాడు అన్నలంత తెలివైనవాడు కాడు చదువులో. ప్యాసుకి అత్యవసరమైనంతగా శ్రమపడి మార్కులు గట్టించుకునేవాడు కాని ఆయేడు అమ్మకొచ్చిన కష్టం వాడిమనస్సు కలిచివేసింది. పుస్తకం పట్టలేక పోయేవాడు. పట్టినా బుర్రలోకి ఏమీ ఎక్కేదికాదు.

మళ్లీయేడు వాడు థర్డుఫారం, వీరభద్రుడు స్కూలుఫైనలూ ప్యాసయారు. దానితో భీమాసొమ్ము చెల్లు అయింది. అన్నపూర్ణమ్మ, "ముందు మాటేమిటి?" అని నౌకరీలలో ఉన్న కొడుకులు ముగ్గురికీ కార్డులు రాయించింది. "ఎవళ్ళ సంసారాలు వాళ్ళకే ఉన్నా"యన్నారు ఆ పసిడివన్నెల ముసిణిపళ్లి ముగ్గురూను. ఆవిడ ఒక్కగది కేటాయించుకొని ఇల్లంతా అద్దెకిచ్చింది. ఆ అద్దెతో భోజనమే గడవనప్పుడు చదువు లెలాసాగుతాయి?

ఐతేం, మనదేశంలో పెళ్ళిళ్ళు మాత్రం అడ్డవుకదా. భద్రానిక్కూడా సంబంధం వచ్చింది. ఆయనెవరో మిల్లు గుమాస్తాట. ఒకర్తే కూతురుట. భద్రాన్ని ఇల్లరికానికి తీసుకుపోయి, మిల్లు లెక్కలలో తరిఫీదిచ్చాడు. ఈవిధంగా ఆ నాలుగు బంగారువన్నె పిచికలూ నలుదిక్కులకూ ఎగిరిపోయి, ఆ ఇంట అన్నపూర్ణా, ఆ నల్లనేరేడుపండూ మిగిలారు.

ఒకనాడు పక్కింటావిడ వచ్చికూచుని, అన్నపూర్ణతో, ఇంక మా ప్రకాశానికికూడా పెళ్ళిఅయితే, నీ కష్టాలన్నీ గట్టెక్కినట్లే" అంది.

ఆమె వెళ్ళాక ప్రకాశం తల్లితో, "అమ్మా, నాకుమాత్రం పెళ్ళి చెయ్యకు సుమా" అన్నాడు.

"ఏమిరా?" అంది ఆమె నివ్వెరపోతూ.

"వదినలొచ్చి అన్నయ్యల్ని వేరుచేసేశారు. అన్నయ్యలొచ్చి నిన్ను పలకరించటమైనా లేదు" అన్నాడు వాడు.

"మన బంగారం మంచిదైతే కంసాలి నేరటం దేనికిరా బాబూ? ఇంతకీ నీ పెళ్ళాం నన్ను సరిగ్గానే చూస్తుందేమో" అన్నదామె.

"ఏమో, చూడకపోతే అప్పుడేమిటి చెయ్యటం? చేతులు కాలేక ఆకులు పట్టుకుని యేంలాభం?" అన్నాడు.

ఆ ఊళ్లోని వీధిబడి పెట్టుకున్న శిష్టుకరణం ప్రకాశాన్ని అసిస్టెంటుగా వేసుకున్నాడు. నెలకి ముప్ఫైరూపాయిల జీతం.

"స్థిరపడ్డావు గనక ఇంక పెళ్లిచేసుకోరా" అంది అన్నపూర్ణ.

"ఏం స్థిరపడ్డం? ఇల్లు పంచుకుంటామని అన్నయ్యలు వస్తారింక. అప్పుడు మన ఇద్దరికీ ఈ ముప్ఫై రూపాయలే ఆధారం" అంటూ బళ్లోకి వెళ్లిపోయాడు ప్రకాశం.

ఆరోజున ఇంట్లో కాపరం ఉన్నవాళ్లంతా సినిమాకి పోయి, ఆమె ఒక్కతే కూచుండిపోయింది. పద్ధెనిదేళ్ళక్రితం ఆమె ఆస్పత్రిలో పోసుకున్న పురిటిమాట జ్ఞాపకం వచ్చిందామెకు. ఆనాడు తను ఏమనుకుంది? 'ఆతల్లి ఎవరో పిల్లవాడు మారిపోయాడని తెలిసికూడా అందమైనవాడని మోజుపడి గప్‌చిప్‌గా ఊరుకుంది! నాకు అపచారం చేసింది!' అని, ఆ మాటలే ఇప్పుడు జ్ఞప్తికొచ్చి, 'ఆ ఇల్లాలికి నేనే అపచారం చేశాను! ప్రకాశం అందగాడు కాకపోయినా హృదయసౌందర్యం ఉన్నవాడు. తల్లిముప్పు తీర్చగలవాడు. ఇలాంటివాణ్ణి నేను దక్కించుకుని, నా ఎర్రతేలు నాకెట్టి ఆమెకు అప్పగించాను! ఆమెకు ఇంక వేరే సంతానం లేదేమో...!

వాడ్ని నేను ఏం తిప్పలు పెడుతున్నానో!' అని ఆవిడ హృదయంలో మరొక్క ఊహకూడా బయల్దేరింది. 'తక్కిన కొడుకులకు చెప్పించినంత చదువుకూడా చెప్పించలేకపోయాను వీడికి! ఆ తల్లి శ్రీమంతురాలైఉంటే, వీడూ మావద్దనే పెరిగిఉండేవాడు. ఈ కాయకష్టం లేకపోను! తల్లికీ కొడుక్కీ నేనే అపచారం చేశాను...!' ఈ ఆవేదన అన్నపూర్ణని సదాకాలం బాధిస్తూనే ఉండిపోయింది.

---

# కథాసాగరం

**5**

పన్యాల రంగనాథరావు

......కథలు......